# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938–1972)



అక్టోబరు 1973

సంపుటము : 50 : సంచిక : 10 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## అక్టోబరు 1973

# అక్షరాంశ

## డా. ముదిగొండ శివప్రసాద్

అవిగో, అక్షరాలు ఇక్షుఖండాల్లా నిలబడ్డాయి —
ప్రతి పర్వ రసోదయంగా,
ఇవిగో అక్షరాలు దోసపాదుల్లా[1] పారాడాయి–
పౌష్కల్యాన్ని సూచిస్తూ,
అక్షరాలు పారవతాల్లా దశదిశలకూ ఎగిరాయి తెల్లని రెక్కలతో
—'కృత'యుగ సిద్ధికై
అక్షరం 'నీలకంఠ'మై అమృత నృత్యం చేసింది
మనోక్షీర సాగర మథనంలో–కథనంలో–

* * *

కులాయంవంటి మనస్సునిండా
రేయింబవళ్లు అక్షర శకుంతలాల కుహూకుహూ నాదాలు–
ప్రణవ ప్రణయ నినాదాలు–

కోశగ్రస్తమైన కృపణు నిలా కృపాణంలా
సార్థకత్వానికై నిరీక్షణాలు
అక్షర మన్మథ వ్యోమ జ్యావల్లినుండి
ఐంద్రి చాపాలు-ప్ర–పంచసాయకాలు
అక్షరం పూనకం పూనినప్పుడు
అతీంద్రియ రసోన్మత ప్రసంగ ప్రసారాలు

*

అక్షరమంటే ఇంతకూ ఏమిటి?
అది లేఖినితో నీవు గీచే గీత కాదు
ఒక లిపి సంజ్ఞ కాదు.
అక్షరం ఒక సజీవ చైతన్య సౌందర్యమూర్తి!
రసానంద గాత్రి!

---

1. "ఉర్వారుక మివబంధనా న్మృత్యోర్ముక్షీ యమామృతాత్"

ప్రతి అక్షరానికీ రంగూ, రుచీ, వాసనా, వుంటుంది
లఘిమా–గరిమా, సంకోచమూ-వ్యాకోచమూ వుంటుంది.
ప్రతి అక్షరమూ కదులుతుంది–కదిలిస్తుంది
కళ్ళూ కళ్ళూ కలిపి[2] కథలెన్నో చెప్తుంది–
కవిగానూ చూస్తుంది.
అక్షరం ఐరావతం లాంటిది
ఇంద్రుడు మాత్రం ఋగాని కొకడా

అక్షరంనుండి ఉచ్చైశ్శ్రవ హయహేష-రస ఘోష
రౌతుకొద్దీ గుర్రం మరి!
అక్షరం ఉపాసకులకు ఆనందవల్లి–
శివం !

అర్థగౌరవంలేని ఉత్తర కుమారులకు అది
శమీవృక్షంమీది శవం! జడం!!

అక్షర వేదానికి ఉద్గాత వీరు వ్యుత్పన్నుడు
అక్షరాంశలో నవాంశను చూచేవాడు ప్రతిభాశాలి
అక్షరాసి ఒడుపు తెలిసి ముట్టడం పేరే సాధన
సాధనా-ఉపాసనా లేని చిత్రకవికి అక్షరం
ఆహుతి కోరే యజ్ఞకుండం–అగ్నిభాండం !!

అందుకే ఓ కవీ!
ముందుగా అక్షరాన్ని ఉపాసించడం నేర్చుకో!
అమ్మలా అమృత హస్తంతో నీ ఎద నిమిది సేద తీర్చుతుంది
అంతరంగంలో ఆనంద తరంగం పొంగిస్తుంది–
అక్షరోపాసకుని రోజూ
'నవ' కాయ పిండివంటలతో విందు భోజనాలు
నందన సుందర 'శయ్యా' విలాసాలు–
అరుగో!
అక్షరలింగం చుట్టూ అనేక వేల వ్యాసులు–యాస్కులు–
అక్షర మధువుకోసం అసంఖ్యాకులు–ఉమర్ ఖయామ్‌లు
అక్షర వధువుకోసం పినవీరభద్రులు–పిగ్మాలియన్
శిల్పాకార సదృశులు–

---

2. చతురక్షర సంయోగం.

అక్షర యజ్ఞంలో సమిథల్లా
అనేకులు-గుణార్థ్యులు-షనావహా కర్తలు!

అక్షరమే బిల్వంగా
ఆ పైన జ్యోతిర్లింగంగా
అన్నింటికీ చివర నీవే అక్షరాంశగా గుర్తించ గలిగినప్పుడు
(ఆరాధనా-ఆరాధ్యమూ-ఆరాధకుడూ
అన్నింటినీ అక్షరంలోనే చూడగలిగినప్పుడు)
అదేనయ్యా నీ ఉపాసనలో శిఖరాగ్ర దశ,
పరా విద్య !!

---



# శ్రీ దేవి లాలిత్యము - సౌందర్యము

## శ్రీ దోర్బల విశ్వనాథ శర్మ

(గత సంచిక తరువాయి)

లలితా సహస్రనామ స్తోత్రమందలి ప్రథమ ద్వితీయ తృతీయ నామములు శ్రీ మాతా శ్రీ మహారాజ్ఞీ శ్రీ మత్సింహాసనేశ్వరీ అనునవి లక్ష్మీధర సమ్మతమైన షోడశియగు 'శ్రీం' ప్రాధాన్యమును బోధించును. ప్రథమనామ ప్రథమ పదమగు శ్రీ శబ్దములో శివశక్త్యైక్య రూపిణీ అను అంతిమ నామాంతిమ పదమగు రూపిణీ శబ్దమును కలిసినచో 'శ్రీ రూపిణీ' అని యేర్పడుటచే ల. స. నామ స్తోత్రము శ్రీ రూపిణియే యని యేర్పడుచున్నది. వీనిలోని శకార రేఫములకు చివరి ఈ కారమును కలిపినచో 'శ్రీ' యగుటచే మొత్తము స్తోత్రము 'శ్రీ' యే యగుచున్నది. 'శ్రీ'యందు ఈ ప్రశ్లిష్టమై యుండుటచే గుప్త షోడశియగు 'ఈ' లీనమై యుండినట్లే శ్లోకమునందలి 'లక్ష్మీం' అను శబ్దమునను 'ఈ' లీనమై యుండుట 'శ్రీ' 'ఈ' ల ఐక్యము సాధించును. ఇట్లే శ్లోకము శ్రీ విద్యా పంచదశి శ్రీ షోడశాక్షరీ విద్యయగుటను గుప్తమైన ఈ కారము ద్వారమున బోధించుచున్నదనుట స్పష్టము. ఈ శ్లోకమందలి మహాభోగరసికా అను పదమునందలి మహాభోగ శబ్దము మహాభోగా (219) నామార్థకమగుటయు స్పష్టమే.

శ్రీ శంకరులు సౌందర్యలహరియందు శ్రీ దేవి శరీర సౌందర్యమును నలుబది రెండవ శ్లోకము మొదలు తొంబది యాఱవ శ్లోకమువఱకు మొత్తమే బదియారు శ్లోకములలో కిరీటాది పాదాంతముగా వర్ణించిరి. ఈ పద్ధతి ల. స. నా స్తోత్రారంభమున నవలంబింపఁబడిన పద్ధతియే అన్ని శ్లోకములలోను ల. స. నామముల యర్థమును సమ్యగ్గ్రాహణా బలమున విస్తరించి మనోహరముగ శంకరులు వర్ణించినారని తౌల్య పరిశీలనమున స్పష్టమగును.

ల. స. నా స్తోత్రమున కురువిందమణి శ్రేణీ కనత్కోటీరమండితా (14) నామము శ్రీదేవి కిరీటము మణిగణముతో నొప్పునదిగా వర్ణించును. శంకరులు నలుబది రెండవ శ్లోకమున గగనమణులే (సూర్యులే) మణులుగా పొదుఁగబడిన బంగరు కిరీటమును వర్ణించినారు. అందలి చంద్రశకలము ఇంద్రధనుర్బుద్ధిని కలిగించుటకు కనకమణికాంతులు హేతువులుగా నుత్ప్రేక్షించినారు. ల. స. నా స్తోత్రమున శిరఃస్థితా (592) చంద్రనిభా (593) ఇంద్రధనుః ప్రభా (595) నామములు దేవికది విడిగా శ్రీదేవిని పేర్కొను నట్టివి. ఈ నామముల నుండి బాలచంద్రనిభ ఫాలస్థ బాలచంద్రుని శిరః కిరీటస్థుని జేసి యాతడింద్రధనువుగా తోచుటకు కిరీటమణికాంతులు కారణములను భావము నఖండముగా భావించుట మిక్కిలి రమణీయముగ నున్నది.

కిరీటమును విశ్రాంతి సమయమున తీసివేయగా తెల్లనిపూలతో నల్లని కురులతో ప్రకాశించు శ్రీ దేవి శిరము చంపకాశోక పున్నాగ సౌగంధికలసత్కచా (13) నామమునందునలెనే సౌందర్యలహరిలోని 43 వ శ్లోకమున వర్ణింపఁబడినది. పై నామమునందలి పుష్పములు నీలచికుర (185) యగు శ్రీదేవి నల్లని కురులచే ఇంద్రుని నందనోద్యానము నుండి సహజ సౌగంధ్యహేతువున తత్ప్రాప్తి కొఱకు ఆకర్షింపఁబడి అందు నివసించుచున్నట్లు ఉత్ప్రేక్షించుట నామార్థమును రమణీయ తర

ముగ సాక్షాత్కరింపఁజేయుట కొఱకే. నల్లని కురు లంధకారమును తొలగించు గాక యనుట తమోపహా (361) బంధమోచనీ (547) నామములందలి తమోబంధములు మోక్షప్రతిబంధకా జ్ఞానరూపము లని చెప్పుటయే.

అష్టమీచంద్ర విభ్రాజదలిక స్థల శోభితా (15) నామము అష్టమీ చంద్రనివశేషలేక అష్టమీ చంద్రునితో ప్రకాశించు ఫాలమును బోధించును ఈ రెండర్థములను భావించి 46 వ శ్లోకమున చంద్రుని యొక్క అష్టమినాటి యా రెండర్థములు సుధా లేపమున తలక్రిందులుగా వతుకఁబడగా శ్రీదేవి ముఖము పూర్ణబింబముగా దర్శనీయమయినట్లు చెప్పుట విశిష్ట ముగా నున్నది. రాకాహిమకరః అను పదము రాకేందు వదనా (314) నామమునకు స్మారకముగా నున్నది.

ల. స. నా స్తోత్రమున సుముఖీ (460) నళినీ (461) నామములు సన్నిహితములుగా నున్నవి. కాని వాని యర్థములు మాత్రమే సన్నిహితములుగా కనిపించవు. అట్లే కాలకంఠీ (465) కాంతి మతీ (466) నామార్థవిషయము కూడ కాలకంఠ మున కాంతి నూహించుకొనినప్పుడు వాని సాన్నిహిత్యము సమంజసమే. శ్రీదేవి సుముఖి యగుగాక! మఱి నళిని యెట్లగును? అన్న ప్రశ్న మిగిలిపోవును. ఆమె ముఖము నళిన మనుకొనిన ఆమె నళినియగును. కాని నాళము లేనిదే ముఖము నళిన మెట్లయ్యెను? అన్నచో ఆమె గ్రీవము నాళకాంతిని ధరించినదని సమాధానము. నాళములకు కంటకములుండును గ్రీవమునకు కంట కములు లేనిచో అది నాళ శ్రీధరమగుట యెట్లు అన్నచో శివు నాలింగనమున దానికి కంటకము లేర్పడిన వట! ఇట్లే నాలుగు నామములకు సాన్నిహిత్యము యొక్క సామంజస్యము (68) వ శ్లోకమున సమ ర్థింపఁబడినది. ఇంతేగాక నళిని మృణాళిని కూడ నగును. శ్రీదేవి కూడ కంఠమున ధరించిన హారలతికతో మృణాళిని యగుచున్నది. మృణాలము జంబాలమలినము శ్రీదేవి శివమూర్తి (407) యగుటచే కాలకంఠి, ఆ కంఠమందలి కాంతిహారలతికపై పడి దానికి మృణాళీ లాలిత్యము కలిగినది. విభిన్ననామముల రమణీయ సమైక్యభావనమున కిది మఱొక నిదర్శనము.

ఉన్మేషనిమిషోత్పన్న విపన్న భువనావళిః (281) అను నామముయొక్క యర్థమును ఏబదియైదవ శ్లోకముయొక్క పూర్వార్థమున నిరూపించి ఉత్తరార్థ మున జగత్ప్రలయము కలుగకుండుటకే నీ చూపులు నిమేషమును పరిహరించినవని యుత్ప్రేక్షించుట కాన నగును. ఇందలి యుత్ప్రేక్ష కరుణారస సాగరా (326) నామార్థభావనా ఫలము. ఇందలి పరిహృతనిమేష శబ్దము దేవేశీ (608) పరదేవతా (369) నామ ప్రతిపాద్య దేవతాత్వభావన నావిష్కరింపఁజేయును.

దరాందోలిత దీర్ఘాక్షీ (602) లోలాక్షీ (454) నామగతశబ్దార్థాను వాదము ఏబదియేడవ శ్లోకమందలి 'దృశా ద్రాఘీ యస్యాదర దలిత నీలోత్పలరుచా' అను ప్రథమ పాదమున నీలోత్పలరుచి సమేతమై సాక్షాత్క రించును.

ఏబదియవ శ్లోకమందలి ప్రథమ పాదము 'కవీనాం సందర్భస్తబక మకరందైక రసికమ్' అనునది. ఇది కావ్యాలాప వినోదినీ (614) రసజ్ఞా (800) నామార్థ మును కర్ణయుగల పరముగా యోజించును. ఆ కర్ణ యుగలమును నవ (నూతన) రసాస్వాద చాపల్యము గల కటాక్ష వ్యాక్షేపములనెడి తుమ్మెద కొదమలతో తాకుచున్న నేత్రములనుచూచి ఫాలనేత్ర మసూయచే నెఱ్ఱనైనదను మిగిలిన మూడు పాదములయందు చేయఁబడిన రమణీయమగు నుత్ప్రేక్షచేత కటాక్షా శ్రయములైన నేత్రములకు ఎఱుపురంగులేని తెల్లని నల్లని కమలములతోడి సామ్యము వ్యక్తమగును.

యేబది మూడవ పద్యమందలి విభక్త త్రైవర్ణ్యం వ్యతికరిత లీలాంజన తయా అను ప్రథమ పాదము మూడు నేత్రములును మూడు రంగులకు నిలయములైనట్లు చెప్పును. అందుచేత పద్మనయనా (247) పుష్కరేక్షణా (806) రాజీవలోచనా (308) నామత్రయ ప్రతిపాద్య త్రివిధకమల సాదృశ్యము స్ఫురించును ఈ పద్య

మందలి మిగిలిన మూడు పాదములందూ రంగులు రజ సత్త్వ తమో గుణములని బ్రహ్మ విష్ణు రుద్రు లను మరల మరల సృజించు సామర్థ్యము గలవనియు చెప్పుటచేత త్రిగుణా (985) త్రిణయనా (453) త్ర్యంబకా (768) త్రిగుణాత్మకా (764) నామా ర్థముల సమైక్య భావమును వ్యంజింపజేయును.

ఏబది యొకటవ శ్లోకము రససేవధి (801) నామార్థము నవ్వరస విధాన దృష్టి పరమునుగా యోజించును. ఏబది రెండవ శ్లోకము తృష్ణా క్షయ రూపమగుటచే విలక్షణమైన శాంతరసమును శివా శ్రితమైన దానిని అష్టరసనిధాన దృష్టికాశ్రయమైన నేత్రద్వంద్వము పరద్రోలుటను చెప్పుటచే తృతీయ మగు ఫాలనేత్రము శాంతరసాశ్రయమని జ్ఞానరూప మని శివరూపమనియు వ్యక్తమగును. ఇంతేగాక ఆ నేత్రములు స్మరశర విలాస కలనములని చెప్పుటచే మన్మథునియయిదు బాణములలో మొదటిదగు అర విందసామ్యమును వ్యక్తమగును. ఈ శ్లోక సంబో ధనమునందలి కలికా శబ్దము ఆనంద కలికా (730) నామమును స్మరింపజేయును.

నలుబది యెనిమిదవ శ్లోకవిూ నేత్రములను సూర్యచంద్రాగ్న్యాత్మకములని అహోరాత్రి సంధ్యా కారకములనియు చెప్పును. ఇందలి అహశ్శబ్దము విశ్వ రూపా (256) జాగరణీ (257) నామములను త్రియామా శబ్దము సుప్తా (260) ప్రాజ్ఞా త్మికా (261) నామములను సంధ్యా శబ్దము స్వపన్తీ (258) తైజసాత్మికా (259) నామము లను నేత్రపరములనుగా వ్యాఖ్యానించుచు మహాకాళీ (753) నామముచే చెప్పబడు అహోరాత్రి సంధ్యా రూప త్రికాలముయొక్క నేత్రకార్యత్వమును వివ రించుచున్నది. ఇందలి సంధ్యామ్ అను శబ్దము సంధ్యా (422) నామముయొక్క ద్వితీయా విభక్త్యంత రూపమే. దివసనిశయోః అంతరచరీం అను రెండు సమస్త పదములుగల సంధ్యావిశేషణము దివసనిశా ద్వంద్వమునందలి క్రమము ననుసరించి మొదట సాయం సంధ్యను వ్యుత్క్రమము ననుసరించి ప్రాత స్సంధ్యను పిమ్మట ఆ ద్వంద్వమునందలి ప్రత్యేక పదముతోడి యన్వయము ననుసరించి మాధ్యాహ్నిక నిశీథ సంధ్యలను సూచించి దరదలిత హేమాంబుజ రుచి యనెడి దృష్టి విశేషణ బలమున ప్రాత స్సాయం సంధ్యలయందు సంధ్యా శబ్దమునకుగల రాగాధిని తెలుపుచున్నది. ఏబదిమూడవ శ్లోక విూ నేత్రములయందలి అరుణ ధవళ శ్యామరుచి త్రయాభ్యమున గంగానదీ యమునానదీ శోణానదము లనెడి తీర్థత్రయముయొక్క సంగమమని చెప్పుచు వామ నయనము యమునానది దక్షిణనయనము గంగానది ఫాలనేత్రము శోణనది యని సూచించుచున్నది.

'స్ఫురద్గండా భోగప్రతి ఫలిత తాటంక యుగ లమ్' అను 59 వ శ్లోకమందలి ప్రథమ పాదమున గల ప్రతిఫలిత శబ్దము గండస్థలములందలి దర్పణ స్వచ్ఛతను తెలుపుటచే పద్మరాగ శిలాదర్శ పరిభావి కపోల భూః (23) అను నామమును తాటంకయు గల శబ్దము తాటంకయుగ లీభూత తపనోడుప మండలా (23) అను నామమునుండి గ్రైకొనబడిన యెత్తు గడను సూచించును. మిగిలిన మూడు పాదములు ఈ రెండు నామములయొక్క సమ్యగ్భావనాఫలమైన ముఖ గత మన్మథ చతుశ్చక్ర రథత్వోత్ప్రేక్షను తద్వారా ఆ రథమునందలి శివరథ సామ్యమును తద్వారా మహావీర మన్మథునకు శివు డోడిపోవునను నాశమును నిరూ పించును.

61 వ శ్లోకము నవచంపక పుష్పాభ నాసాదండ విరాజితా (19) నామమునందలి నాసాదండము నాసా వంశదండమేయని తారాకాంతి తిరస్కారి నాసాభరణ భాసురా (20) నామమందలి నాసాభరణము ముక్తా మణియే యని చెప్పి ఆ నాసావంశదండమునుండి జన్మించినదే యీ ముక్తామణియని యీ రెండు నామముల సమైక్యభావనమును తెలుపును.

నవవిద్రుమ బింబ శ్రీన్యక్కారి రదనచ్ఛదా (24) నామము నలువదిరెండవ శ్లోకము వ్యాఖ్యానించుచు విద్రుమ శబ్దమును విద్రుమలతాఫల పరముగ పూర్వార్ధ మున యోజించి యుత్తరార్థమున బింబఫలన్యక్కా

(తిరస్కా)రము ప్రతిపాదించును. రదవచ్ఛదశబ్దము ఛందోను గుణతికై దంతచ్ఛదముగా పరివర్తితమైనది. శోభనదంతములు గలది యను నర్థముగల సుదతియను సంబోధనాంత పదమున కవ్యవహితముగా ద్విరుక్తమైన దంతచ్ఛద శబ్దమునందలి దంతశబ్దము (25) వ నామ మందలి దంత పర్యాయమైన ద్విజశబ్దమును స్మరింప జేయును.

అరువదిమూడవ శ్లోకము చారుహాసా (242) మందస్మిత ప్రభాపూర మజ్జత్కామేశ మానసా(28) మహాకామేశ నయనకుముదాహ్లాద కౌముదీ (403) దరహాసోజ్జ్వలన్ముఖీ నామార్థ సమాహరణము.

జపాపుష్పనిభాకృతిః (767) రంజనీ (209) నామార్థము నరువది నాల్గవ శ్లోకము జిహ్వాపరముగా వ్యాఖ్యానించును. తాంబూలపూరితముఖీ (560) కర్పూర వీటికామోద సమాకర్షద్దిగంతరా (26) నామ ద్వయ సమాహరణ మరువదియైదవ శ్లోకము.

నిజసల్లాపమాధుర్య వినిర్భర్త్సితకచ్ఛపీ (27) నామార్థాను సంధాన మరువది యారవ శ్లోకము అనాకలితసాదృశ్య చిబుక శ్రీ విరాజితా (29) నామము నందలి అనాకలిత సాదృశ్యము నౌపమ్య రహిత శబ్దముచే పేర్కొని చిబుకమును ముఖముకుర వృంతమునుగా నిరూపించుట 67 వ శ్లోకమున కాన నగును.

ఇట్లే 47 వ శ్లోకము సుభ్రూః (462) నామార్థమును మనోహరముగ నుత్ప్రేక్షించును. 69 వ శ్లోకము కామేశబద్ధ మాంగల్య సూత్ర శోభిత కంధరా (30) నామార్థ పరిచయమును వ్యక్తము చేయును.

గుహజన్మభూః (607) గుహాంబా (707) గణాంబా (720) నామములు విడివిడిగా కుమార గణనాథులస్తన్యపానమును వ్యంజింపజేయును. కుమార గణ నాథాంబా (442) నామము వారిరువురి స్తన్య పాన సాహచర్యమును వ్యంజింపజేయును. కుమారు డనగా కుమారస్వామి (స్కందుడు) స్కంద సోదరు డగుట గణనాథుడుగూడ కుమారుడే వీరిరువురు మాణిక్యకుతుపములవంటి శ్రీదేవి స్తనములయందలి యమృత రసమును గ్రోలి వధూసంగరసము నెరుగని వారై నేటికిని కుమారులుగానే యున్నారని 73 వ శ్లోకము కుమార శబ్దమును గణనాథునియందును నమన్వయింప జేయును. 72 వ శ్లోకముకూడ నీ స్తన్య పాన సాహచర్యమును తెలుపును గజముఖుడు స్వకుంభ సాదృశ్యమును గాంచినాడని గణనాథుని గజముఖత్వము యొక్క పరిహాస జనకత్వమును వివరించును. 74 వ శ్లోకమున కామేశ్వర ప్రేమ రత్నమణి ప్రతిపణస్తనీ (33) నామమందలి ప్రేమకు నిదర్శనముగా శివుడు గజాసురుజంపి వాని కుంభమునుండి రాల్చిన ముత్తె ములతోకూర్చి యొసగిన బింబాధరకాంతి బింబితమైన ప్రతాపవ్యామిశ్రమైన యాతని కీర్తియో యన నొప్పు ముక్తాహారమును ధరించిన శ్రీ దేవి వక్షోజ మండలము వర్ణింపబడినది.

శింజానమణి మంజీరమండిత శ్రీ పదాంబుజా (46) నామముచే జెప్పబడిన మంజీరశింజితము మన్మథుని నవ్వుగా 86 వ శ్లోకమున నుత్ప్రేక్షింపఁ బడినది. పదన్యాస పరిచయముగోరి విడువక వెంబ డించు హంసలకు పదవిక్షేపమును శిక్షించు పాదకమ లము 91 వ శ్లోకమున వర్ణింపఁబడుటచే మరాళీ మందగమనా (47) నామార్థము పూర్వపక్షముచేసి నట్లైనది. అనగా ఉపమానమైన మరాళము యొక్క యాధిక్యము తిరస్కరింపఁబడినది.

ఈ పాదకమలమునందలి పరమాల్ప ధూళి లేశమును బ్రహ్మ జగత్తుగా సృజించును. విష్ణువు ఆ జగమును మోయును. శివుడు దానిని మెదిపి ఒంటి నిండ పులుముకొనును. ఈ ధూళి శ్రుతి సీమంత సిందూరీ కృత పాదాబ్జ ధూళికా (289) నామము నందలిది. రెండవ శ్లోకమందీ విధముగా వర్ణింపఁ బడిన ధూళికి ఆశ్రయమైన పాదములు 84 వ శ్లోకమందలి శ్రుతీనామ్ మూర్ధానోదధతి తవయా శేఖరతయా అను ప్రథమ పాదమున శ్రుతి సతీశేఖర ములుగా పేర్కొనఁబడినవి. శేఖరశబ్దము శిరోభూషణ వాచకము. మణిపుష్పాదులు శిరోభూషణములు. అబ్జము గూడ కుసుమమే. శ్రుతిసీమంత సిందూర విభూషిత

బ్జమునందలి ధూళియే. శ్రుతి సంస్తుత వైభవా (930) అను శ్రుతి పదారబ్ధనామమును సర్వ వేదాంత సంవేద్యా (646) అను శ్రుతి శిరోనామక వేదాంత ఘటిత నామమును స్మరింపఁజేయును.

మొత్తము మీద శ్రీదేవి కేశములందు వక్రత మంద హసితమునందు సరళత గాత్రమున శిరీష మార్దవము కుచతటమున శిలాకఠోరత మధ్యమున కృశ భావము జఘనమున విశాలత అను పరస్పర విరుద్ధ ధర్మములు గలిగియున్నవని 93 వ శ్లోకము చెప్పుటచే సూచింపఁబడిన విరోధాభాసము వ్యక్తావ్యక్త స్వరూపిణీ (399) విద్యావిద్యా స్వరూపిణీ (402) క్షరాక్షరాత్మికా (758) పరాపరా (791) ఇత్యాది నామార్థ విరోధా భాసమును వ్యంజింపఁజేయును. ఇందలి నాల్గవ పాదము జగత్త్రాతుంశంభోర్జయతి కరుణా కాచి దరుణా అనునది సర్వారుణా (49) సాంద్రకరుణా (198) నామార్థముల సంయోజింపఁ జేయును. కాచిత్ శబ్దము ఆరుణ్యములోని సర్వాతిశయ భావము కరుణలోని సాంద్రత్వమును మనము చెప్పఁజాలమని వ్యంజింపజేయును.

95 వ శ్లోకము శ్రీ దేవి యలంకార సామగ్రిని వివరించుచు ముఖచంద్ర కలంకాభ మృగనాభి విశేషకా (16) నామములోని కలంకాభ మృగనాభి శబ్దములచే చెప్పఁబడిన సాదృశ్యమును కలంకః కస్తూరీ యని యభేద రూపముగా పరిణమింపఁ జేయును. చంద్రుడు పన్నీరుగా కలలు కర్పూర శకలములుగా ఆకసము బొట్టుపెట్టెగా నిరూపింపఁబడుట ఇందలి అపూర్వ విశేషము. 99 వ శ్లోకము శంభుమోహినీ (955) నామ వ్యాఖ్యానము.

శ్రీ దేవి సిందూార తిలకాంచిత (636) ఈ యంశమును భావించి శంకరులు సృష్టించిన సౌందర్యలహరీ పరీవాహమున మనము తల మున్కలగుట తప్పదు. ఇట్లు ప్రతి శ్లోకము నుదహరించి నామార్థమెట్లు రమణీయతరముగ విస్తరించి వర్ణింపఁబడినదో చెప్పఁబూనఁ బోయినచో ప్రత్యేక గ్రంథమే యగును.

ఇక ల. స. నా స్తోత్రమందు వర్ణింపఁబడిన షట్చక్ర కమలభేదన శ్రీ చక్రవర్ణనా శ్రీ దేవి స్వరూప ధ్యానా ద్యంశములను గూర్చి స్వల్పముగ వివరించి యీ వ్యాసము నుపసంహరించెదను.

మూలాధారము మొదలు ఆజ్ఞాచక్ర పర్యంతముగల సుషుమ్నామార్గము కుల పథమని చెప్పఁబడును. కుండలినీశక్తి అంతవఱకు కులయోగిని (95) ఆ తరువాత కుల పథమును భేదించి కులోత్తీర్ణ (715) యగును. ఈ రెండు నామములను వివరించిన తొమ్మిదవ శ్లోకము కుండలినీ (110) నామమును గుప్తముగనే యుంచినది. అయినను ప్రకాశింపఁజేయుచునే యున్నది. ఇందలి నాల్గవ పాదము 'సహస్రారే పద్మే' అని సహస్రదళ పద్మస్థా (529) నామమును వివరించును. సుధాధారాసారైః అని ఆరంభింపబడిన పదవ శ్లోకము సుధాసారాభివర్షిణీ (106) కులకుండాలయా (440) నామ ద్వయమునకు వ్యాఖ్యానము.

పదునొకండవ శ్లోకము శ్రీ చక్రరాజనిలయా (997) చక్రరాజ నికేతనా (245) నామద్వయమందు శ్రీ దేవి శరణ (నివాస)ముగా చెప్పబడిన శ్రీ చక్రమునందలి కోణముల వర్ణించును. వానిలో ఊర్ధ్వశీర్షములు శాక్తములు అయిదు అధః శీర్షములు శైవములు నాలుగు మూల ప్రకృతు లనఁబడు నీ తొమ్మిది కోణములలో అయిదు శాక్తము లనుటచే శ్రీ కంఠార్ధ శరీరిణీ (392) నామార్థమును వ్యంజింపఁజేయును. ఈ శ్లోకము చతుర్భిః శ్రీ కంఠైః అని ఆరంభింపఁబడుట ఆ నామ సంబంధమును స్పష్టతరము చేయుచున్నది. పదునాల్గవ శ్లోకము భూమి (మూలాధారమున)యందు 56 జలము (మణిపూరము)నందు 52 అగ్ని (స్వాధిష్ఠానము) యందు 62, వాయువు (అనాహతము) నందు 54, ఆకాశము (విశుద్ధము) నందు 72, మనస్సు (ఆజ్ఞ) నందు 64 మొత్తము 360 కిరణములకు పైన శ్రీదేవి పాదములుండును అని చెప్పఁబడుటచే 360 చాంద్రమాన సంవత్సర తిథులు సూచింపఁబడినవి. ప్రతిపన్ముఖ్యరాకాంత తిథిమండల పూజితా (611)

చంద్ర విద్యా (239) నామార్థముతోపాటు కిరణముల కాల స్వరూపత సూచింపబడి దేశకాలా పరిచ్ఛిన్న (702) కాలహంత్రి (558) యగు శ్రీదేవి పాదమునందలి కాలాతీత్వముకూడ వ్యక్తము చేయబడినది. ఇట్లీ శ్లోకము శ్రీ చక్ర పిండాండ బ్రహ్మాండ సంకేతమును ల. స. నా స్తోత్రాను గుణముగ తెలుపుచున్నది.

శ్రీ చక్రమునకు భూపురము ద్వారము వంటిది. అక్కడ అణిమాది సిద్ధులుండును. చతుర్ముఖాదులును ఆ అణిమాది సిద్ధులచేతనే తృప్తిపడు వారేయైనచో చంచలేంద్రియులైన వారి కామె పాదసేవ యెట్లు లభించును. అణిమాది సిద్ధులచే ప్రలోభమునందని వారు మాత్రమే యా శ్రీ చక్ర గృహాంతర్భాగమున ప్రవేశించి దేవి పాదసేవచేయు సౌభాగ్యము . పొంద గలరని 96 వ శ్లోకము అణిమాది సిద్ధులు భూపుర ద్వారగతములను శ్రీ చక్రవిజ్ఞానాంశమును బోధించును.

బ్రహ్మజ్ఞానము పరవిద్య దానిని పొందగోరి శ్రీ విద్యోపాసనాదులను చేయు భక్తుల కింకను ఆ పర విద్య లేకపోవుటచే వారు అవిద్యులే. అట్టి అవిద్య ద్భక్తుల హృదయమందలి అవిద్యాంధకారమును భేదించుటకా శ్రీదేవి తిమిరమిహిర ద్వీపనగరియగు ననుటనే ప్రథమ పాదమున భక్తహార్ద తమో భేద భాను మద్భాను సంతతి (404) నామమును బ్రహ్మజ్ఞానేతర శాస్త్రాది జ్ఞానము గూడలేని జడుల కామె చైతన్య మకరంద స్రుతి ఝరియనుటచే ద్వితీయ పాదమున చిచ్ఛక్తి (416) చేతనరూప (417) జ్ఞానదా (644) జ్ఞానవిగ్రహా (645) చిత్కళా (769) ది నామములను దరిద్రులకామె చింతామణి గుణనిక యగుటచే మూడవ పాదమున దౌర్భాగ్యతూల వాతూలా (745) భాగ్యాబ్ధి చంద్రికా (774) రాజ్యదాయినీ (686) సామ్రాజ్య దాయినీ (694) నామములను సంసార జలధి నిమగ్నుల కామె మురరిపు వరాహదంష్ట్ర యనుటచే నాల్గవ పాదమున సంసారపంక నిర్మగ్న సముద్ధరణ పండితా (881) దంష్ట్రోజ్జ్వలా (489) నామములను మూడవ శ్లోకము వివరించును.

శ్రీ దేవి పాదములే మోక్షరూపమైన అభయమును ఆనందరూపమైన వరమును ప్రసాదించుటచే నితర దేవతలవలె నామె యభయ వరదముద్రలను ధరింపదని నాల్గవ శ్లోకము భయాపహా (121) వరదా (331) వంద్యా (348) త్రిజగద్వంద్యా (628) నామార్థముల వ్యాఖ్యానించును నాల్గవ శ్లోకము.

ఐదవ శ్లోకము పూర్వార్థమున కమలాక్ష నిషేవితా (569) నామమును ఉత్తరార్థమున కామ సేవితా (375) నామమును సాక్షాత్కరింపజేయును. ఇందలి ప్రణత జనసౌభాగ్య జననీమ్ అనుపదము భక్త సౌభాగ్యదాయినీ (108) నామమునకు ఛాయయే.

శ్రీదేవి చతుర్భుజ ఆమె తన చతుర్భుజముల యందు ఇక్షు ధనువును పుష్పబాణములను పాశమును అంకుశమును ధరించియుండును. మన్మథుడును ఇక్షుధన్వియే పుష్పబాణుడే చతుర్భుజుడు కాకపోవుటచే పాశాంకుశముల ధరింప లేదు. ఆరవ శ్లోకము మన్మథుని పుష్పధన్విగా పంచవిశిఖునిగా మాత్రము పేర్కొనినది. ఇక్షుధనువు పేర్కొనలేదు. అయినను శ్రీ దేవీ భక్తుడైన మన్మథుడు శ్రీ దేవి సామ్యమును భజించినట్లు స్ఫురింప జేయును. శ్రీ దేవి వలె కాముడును కామరూపుడు కావున తన రూపమును ఆయుధములను మార్చుకొనుననియు స్ఫురింపజేయును. కావున కామరూపిణీ (455, 797) నామద్వయమందలి స్వేచ్ఛారూపత్వ మన్మథ సాదృశ్యములు రెండును శ్రీదేవి యందు నిరూపింపబడినట్లైనది.

సరస్వతీ (705) బ్రాహ్మీ (676) నామార్థమును అరుణా (37) నామార్థమును తరుణాదిత్య పాటలా (923) బంధూక కుసుమప్రఖ్యా (965) విద్రుమాభా (892) ఆ రక్తవర్ణా (477) రక్తవర్ణా (500) నిజారుణ ప్రభాపూర మజ్జద్బ్రహ్మాండ మండలా (12) నామార్థమును ధ్యానించుటవలన కలుగు వాఙ్మాధుర్య విద్వద్రంజన స్త్రీ వశీకరణ ఫలములు 15 వ 16 వ 18 వ శ్లోకములలో చెప్పబడినవి.

17 వ శ్లోకమున ల. స. నా. స్తోత్రర్షులైన వశిన్యాది వాగ్దేవతలతో కూడిన శ్రీ దేవీ ధ్యాన ఫలము కావ్య కర్తృత్వమని చెప్పఁబడినది. 19 వ శ్లోకము కామకలారూపా (322) నామార్థ ధ్యాన ఫలమును 20 వ శ్లోకము సుధాసృతి (380) నామార్థ ధ్యానఫలమును వివరించును. 21 వ శ్లోకము తటిల్లతా సమరుచి (107) 'నామమును తటిల్లేఖా తన్వీమ్' అను పదముతో భానుమండల మధ్యస్థా (275) చంద్రమండల మధ్యగా (240) వహ్ని మండల వాసినీ (352) నామార్థమును తపన శశి వైశ్వానరమయీమ్ అను పదముతో షట్చక్రోపరి సంస్థితా (108) నామమును నిషణ్ణాం షణ్ణామప్యుపరికమలానాంతవకలామ్ అను రెండవపాదముతో మహాపద్మాటవీ సంస్థా (59) నామమును మహాపద్మాటవ్యామ్ అనుపదముతో పరమానందా (252) పరమా (619) పరామోదా (941) నామములను పరమాహ్లాదల హరీమ్ అనుపదముతో ఆహ్వానించు చున్నట్లున్నది.

23 వ శ్లోకము శివమూర్తి (407) నామమును 29 వ శ్లోకము హరిబ్రహ్మేంద్రసేవితా (297) నామమును 30 వ శ్లోకము బ్రహ్మాత్మైక్య స్వరూపిణీ (673) నామమును వివరించును. 31 వ శ్లోకము పరుషార్థప్రదా (291) స్వతంత్రా (725) సర్వతంత్రేశీ (726) నామార్థఘటితము 34 వ శ్లోకము పరాపరా (791) సామరస్యపరాయణా (793) నామవ్యాఖ్యారూపము 35 వ శ్లోకము చిత్కళా (729) ఆనందకలికా (730) సచ్చిదానందరూపిణీ (701) పరాద్రూపా (779) సత్యజ్ఞానానందరూపా (792) క్షేత్రస్వరూపా (341) క్షేత్రేశీ (342) నామార్థభావనార్థరూపము.

36 వ శ్లోకము ఆజ్ఞాచక్రాంతరాళస్థా (103) ఆజ్ఞాచక్రాబ్జనిలయా (522) నామప్రతిపాద్య పరదేవతా ధ్యానఫలములను వివరించుచున్నది. ఇందలి పరచితాశబ్దము పరదేవతా (366) చిన్మయీ (251) ప్రత్యక్చితీరూపా (362) చిదేకర సరూపిణీ (364) నామస్మారకము.

37, 38, 39, 40, 41 శ్లోకములు విశుద్ధి చక్రనిలయా (406), అనాహతాబ్జనిలయా ముని మానస హంసికా (817) భక్తమానస హంసికా (372), స్వాధిష్ఠానాంబుజగతా (508), మణి పురాన్తరుదితా (101) మణిపూరాబ్జనిలయా (496) మూలాధారైక నిలయా (99) మూలాధారాంబుజారూఢా (515) నామ ప్రతిపాద్య పరదేవతా రూప విశేష నామ విశేష ధ్యాన ఫలవిశేషముల వివరించును.

శ్రీ శంకరులు నిష్కాములయ్యు పైన జెప్పఁబడిన వివిధ ధ్యానములు చేసిరి. వాని ఫలములలో నొకటియగు వాగ్దేవీ వదన కమల మధురిమ ధురీణ ఫణితులు గల ప్రౌఢ కవితా సామ్రాజ్యము నధిష్ఠించిరి. దానికి సౌందర్యలహరియే నిదర్శనము. అందుచేతనే దీనియందు వాగ్దేవీ వదనకమలామోద మధురిమ యాస్వాద్య మానమగుచుండును. శ్రీ లలితా సహస్ర నామార్థ ధ్యానము నిష్కాములయెడను ఫలింపక మానదని దీనివలన స్పష్టమగును. రసికులైన వారీ లలితా సహస్ర నామస్తోత్రమును సౌందర్యలహరిని తులనాత్మకముగ,పరిశీలించి నా యీ యల్ప ప్రయత్నమును ఫలవంతము జేయుదురుగాక యని కోరుదును.

[స మా ప్త మ్]

# 'యువతాండవం'

## శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

తలవంచి తప్పుకొను లోకం
నన్గాంచి—
కాళ్లు తడబడ నడచు లోకం!
నారూపు ఘోరమై
కనుపించెనో యేమొ?
నాచూపు గుండెలను
గ్రుచ్చుకొనెనో యేమొ?
నామాట కటువుగా
వినిపించెనో యేమొ?
తలవంచి తప్పుకొను లోకం
నన్గాంచి—
కాళ్లు తడబడ నడచు లోకం!
మనిషిలో మోసాలు
ముసుగులో వేషాలు
ఎత్తిచూపెడు మిత్తి
వేపమండను బట్టి
ఎగుర గొట్టెడు శక్తి
ఎదురయ్యెనని యేమొ
తలవంచి తప్పుకొనులోకం
ననుగాంచి—
కాళ్లు తడబడ నడచు లోకం!
గుడిలోని దేవునికి
గుంజిళ్లు వేదీసి
ఎదలోని దేవునికి
ఎగనామమే పెట్టి
అడుగడుగులో ఆత్మ
వంచనలు తలపెట్టి
చేతికందిన వాని
తలమీదనే మొట్టి
తలకు మించినవాని
కాళ్లు గట్టిగ బట్టు
కార్య సాధకులను
నిలదీసి అడిగెడి
నీతి ఎదురని యేమొ?
తలవంచి తప్పుకొను లోకం
నన్గాంచి—
కాళ్లు తడబడ నడచు లోకం!
బానిసత్వపు బంధముల
బాధలను త్రెంపి—
బ్రతుకులో అందాల
పూలపాదులు నింపి
ఏలుకొండని యికను
మేలుకొండని తెలిపి
జాతిప్రగతికి జీవి
తము ధారవోసిన
పూజ్యపాదుల పేర
కాయ లమ్మెడి ఘనుల
కారి వుమ్మెడు శక్తి
ఎదురయ్యెనని యేమొ?
తలవంచి తప్పుకొను లోకం
నన్గాంచి
కాళ్లు తడబడ నడచు లోకం!

బహిరంగ సభ దేశ
భక్తిభావము చిమ్మి
అంతరంగము లోన
పదవులనే నమ్మి—
పరువు మర్యాదలను
పైకంబునకు అమ్మి—
దేశభక్తుల మనుచు
ప్రగతివాదుల మనుచు
రొమ్ము విరుచుక తిరుగు
ముసుగులో దెయ్యాల
ముక్కుబట్టుక లాగి
నడివీధిలో నిలిపి
ముసుగు వీడగ దులుపు
మనలమెదురని యేమొ?

తలవంచి తప్పుకొనులోకం
వన్నెంచి
కాళ్ళతడబడ నడచు లోకం!
ఎదమనలిపిన మాట
నాగళములో పాట
పదిమంది పాడితే
ప్రగతికిది పూబాట
ప్రగతికోరెడు మాట
పదును కక్కెడు మాట
పదునైన మాటలను
పడలేకనో యేమొ?
తలవంచి తప్పుకొను లోకం
వన్నెంచి
కాళ్ళతడబడ నడచు లోకం!

---



# ప్రతిబింబం

## శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

బస్సుదిగి మనుష్యుల ఒత్తిడి లోనుంచి బయటపడటానికి ప్రయత్నిస్తున్నాను. 'కూలీ సార్' 'రిక్షా సావీ' అంటూ అడ్డుపడుతున్న వాళ్లని వదిలించుకుని, నా చిన్న సూట్‌కేస్‌తో తెరపిన పడ్డానో లేదో, నా కెదురుగా ముష్టివాని డబ్బా ఒకటి ప్రత్యక్షమైంది.

చిరాగ్గా 'ఫో, ఫో' అన్నాను.

'ఫైవ్ పైసే ప్లీజ్'

ఇంగ్లీషులో అడుగుతున్నాడు వీడెవడు ?

ముడుతలు పడిన ముఖం, తెల్లని గడ్డమూ, మీసాలూ. ముసలివాడే కాని కళ్లలో కాంతి ఉన్నది. దేహం బక్కగా ఉన్నా మనిషి వంగిపోలేదు. ఎడమ చేతిలో పొడుగాటి కర్ర, కుడిచేతిలో డబ్బా. పొట్టి చేతుల చొక్కా, చిరిగిన పైపంచ. మోకాళ్ళకుపైన గాంధీ పంచకట్టు. రోగలక్షణాలు లేవు. అసహ్యంగా లేదు. మురికిగా కూడా లేదు.

అతణ్ణి తేరిపార చూశానో లేదో,

'పరీక్ష అవుతావు నాయనా, ఫస్ క్లాస్‌లో అవుతావు' అన్నాడు.

ఆ మాటతో నేను యించుమించు అతనికి లొంగిపోయాను.

నా వాలకం చూచి, నేను స్టూడెంటునని అంచనావేసి, తెలివిగా చేసిన ముఖస్తుతే కావచ్చుగాని, అప్పటి నా మనస్థితిలో ఆమాటకి చాల విలువవుంది. కాని నా బింకం వదలిపెట్టకుండా,

'పైసలు యివ్వనుగాని, టీ యిప్పిస్తాను తాగుతావా?' అన్నాను.

సరే నన్నాడు. నాతో టీస్టాల్‌వైపు నడిచాడు.

క్రితం రోజే ఎం. ఏ. పరీక్ష చివరి పేపరు వ్రాశాను. అనుకున్నంత బాగా వ్రాయలేక పోవడం చేత, నే నాశించిన ఫస్ట్‌క్లాస్ వస్తుందో రాదో నన్న సందేహం విడవకుండా పీడిస్తోంది నన్ను. తప్పితే వెంట్రుక వాసిలో తప్పిపోవచ్చు. అదృష్టం బాగుంటే రావచ్చు. వస్తుందన్న ధీమా మాత్రం లోపించిన పరిస్థితి ఏర్పడింది. ఆ ఫస్ట్‌క్లాస్ మీదే నా భవిష్యత్తుకి పథకాలు వేసుకున్నాను. యూనివర్సిటీలోనే ఉద్యోగానికీ, రిసెర్చికీ అవకాశాలు చూసుకున్నాను. ఫస్ట్ క్లాస్ రాకపోతే ఆ రెండూ వీలుకాకపోవచ్చు. బస్సులో ప్రయాణం చేసినంతసేపూ ఆ విషయంమీదే నా మనస్సు ఊగిసలాడుతున్నది. బస్సు దిగగానే ముష్టివాడు అన్నమాట తక్కున నన్ను ఆకట్టుకున్నది. మనస్సుకి శాంతి లభించింది. నేను హేతువాదినే, కాని మానవసహజమైన యిలాంటి ప్రవృత్తులకు అతీతుణ్ణి కాను. ఏదో విధంగా సంతృప్తి కలిగించిన వృద్ధుడికి టీ యిప్పించడంవల్ల నా హేతుబద్ధతకు వచ్చిన భంగపాటు ఏమీలేదు.

టీస్టాల్‌వాడు వృద్ధుడికి గ్లాసు యివ్వడానికి సందేహిస్తూ 'లోటా ఉందా ?' అన్నాడు. వృద్ధుడు చంకలో ఉన్న చిన్న సంచీమంచి వత్తుగ్లాసు తీసి టీ పోయించుకున్నాడు.

నేను టీ తాగుతూ అడిగాను—

'నీకు జ్యోతిషం వచ్చునా ?'

'రాదు నాయనా'

'మరి యిందాక ఏమిటో అన్నావే !'

'ఏవో తోచింది చెప్పాను.'

నేను నిరాశపడి పోయాను. పోనీ, ఏదో తెలుసునని ముసలాడు బుకాయించి కబుర్లు చెప్పినా సరదాగా ఉండేది ! ఈ నిజాయితీ ఏమిటి ?

వృద్ధుడు టీ త్రాగటం పూర్తిచేసి, స్టాల్ వాడిచేత నీళ్లు పోయించుకుని, గ్లాసుకడిగి దాన్ని మళ్లీ సంచీలో పెట్టుకున్నాడు. నేను డబ్బులు చెల్లించి, సూట్‌కేస్ పట్టుకుని బయల్దేరబోతూ, ముసలివాడివైపు చూచాను 'బై బై' చెప్పడానికి.

'జ్యోతిషం మీద నమ్మకం పెట్టుకోకు బాబూ' అన్నాడు.

'ఏం ? ఎందుకని ?'

'ఇటీజ్ మై ఎక్స్‌పీరియన్స్'

మళ్లీ యింగ్లీషు ! నాకు కుతూహలం కలిగింది.

'నేనిలా పార్కు వైపుగా వెళ్తున్నాను. పార్కు దాటగానే దగ్గరే మా యిల్లు. నాతో అలా వస్తావా?' అన్నాను.

వచ్చాడు. నడుస్తూ ప్రశ్నించాను.

'నువ్వెంతవరకు చదువుకున్నావ్ ? నీ కెవరూ లేరా ?'

సమాధానం రాలేదు.

'ఇందాక ఎక్స్‌పీరియన్స్ అన్నారే, ఏమిటది ?'

పార్కు వచ్చేదాకా ఆ వ్యక్తి ఏమీ మాట్లాడ లేదు.

పార్కుదగ్గర ఆగి, 'బాబూ, నీకు టైమ్ వుంటే, పార్కులోకి వెడదాం, చెబుతాను' అన్నాడు.

'ఇక్కడెందుకు ? మా యిల్లు దగ్గరే' అన్నాను.

'వద్దులే బాబూ, పార్కులోకి వెడదాం.'

మా యింటికి రావడానికి, నే నాహ్వానిస్తూ ఉండగా, అతనికి అభ్యంతర మేమిటో నాకు విడమ్దారంగా తోచింది. పార్కులోకి వెళ్లాము.

సిమెంట్ బెంచీమీద సూట్‌కేస్‌పెట్టి నేను కూర్చున్నాను.

వృద్ధుడు కూర్చోలేదు. నా కెదురుగా నిల్చు న్నాడు.

'జ్యోతిషం సంగతి అడిగావు. సృష్టిరహస్యం తెలిస్తేగాని జ్యోతిషం గురించి అర్థంకాదు బాబూ.'

'వేదాంతం కబుర్లన్నీవద్దు. నీ ఎక్స్‌పీరియన్స్ చెప్పు, అదికావాలి నాకు' అన్నాను.

'చెబుతాను. కాని ఒక్కవిషయం ముందు చెప్పనివ్వాలి. అది అర్థం చేసుకునేదాకా, నీకు నా ఎక్స్‌పీరియన్స్ అర్థంకాదు. రాముడు, రావణాసురుడు, వీళ్లు ఎప్పుడో ఉండి, యిప్పుడు లేకుండా పోలేదు. పరిస్థితులూ, వేషాలూ మారినా సృష్టిలో వ్యక్తిత్వాలు మారవు. మరోవిధంగా చెప్పాలంటే, పూర్వం కపిలవాయి కృష్ణుని పాత్రవేస్తే, యిప్పుడు రావూ రావు వేస్తున్నాడు. అప్పుడు నాటకంలో యిప్పుడు సినిమాలో. అలాగే సృష్టిలో మానవదేహాలు పుట్టి, పెరిగి, నశిస్తున్నా వ్యక్తిత్వాలు శాశ్వతంగానే ఉంటు న్నాయి. అవి లిమిటెడ్ నంబరే. ఎందికి వాడు తను విశిష్టమైన వ్యక్తిననీ, తనది విశేషమైన చరిత్ర అని అనుకుంటాడు. అదే మాయ. అలా కాకుండా రంగస్థలం మీద నటునిగా ఒక నిర్ణీతమైన పాత్ర నటిస్తున్నాను అనే ఎరుక కలగడమే జ్ఞానం...'

జనసంఖ్య పెరిగిపోతూ వుంది. నాగరకత పెరిగి మనుష్యుల వ్యక్తిత్వాల్లో వైవిధ్యం అనంతంగా కనిపిస్తూవుంది. వ్యక్తిత్వాలు లిమిటెడ్ నంబరు ఎలా ? నువ్వు చెప్పే సిద్ధాంతానికి ప్రమాణం లేదు. నాకు తత్త్వం వద్దుకాని, నీ సంగతి చెప్పు.'

'జనసంఖ్య పెరిగితేనేం ? ఒక వ్యక్తిత్వానికి నలుగురు లేక నలభైమంది ప్రతిబింబాలు ఉంటు న్నారు. పూర్వం పది సెంటర్లలో రిలీజ్ అయ్యే సినిమా యిప్పుడు యాభై సెంటర్లలో కావడం లేదా ! ఇంతకు సినిమా ఒకటేకదా! పైకి కనిపించే వైవిధ్యాలు అన్నీ వైవిధ్యాలు కావు. భేదాలు అంటూ

వుండకేం, అవన్నీ పైపై భేదాలు. సృష్టిలోని లిమిటెడ్ పాత్రలే నాటకం ఆడుతూ ఉంటాయి.'

'మరి ఈ సిద్ధాంతం ప్రకారం చూస్తే జ్యోతిషం శాస్త్రమే కావాలికదా !'

'తప్పకుండా శాస్త్రమే. నేను చెప్పిన సృష్టి రహస్యం అర్థం అయిన వాడికి జ్యోతిషం అక్కర లేదు. అది అర్థంకాని వాణ్ణి జ్యోతిషం ఎండ మావిలా ఆశ చూపి మరింత కంగారు పెడుతుంది. అందుకే జ్యోతిషం మీద నమ్మకం పెట్టుకోవద్దు అంటాను.'

'పోన్లే, నీసంగతేమిటో చెప్పు నే వెళ్ళాలి.'

'నేనా, నాసంగతీ, అంటూ ఏదీలేదు. నేనెవరు ? అని ప్రశ్న వేసుకుంటే దానికి జవాబు లేదు. అందువల్ల జరిగిన ఒకానొక విషయాన్ని, నాకు గుర్తున్నంత మేర చెబుతాను. అది నీకు పనికి వస్తుందేమో ఆలోచించుకో...

'ఈ ఊళ్ళో కమెర్షల్‌టాక్స్ ఆఫీసులో ఒక ఉద్యోగి ఉండేవాడు. అతను కొమార్తె మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. అప్పటికి తిరుపతిలో యూని వర్శిటీ లేదు. ఆ అమ్మాయి మద్రాసులో మెడిసిన్ చదువుతూ వుండేది. ఆమె చదువు పూర్తి అయ్యే సమయానికి ఒక డాక్టర్ని, మాలవాణ్ణి, పెళ్ళి చేసుకున్నది. ఆ విషయం తెలిసి, మద్రాసు వెళ్ళి ఆ పిల్లతో తెగతెంపులు చేసుకుని, కోపంతో ఆవేద నతో తిరిగి వచ్చాడు ఆ ఉద్యోగి. బస్సుదిగాడో లేదో అతనికి ఒక ముష్టివాడు—నావంటి ముసలివాడు—తారసపడ్డాడు.

'ఎక్కడి సంబంధాలు నాయనా ! ఎవరికి ఎవరు తండ్రీ ! ధర్మం చెయ్యి' అను వాడిమాటలు అతణ్ణి ఆకర్షించాయి. ఇందాక నువ్వుచేసినటే, ముసలివాణ్ణి టీ స్టాల్ దగ్గరకు తీసుకువెళ్ళి టీ యిప్పించాడు ఆ ఉద్యోగి. వాణ్ణి గురించి వివరాలు అడిగాడు. వాడికెవరూ లేరట. ఒక విధవ కొమార్తె వండిపెడుతూ ఉండేదట. అది ఒక ఈడిగ కులస్థుడితో లేచిపోయిందట. వీడు వైశ్యుడు. చిన్న అంగడి ఉండేది. ఉన్న డబ్బూ దస్కం కూతురు కూడా లేచి వెళ్ళిపోవడంతో, వీడు భిక్షాటన చెయ్యవలసిన పరిస్థితి ఏర్పడిందట. ఇది తన కథ అంటూ చెప్పాడు. లోకంలో యిలాంటివి జరగటం సహజమే అనుకుంటూ, తన అనుభవానికి ఆ ముసలివాడి అనుభవం ప్రతిబింబం కావడాన్నిగూర్చి ఆలోచిస్తూ ఆ ఉద్యోగి యింటికి వెళ్ళాడు.

'పై సంగతి జరిగిన ఆరేళ్ళకు మరో ఊళ్ళో ఉద్యోగంచేస్తూ, ఆ ఉద్యోగి తన ప్రమోషన్ విషయమై ప్రయత్నం చెయ్యడానికి హైదరాబాద్ వెళ్ళి తిరిగివచ్చి బస్సుదిగాడు అప్పటికి అతను నీతి నియమాలు పాటించకుండా రెండు చేతులా డబ్బు ఆర్జించాడు. పై అధికారులకు అతనిమీద ఆరోపణలు వెళ్ళాయి. రావలసిన ప్రమోషన్ రాకుండా జాప్యం జరుగుతోంది. హైదరాబాద్‌వెళ్ళి, చూడవలసిన వాళ్ళని చూచి, చెయ్యవలసిన ప్రయత్నాలు చేసి, కొండంత ఆశతో తిరిగివచ్చాడు. అక్షణంలో ఆరేళ్ళక్రితం కనిపించిన ముష్టివాడు అక్కడ మళ్ళీ ఎదురయ్యాడు. 'నీకు మేలు జరుగుతుంది నాయనా!' అన్నాడు. మొదట గుర్తించలేక పోయినా, ఉద్యోగి వాడితో నాలుగు మాటలు మాట్లాడగానే గుర్తించాడు. ఇంటికి తీసుకు వెళ్ళాడు. జ్యోతిషం చెప్పమన్నాడు. 'చెప్పడానికేమీలేదు బాబూ, నువ్వు పై ఊరికి వెళ్ళినపని నవ్యంగా ముగుస్తుంది, నీకు అందువల్ల మేలుకలుగుతుంది' అన్నాడు వాడు. 'నువ్వెవరు ? ఈ ఆరేళ్ళూ ఎక్కడ తిరిగావు ?' అని ప్రశ్నిస్తే, వాడు సరిగ్గా ఈ ఉద్యోగి ఆ రేళ్ళలో ట్రాన్స్‌ఫర్‌మీద తిరిగిన మూడు ఊళ్ళ పేర్లూ చెప్పాడు. 'మరి ఆ ఊళ్ళలో నా కెప్పుడు కనిపించలేదేం?' అని అడిగితే, 'కనిపించినా నువ్వు నన్ను గుర్తించలేదు బాబూ, నేను నిన్ను గుర్తించాను కాని' అని వాడి సమాధానం.

'ముష్టివాడు వెళ్ళిపోయాడు. వాడి జ్యోతిషం ఫలించలేదు. ప్రమోషన్ రాలేదు. రాకపోవడం అట్లుంచి

ముసిలివాడు ఇతణ్ణి పద్మాసనం వేసుకొమ్మన్నాడు. కళ్లు మూసుకొమ్మన్నాడు. దగ్గరగా వచ్చి చెవిలో ఏమిటో ఊదాడు. అంతే, యితనికి స్పృహ లేదు. అది నిద్రో, మూర్ఛో, సమాధ్యవస్థో, ఎంతసేపు అలా ఉన్నాడో, తెలీదు.

'కళ్లు తెరిచి చూచేప్పటికి పార్కు దీపాలు వెలవెల పోతూ కనిపించాయి. తెల్లవారుతోంది. మనస్సులో మంత్రం జపిస్తూన్న విధంగా, తన ప్రమేయం లేకుండానే, ఒక భగవన్నామం తిరుగుతూ వుంది చుట్టుపట్ల ఎవరూ లేరు. ముసిలివాడూ లేడు. దేన్నిగురించి కాని ఆలోచించాలనే జిజ్ఞాస నశించింది మనస్సు నిలకడగా నిండుగా వుంది. ఆకలి మాటే గుర్తు లేదు. ఆ ముసిలివాడి కర్రా, డబ్బా అక్కడే వున్నాయి. అవి తీసుకుని బస్సు స్టాండు వైపు నడిచి వెళ్లాడు. వాణ్ణి అన్వేషించాలని ఊహ. వెళ్లేటప్పటికి తిరుపతి బస్సు బయలుదేరుతోంది. అందులో ఎక్కి తిరుపతి వెళ్లిపోయాడు అంతే, మళ్లీ యింటికి వెళ్లలేదు. ఆ ముసిలివాడూ కనిపించలేదు. నిజానికి ఈ వ్యక్తే ఆ ముసిలివాడుగా అయ్యాడు.

'తర్వాత తర్వాత బోధపడుతూ వచ్చింది సృష్టి రహస్యం. ఆ ముసిలివాడూ, ఈ వ్యక్తీ, ధరించినదీ, ధరిస్తున్నదీ ఒకే నిర్దిష్టమైన పాత్ర అని. రెండు, మూడు, నాలుగు అద్దాలున్న గదిలో ఒకరే ఎన్నో ప్రతిబింబాలుగా, వైవిధ్యంతో కనిపించినా, యథార్థానికి వ్యక్తి ఒక్కడే కదా! తిరుమలలో స్వామివారి అద్దాల మహలులో ప్రవేశిస్తే ఈ అనుభవం క్రొత్త కాదు. ఈ లోకం భగవంతుని అద్దాల మహలు.'

'అయితే నీ భార్య ఏమైంది? నీ యిల్లు? నువ్వు మళ్లీ ఈ ఊరు ఎప్పుడు వచ్చావు?'

'మళ్లీ ఈ ఊరు రావాలని బుద్ధి పుట్టేటప్పటికి బహుశా కొన్ని సంవత్సరాలై వుంటుంది. లెక్క

ఉన్న ఉద్యోగంనుంచీ కూడా బర్తరఫ్ అయ్యాడు అతను. పోగుచేసిన డబ్బు చాల భాగం ఖర్చుపడింది. ఉద్యోగి నిరుద్యోగి అయ్యాడు. సర్వీస్‌లో ఉన్నప్పుడు కొన్న యిల్లు ఈ ఊళ్లో వుంది. అందువల్ల భార్యతో ఈ ఊరువచ్చి సెటిల్ అయ్యాడు. పెన్షన్‌లేదు. ఇల్లు గడవటం కష్టమవుతోంది. గ్రుడ్డిలో మెల్లగా కొడుకు బాగా చదివి పైకి వచ్చాడు. బొంబాయి దగ్గర ట్రాంబేలో సైంటిఫిక్ ఆఫీసర్ ఉద్యోగంలో ఉన్నాడు. వాడికి పెళ్లి కాలేదు. వాడే తల్లిదండ్రులని అనుకుంటున్నాడు. వాడి పెళ్లివిషయం సంప్రదించడానికి ఈ వ్యక్తి బొంబాయి వెళ్లాడు. ఇతడు వెళ్లిన రెండవరోజు, ఆ యువకుడు కొందరు స్నేహితులతో సముద్ర స్నానానికి వెళ్లి, సముద్రానికి అర్పణ అయ్యాడు. ఇతని పరిస్థితి వర్ణనాతీతం. సరే, అన్నీ ముగించుకుని దైన్యంతో యింటికి తిరిగి వచ్చాడు. ఆ రోజు మళ్లీ ఆ ముష్టివాడు ఎదురయ్యాడు......

'జీవితంలో ముఖ్యమైన ఘట్టాలలో మూడు సార్లు ఆ ముష్టివాడు అలా ఎదురుపడటం, అన్నీ పోగొట్టుకొన్న ఈ వ్యక్తికి, ఏదో విధి చేస్తున్న మోసంలాగ తోచింది. ఆ ముష్టివాడు దుర్విధికి ప్రతిరూపం లాగ కనిపించాడు. ఆగ్రహంతో వాణ్ణి కొట్టబోయాడు. ఆ తత్తరపాటులో తన ధోవతి అంచు తవ్వేతొక్కి ముందరికి బోర్లపడిపోయాడు. అది ఈ పార్కు దగ్గరే జరిగింది. నలుగురూ చేరి లేవనెత్తి పార్కులోకి తీసుకువచ్చి ఒక చోట కూర్చోబెట్టారు.

'తర్వాత ప్రతిసాయంత్రం స్వాస్థ్యంలేని మనస్సుతో యిక్కడికివచ్చి కూర్చోవడం అలవాటైంది. ఎవరితోనూ మాట్లాడటానికి యిష్టం ఉండదు. ఊరికే కూర్చుంటాడు. ఆ ముష్టివాడు పార్కులో తరచు యితనికి కనిపిస్తూనే ఉన్నాడు. ఒక రోజు ఈ వ్యక్తి ఆ ముష్టివాణ్ణి దగ్గరికి పిలిచాడు.

'ఎవరు నువ్వు? నీ ముఖం చూచిన ప్రతిసారీ దౌర్భాగ్యమే దాపురించింది నాకు...ఇంకా ఎందుకు నా చుట్టూ తిరుగుతున్నావ్? ఏముందనీ?' అన్నాడు.

'బాబూ, ముందు నేను కనిపించడమూ, అందువల్ల నీకు బాధ కలగడమూ ఎన్నడూ జరగలేదే! జరిగేదేదో జరిగిన తర్వాతే కదా, నిన్ను శాంతపరచేందుకు ఏవో మాటలు చెప్పాను నేను! నా దోషం ఏముంది?'

'అప్పుడు జ్యోతిషం చెబుతానన్నావు. మోసం చేశావు. అంతా తప్పుగా చెప్పావు. ప్రమోషన్ వస్తుందన్నది రాలేదు. చిన్న ఉద్యోగం ఊడింది. మేలు జరుగుతుందన్నావు. జరిగిందంతా కీడే.'

'అయ్యా, జ్యోతిషం చెబుతానని నేననలేదు. మేలు జరుగుతుందని మాత్రమే అన్నాను. అదే మీటో నాకూ తెలీను. ఎవరు చేసిన కర్మ వాళ్లను భవించక తప్పదుకదా! అది మరెప్పుడో మరే విధంగానో కాకుండా, యిప్పుడే యిక్కడే తేలిపోవడం మేలు కాదంటావా? జీవితంలో సుఖదుఃఖాలు రెండూ ఉంటాయి. ఆశనుబట్టే నిరాశ ఉంటుంది. అయ్యా, జ్యోతిషఫలం అంటావా. అది పిడికిట్లో చిక్కినట్లే చిక్కి వేళ్లసందుల్లో నీళ్లలా జారిపోతూ వుంటుంది! మనస్సుకు ఏదో తాత్కాలికమైన ఉపశమనమే తప్ప. దాన్ని నమ్ముకోవడం తెలివి తక్కువ. మనిషికి కావలసింది మనశ్శాంతి. తృప్తి. పెంచుకున్న మమకారాలవలా, ధన సంపాదనవల్లా అది సమకూడదు.'

'మరి నావంటి దౌర్భాగ్యుడికి మనశ్శాంతి ఎట్లా వస్తుంది? నీకేమైనా ఉపాయం, మంత్రం గాని, తంత్రంగాని తెలుసా?'

'నువ్వడిగితే చెప్పక పోతానా?'

'విచిత్రంగా ఉందే! నువ్వెవరు, నేనెవరు? ఏమిటీ సంబంధం?'

'నువ్వూ నేనూ అనే ప్రశ్న ఎందుకుగాని, ఒక మంత్రం చెబుతాను చెప్పుకో. నీకు సృష్టి రహస్యం తెలుస్తుంది. మనశ్శాంతి కలుగుతుంది.'

ఇతను సరే నన్నాడు. ఈ పార్కులో చెట్లు చాటుగా ఉన్న ఆ మూలకి వెళ్లారు యిద్దరూ. ఆ

లేదు. భార్య యిల్లు, యివేవీ లేవు. నిజానికి ఆ పాత 'నేను' లేను. భార్య చనిపోయిందేమో! ఏ సంగతీ నేను పట్టించుకో లేదు. ఇక్కడ నాది అన్నదేమీ లేదు, నాది కానిదీ లేదు. బుద్ధి నడిపిన తీరున నడుస్తాను. ఇవాళ నీ ముఖం చూచి ఏమి అన్నానో, ఎందుకన్నానో, అదంతా తెలిసి జరిగేది కాదు. ఇంత కథా, ఈ రహస్యమూ ఇన్నాళ్లదాకా ఈ నోటినుంచీ రాలేదు. ఇప్పుడు నీకు ఎందుకు చెప్పానో, దీని ఫలిత మేమిటో కూడా నాకు తెలీదు. అంతా భగవ దేచ్ఛ!'

నేను కొంతసేపు ఆలోచించి యిలా అన్నాను—

'నువ్వు చెప్పినదాంట్లో అద్భుతం ఏమీ లేదు గాని, ఒక వైచిత్రి ఉన్నది. దాన్ని సిద్ధాంతం చేసి, సృష్టి రహస్యం అంటూ ఏదో చెబుతున్నావు. ముష్టెత్తుకునే సన్న్యాసం తప్ప జీవిత సమస్యలకు పరిష్కారంగా ఈ దేశంలో మరో మార్గం లేదా? ముష్టెత్తడం వంటి అసహ్యమైన, అనవసరమైన సంప్రదాయం ఏమైనాసరే ఈ దేశంలో నశించి తీరాలి. అందుకే నీ అనుభవం, నీ సిద్ధాంతం నాకు పనికిరాదు!'

'బాబూ, నీవు అయోమయంలో పడిపోతు న్నావు. ముష్టెత్తడం లోనే మనశ్శాంతీ, తృప్తీ ఉన్నాయని నేను చెప్పలేదే! అన్నివృత్తుల లాగే ఇదీ ఒక వృత్తి. వ్యక్తి ఏ వృత్తిలో ఉన్నాడన్నది ప్రధానం కాదు. ఎందులో ఉన్నా సృష్టి రహస్యం గ్రహించిన వాడు మనశ్శాంతి పొందుతాడు. ఎవరు ఎందులో నుంచి ఎందులోకి మారుతారో, ఆ మార్పు ముఖ్యం కాదు. అది పాత్ర నిర్వహణ. బాధనుంచీ, భయం నుంచీ, వెతుక్కోవడం నుంచీ విముక్తి పొందడం, మనశ్శాంతి, అదే ముఖ్యం.'

'ముష్టెత్తుకునే సన్న్యాసానికీ దానికీ సంబంధం లేదంటున్నావు; అయితే ఆ మనశ్శాంతి లభించే మార్గమేమిటి?'

'బాబూ ఇవాళ నీ ముఖం చూడగానే ఎందుకో నీతో మాట్లాడాలని తోచింది. నీ కిష్టమైతే మంత్రోప దేశం చేస్తాను. అదే మనశ్శాంతికి మార్గం'

నేను జంకాను. నాకేదో భయం వేసింది. మంత్రాలు మనశ్శాంతి నిస్తాయంటే నమ్మకం లేక పోవడం ఒక కారణం. మరో కారణం, వృద్ధుడు చెప్పిన ఆత్మకథలో, మంత్రోపదేశంతో అతనిలో వచ్చిన మార్పుని గూర్చి విన్నతర్వాత, దానికి నేను సిద్ధపడక పోవడం.

'నాకు మంత్రం యిచ్చి మనశ్శాంతి కలిగిస్తే నీకు కలిగే లాభం ఏమిటి?'

'అది దైవేచ్ఛ'

ఈ సమాధానం నాకు నచ్చలేదు. అందులో తప్పించుకోవడమే కనిపించింది.

'నేనింకా యువకుణ్ణి. జీవితంలో దెబ్బతిని అలసిపోయిన వాళ్లు, మనశ్శాంతి కోరేవాళ్లు, ఎందరో ఉంటారు. వాళ్లకెందుకు ఉపదేశం చెయ్యవు?' అన్నాను.

'దైవేచ్ఛ'

'నేను సిద్ధంగా లేను' అన్నాను.

అతను వెళ్లిపోయాడు.

అతను చెప్పిన వృత్తాంతాన్నీ, సిద్ధాంతాన్నీ నెమరువేస్తూ యింటికి బయలుదేరాను. అతని సిద్ధాంతం నిజం అయితే, ఇది నా 'ప్రతిబింబం'తో మొదటి సమావేశం అనుకోవాలి అంటే చివరకు నేనూ ముష్టివాణ్ణై పోతానా? అలాంటి విధివ్రాత తప్పించుకోవడానికి వీల్లేదా? పాత్ర నిర్వహణలో నాకు స్వాతంత్ర్యం ఏమీ లేదా? ఉంటే అది ఎలాంటిది?

నా సందేహాలకు సమాధానం ఎవరిస్తారు?

నా జీవితమే యివ్వాలి.

---

# సంశోధిత మహాభారతము – శాంతి పర్వము

శ్రీ నిడుదవోలు వేంకటరావు

(గత సంచిక తరువాయి)

## పాఠభేద విమర్శనము

### 1. చామరలు—సీవిరులు

శా. 'సారథ్యంబు వహింప భీముఁడు
సితచ్ఛత్రంబు గాండీవి సె
ల్వారం బట్టఁగఁ జామరల్ గవలిడన్.'
(1—342)

ఇచట, పుట యడుగున—'చామరల్ గవలిడన్' అను దానికే పాఠభేదము చూపబడ లేదు-కాని దానికి పాఠభేద మున్నది.

శబ్దరత్నాకర కారు లీ పద్యమున — 'సీవిరులు' అను పాఠము గ్రహించినారు.

'సీవిరి. దేవి. 1. విం. జామరము— 'సీవిరుల్ కవలిడన్' (ఇది వ్రాతప్రతుల యందలి పాఠము భార. శాం. 1 ఆ., 2. ఆలవట్టము—తే. కడలు కొనఁ జాట్టు పట్టెదు—గొడుగు లెవ్వి, యొసక మెసగఁగ సీవిరు లేల పట్టరు సం. క్వతేద మలంభత్రం వ్యంజనం క్వచపార్థివ.' (ఇక్కడ వ్యంజన శబ్దమున కాలవట్టమర్థము) భార శల్య. 2 ఆ. పుట 791.

సీతారామాచార్యులవా రొక్కొక్క పదమునకై ఎంత శ్రమ చేసినది పై శబ్దము తెలుపగలదు. వారే 'వ్రాతప్రతుల పాఠము' అని వ్రాసినపుడు కొన్ని వ్రాతప్రతులలో నైన ఆ పాఠ ముండక తప్పదు. ద్విరేఫ వర్ణదర్పణకారుడగు ఓగిరాల రంగనాథ కవియు, శకటరేఫ నిర్ణయ కర్త భారతము లక్ష్మీపతియు, 'సీవిరులు' అను పాఠమే తమ గ్రంథము లలో నుదాహరించినారు.[1]

కాని సూర్యరాయాంధ్ర నిఘంటు 'స'—7 వ సంపుటమున 'సీవిరి' శబ్దము క్రింద— ఏ ప్రయోగ మీయబడక పోవుట దురూహ్యముగా నున్నది.

సీవిరి. వి. ఆలవట్టము. 2 వింజామర—3. మద్యము అని మాత్రమే కలదు. (పుట 1038.)

### 2. కనుమూసి –కనుమారి

1—307.

సీ. కల్లు త్రావిన పాతకంబది యగ్ని వ
ర్ణముగాఁగఁ గాచి పానంబు సేయఁ
గనుమూసి యుఱుకంగ, నవలంబు జొర మహా
ప్రస్థాన మాచరింపంగఁ బాయు'

ఇచట 'కనుమూసి' అనుదానికి పుట యడుగున నే పాఠభేదమును చూపబడలేదు. కాని వ్రాత ప్రతులయందు పాఠము 'కనుమారి' అని యున్నది.[2]

'కనుమారి. వి. (కనుమ + అరి) పర్వత సానువు—

1. 351 వ పద్యమున—'సీగిరులన్' అని ముద్రితమైనది. అది 'సీవిరులన్' అని యుండవలెను. వ్రాతప్రతి పాఠము సీవిరులన్.

2. ఆనంద ముద్రణమున కనుమారి అన్న పాఠమున్నది.

సీ. కల్లుద్రావిన పాతకంబు......కనుమూరి మఱుకంగ...పాయు. భార. శాం. 1.307 (వ్రాత ప్రతి పా) కనుమూసి ముద్రిత పాఠము! మరుత్ప్రపాతన్ ప్రపతన్......ముచ్యతే సర్వకిల్బిషైః అని మూలము) అని సూ. ని. (సూర్యరాయాంధ్ర నిఘంటువు.)

ఈ 'కనుమూరి' పదమును—నాచన సోము డుత్తర హరివంశమున ప్రయోగించినాడు—

గీ. పాయఁదగు మిమ్ముఁగనుమూరిఁ బడబొసంగు
విషము ద్రావుట యోగ్యంబు—ఉ—హరి 4-56.

పై ప్రయోగమునుబట్టి ఈ శబ్దము కనువారియనుట నిశ్చితము.

'కనువారి' అనగా పర్వత సానువునుండి క్రిందపడుట—దీనికొక చరిత్రగలదు. శ్రీశైలక్షేత్రమున కర్మహారీశ్వరమను స్థలము గలదు. ఇది శ్రీశైలము పర్వత చరియలలో నెత్తైన ప్రదేశము—పాపములుచేసిన వారీ యెత్తైన పర్వతపు చఱియ నుండి యుఱికి అడుగువ బడి మరణించిన—తాము చేసిన పాపములు కర్మలు హరించుననీ, అట్లు చేసెడివారు—పాప కర్మలను హరింపజేయునదిగావున దీనికి 'కర్మహారీశ్వరము' అని పేరు వచ్చినది. 'కర్మహారీశ్వరము' క్రమముగా కర్మహారి—కర్మారి—కనువారి అయినది.

కరమర్థిఁజేసి యాకర్మారి నుఱుకు
ననఘుల భవ పరిత్యక్త మానసుల
పండితా. పర్వ. 411 పుట.

(శబ్దరత్నాకరానుబంధము పుట 66౨)

## 3. కామ దోషములు—కామ క్రోధములు

ఉ. కావుమఁ గామ దోషములఁ గ్రాఁచుచు
న్నాశకకోటిఁ గామచున్. (4-252)

పుట యడుగున పాఠాంతరములు.

'మావ లోభములుఁ గాఁచుచు—క. గామ లోభముల-అ. ఏ. గామ క్రోధముల— ఉ, ఐ, ఐ, త, లి కామ దోసముల గ్రోధ కామముల—గ్రోధ కామముల అని పాఠాంతరములు. గమనిక:—కామ క్రోధములు అమ పాఠమున సంయుక్తాక్షరమునకు పూర్వమందున్న మ కారము గురువు కావలసివచ్చును అయినను రేఫ సంయోగమునకు పూర్వమునకు గురుత్వము వైకల్పికముగా అంగీకరింపబడినందున దోషము లేదందురు.'

పుట. 148.

గమనికలో నిట్లు వ్రాసియు, సంపాదకులు—కామ దోషములు—అను పాఠము మూలపాఠముగా నిచ్చుట సరికాదు. వా రుదాహరించిన పాఠములలో 'తి' సంజ్ఞ కలదు. 'తి' అనగా తిమ్మకవి (కూచిమంచి) తన సర్వలక్షణసార సంగ్రహమున—'కామ క్రోధములు' అన్న పాఠమే యిచ్చి, అక్కడ 'క్రో' తేల్చి పలుకవలెనని నిర్దేశించినాడు. ఇచ్చుట తిమ్మకవి నిర యము సరియైనది.

పదబంధములలో భావములలో తిక్కననే యనుసరించిన, నాచన సోమనాథుడు ఉత్తర హరివంశములో నిట్లే ప్రయోగించినాడు.

ఉ. 'మఱకువఁ గత్తరించి మదమానములం
జాఱుపుచ్చి, మెచ్చుఁ జాఁ
గఱ గొని కామ క్రోధముల
గండడగించి' (4-87)

ఇచట క్రో తేల్చి పల్కరాదని-ముద్రణములో క్రోధ కామములు అని వ్యత్యస్తముగా ముద్రింపబడినది. కామ క్రోధములను పరిపాటిగాని క్రోధ కామములని యుండనే యుండదు. తిక్కన యందువలె, నిచ్చటను 'క్రో' తేల్చి పలుకవలయును. దీనినిబట్టి మూలమున కామక్రోధములు — అను పాఠమే యుండవలెను4

---

3 చూడుడు. హంసవింశతి కథా వ్యాఖ్యానము —నా వ్యాఖ్య పుట 59

4. రేఫ సంయుక్తాక్షర గురులఘు విషయమై నేను 'భాషా పరిశోధన—కవిప్రయోగ సరళి' అను వ్యాసమున పూర్తిగా చర్చించినాను. Annals of the Oriental Institute, Madras University Vol. 16-1960.

## 4. నెలవు—నిలువు

సీ. పా. నిశ్రేణి తుదిముట్టు నెలవెక్కుటకు నిట్టి
క్రమవర్తన మును కరం ప్రవహార్గ.
(5—136)

ఇచట పాఠము – తుదిముట్టు నిలువుగాని నెలవుకాదు. తుదిముట్టు నిలువు – అనగా, సౌధము చివరియంతస్తు. తిక్కన విరాట పర్వమున తుది నిలువు అన్నపదము ప్రయోగించినాడు.

క. ముదమొద వరమ్య హర్మ్యము
తుది నిలువునఁ బ్రణయ సఖులతోడ—
విరా. 1–301

శ్రీనాథుడును తుది నిలువు అన్నపదము నుపయోగించినాడు.

క. మదనక్రీడా సౌధము
తుది నిలువున నిలిచె రథము తోయద వీథిన్
నైష. 8.25

తిక్కన యుపయోగించినది 'నిలువు'గాని 'నెలవు'కాదు.

## శాంతిపర్వ విశిష్టత

నన్నయ, ఆదిపర్వమున పర్వానుక్రమణికలో శాంతిపర్వముమ గూర్చి యిట్లు చెప్పినాడు.

'వ. మఱియు బంధువర్గంబు నెల్ల వధియించి పరమ నిర్వేదనపరుండై కృష్ణు వచనంబుల శాంతుండై యున్న ధర్మజునకు శరతల్పగతుండైన భీష్ముండు ధర్మవిదులైన రాజుల కెల్ల హితంబుగా రాజధర్మంబులు నాపద్ధర్మంబులు నేవాని నెఱుగిన సర్వజ్ఞాన సంపన్నులగుదు రట్టి మోక్ష ధర్మంబులు జెప్పటయు నను వృత్తాంతముల నొప్పి పదునాలుగువేలు నేమూట యిరువదియేడు శ్లోకంబులు గలిగి—

క. సకలహితంబై శాంత్యా
దిక పర్వ చతుష్కమున విదితమై సమ బు
ద్ధికిఁ బండ్రెండగు పర్వం
బ కడున్ మేలవఁగ శాంతిపర్వము వెలయున్
ఆది. 1–57–58.

నన్నయ పర్వానుక్రమణికలో ప్రతి పర్వమునకు పద్యము వ్రాసి, ఆ పర్వ విశేషమును నందు స్ఫురింప జేసినాడు. తక్కిన పర్వములను గూర్చి చెప్పినపుడు, 'రమ్యంబై' 'హృద్యంబై,' 'విదితంబై,' మొదలగు విశేషణములు వాడి శాంతిపర్వము—పర్వము లన్నిటిలో 'మేలైనది' శ్రేష్ఠమైనది—అని వ్యక్తపఱచి నాడు.

ఈ పర్వమే—పర్వములలో నెల్ల శ్రేష్ఠమైనదని—'పర్వంబ' అని ఏవకారార్థముచే నిబంధించి యున్నాడు.[5] కురుపాండవ మహాసంగ్రామానంతరమున—నా శోభవంతయు జల్లారి ధర్మరాజునకే గాక, సమస్త లోకమునకు శాంతిని సమకూర్చినది యగుట నిది 'శాంతి' పర్వమైనది.

శాంతిపర్వము, భారత పర్వము లన్నింటిలో శ్రేష్ఠమైనదేగాక, శ్లోక సంఖ్యలోకూడ పెద్దది. ఇందు 366 అధ్యాయములు, 14732 శ్లోకము లున్నవి. నన్నయ, ఇందు 14525 శ్లోకము లున్నవని చెప్పటచే—నన్నయ చూచిన మూల సంస్కృత ప్రతినే-తిక్కన చూచెనని యేర్పడుచున్నది

## తిక్కన యనువాదము

తిక్కన—మూలమున 14732 శ్లోకములు గల శాంతి పర్వముమ తెలుగున—ఆఱాశ్వాసములలో 3093 గద్యపద్యములలో రచించినాడు. వాని వివరములు.

---

5. నన్నయ భాషలో ఏవకారార్థమునొప్ప 'అ'కారము నిత్యముగా వచ్చును. అందువలన తిక్కన సంబోధ నాశ్చర్యార్థకములవలె, నిచ్చట—స్వరవ్యంజన యతులు రెండు లేవు. ఒక్క వ్యంజన యతి మాత్రమే యుండును. పర్వంబ కడున్ మేలవగ శాంతిపర్వము వెలయున్—వర్గయతి అఖండయతి కాదు.

| | | |
|---|---|---|
| ప్రథమా శ్వాసము | | 400 |
| ద్వితీయా | ,, | 449 |
| తృతీయా | ,, | 531 |
| చతుర్థా | ,, | 457 |
| పంచమా | ,, | 632 |
| షష్ఠా | ,, | 624 |
| | | 3093 |

పై వివరములనుబట్టి తిక్కన—మూలమును వార్ధిన వంతు మాత్రమే సంగ్రహించి, శాంతిపర్వము రచించెనని స్పష్టమగుచున్నది. మూలమున గల (1) ఉతథ్యగీత (2) వామదేవగీత (3) ఋషభ గీత (4) పింగళగీత (5) శంపాకగీత (6) మంకి గీత (7) బోధ్యగీత (8) హారీతగీత (9) పరాశర గీత—ఇవి పూర్తిగా విడిచిపెట్టబడినవి. ఇట్లే మూల మున గల (1) శాకుంతలోపాఖ్యానము (2) చిరకారిణో పాఖ్యానము ఇందులేవు. దక్షయజ్ఞ ధ్వంసవర్ణనము విడుచుటయే గాక, మూలమునగల శివసహస్ర నామ స్తోత్రము విడువబడినది. మధ్యగల పై భాగము బ వదలి—శాంతిపర్వమున గల రాజధర్మ, ఆపద్ధర్మ, మోక్ష ధర్మములను విశదముగా సంగ్రహముగా దెలిపి—శాంతిపర్వమును

'శాంతి సమైక భావనా' (6–622) అని శాంతి పాఠముతో ముగించినాడు.

'వైదిక ధర్మాచరణమువలన శాంతి సమ కూరును' అని యీ పర్వసందేశము.

## తిక్కన దశావతార స్తుతి

తిక్కన శాంతిపర్వమున దశావతార స్తుతి గావించినాడు. గాని యీ విషయమీ సంశోధిత ముద్ర ణమున లేదు.'[6] ఇదివఱకు భారత విమర్శకులు తెలుప లేదు.

## భీష్మ స్తుతి

శాంతిపర్వము ద్వితీయాశ్వాసము 20 వ పద్యమునుండి 56 వ పద్యము వఱకు. భీష్ముడు శ్రీ కృష్ణుని స్తుతియించు ఘట్టము నీ స్తుతి గలదు. ఈ స్తుతిలోనే దశావతార స్తుతి యున్నది. అది 39 వ పద్యముతో ప్రారంభము.

## మత్స్యావతారము

1. క. మీన యిత్తా వతల గతం
బైన నిగమ చయముఁదెచ్చి యజునకుఁనొసగం
గా నేర్చిన సుమనస్స
మ్మానిత విగ్రహు భజింతు మత్స్యాత్ము
హరిన్—39.

## కూర్మావతారము

2. క. అమృత మథనమున మంథ న
గము లీలోద్ధరణ కేళి గైకొని సుర సం
ఘమునకుఁ బ్రియఁ మొనరించిన
యమేయుఁ గూర్మాత్ము నంబుజాక్షుం గొలు
తున్ 40

## వరహావతారము

3. క. వారాహ రూపమునఁ బెం
పారిన తన దంష్ట్ర నొకట నవని నగిరి కాం
తారంబుగ నెత్తిన యా
శౌరింగ్రోడాత్ముఁ దలఁతు సత్యగ్భక్తిన్ 41

## నరసింహావతారము

4. ఆ. నారసింహవ పురుదారభావము నొంది
ఘను హిరణ్యకశి ప్రఖరనఖముల
వచ్చి దీప్తమూర్తి వఱలు నృసింహాత్ము
నాత్మభవుని భక్తి నాశ్రయింతు. 42.

## వామనావతారము

5. క. వామన రూపంబున ను
ద్దామ బలున్ బలునడంచి త్రైలోక్యాతి

---

6. దశావతారములు అను శీర్షికగూడ లేదు. ఇదివఱకు ముద్రితమైన భారత ప్రతులలో లేదు.

క్రామితఁ బేర్చిన యద్భుత
ధాముం గ్రాంతాత్ముఁ దలఁతు దామోదరు
విన్ 43

## పరశురామావతారము

6. ఆ. పరశురాము డనగ భవ్యుడు జమదగ్ని
కుద్భవించి యిరువ దొక్కమాఱు
మనుజపతులనెల్లఁ దునిమిన క్రోధాత్ము
దధిక భక్తి శార్ఙ్గి నాశ్రయింతు 44

## రామావతారము

7. క. క్షత్రాత్ముఁ గొలుతు దశరథ
పుత్రున్ శ్రీరాముఁడనఁగఁ బొలిచిన దేవున్
శత్రు భయదు రావణు నొక
మాత్రం దనుమాడి వట్టి మధుసూదనునిన్ 45

## బలరామావతారము

8 క. హల ముసలధరునిఁ గరుణా
నిలయు హృదయు రాము రౌహిణేయు సితాంగున్
జలద నిభాంబరుని శుచిం
దలఁతును గోవిందు శౌర్యధను భోగాత్మున్ 46

## శ్రీ కృష్ణావతారము

9. మ. యదువంశంబున వాసుదేవుఁడనఁ
గ్రీడార్థంబు జన్మించి దు
ర్మద దైత్యావళిఁ గూల్చి పార్థునకు
సారథ్యంబు త్రైలోక్య స
మ్మద మారఁగ నొనర్చి దేవముని
సమ్మానోద్ధతిన్ భూభారం
బు దొలంగించిన చక్రి నంబురుహ
నాభుం గొల్తు కృష్ణాత్మునిన్ 47.

## కల్క్యవతారము

10. క. కవికాల చలిత్ ధర్మము
నిలుపఁగల యట్టి విష్ణునిం గల్క్యాత్ముం
దలఁతుఁ దురగ వాహను మ్లే
చ్ఛుల నెల్లం గీటడంచు శుభచారిత్రున్ 48

తెలుగు భాషలో దశావతారస్తుతి చేసిన మొదటి కవి తిక్కనయే - యగుటచేత వాతని స్తుతి వివరములను మనము తప్పక తెలుసుకొనవలసియున్నది.

1. మత్స్యావతారము
2. కూర్మావతారము
3. వరాహావతారము
4. నారసింహావతారము
5. వామనావతారము
6. పరశురామావతారము
7. శ్రీరామావతారము
8. బలరామావతారము
9. శ్రీ కృష్ణావతారము
10. కల్క్యవతారము

ఈ దశావతారములలో బుద్ధావతారము లేదు.[7] తిక్కన తరువాతి కవులలో బుద్ధావతారమున్నది. తిక్కనకుముందు దశావతారములలో బుద్ధావతారమున్నట్లుగా నీ క్రింది శాసన శ్లోకము తెలుపు చున్నది.

మత్స్యః కూర్మ వరాహశ్చ
నారసింహశ్చ వామనః
రామోరామశ్చ రామశ్చ
బుద్ధః కల్కిరేవచ'

(క్రీ. శ. 7 వ శతాబ్దినాటి మహాబలిపుర శాసనము.)[8]

---

7. ఇప్పటికి పదునాలేండ్ల క్రిందటనే - తిక్కన దశావతార స్తుతిని గురించి తెలుగు సాహిత్యమునకు వ్యక్తము చేసినాము. (చూ. తెలుగున దశావతారములు—బుద్ధుడు—బుద్ధ జయంతి (ద్విసహస్ర) సంచిక 1956. పరిశోధన సంపు 16. సంపాదకుడు తి. రామచంద్రగారు. ఈ పత్రిక ప్రస్తుతము లేదు.

8. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక— 1924 శాసనావళి సి. ఆర్. కృష్ణమాచార్యులు—

తెనుగున దశావతారస్తుతి యెప్పుడు ప్రారంభమైనది అన్న విషయమునుగూర్చి యింతవఱకు పరిశ్రమ జరుగలేదు. తిక్కన అవైదికమగు బౌద్ధమత సంప్రదాయ ప్రవర్తకుడగు బుద్ధుని దశావతారములలో నుండి తప్పించి బలరామ కృష్ణాద్యవతారములను వేఱుగా వర్ణించినాడు. ఈ దశావతారములపై శాస్త్రీయమైన పరిశోధన ఆవశ్యకము.

## భీష్మస్తుతి మూలము

భీష్మస్తుతికి మూలమున 'స్తవరాజోపాఖ్యానము' అని పేరు. అది 48 వ అధ్యాయమున 101 శ్లోకములతో నున్నది. తిక్కన దానిని 36 పద్యములలో రచించి ఇది స్తుతి రూపమగుటవలన 2 సీసములు 1 మత్తేభము– తప్ప, తక్కినవి కందములు తేటగీతులలో సంతరించినాడు.

ఈ స్తుతి మూలమున త్రిమూర్త్యాత్మకముగా నున్నదిగాని కేవలము విష్ణుపరముగా లేదు. దీనిని కొంత వివరించుచున్నాను. ఇందు విష్ణుస్తుతి విశేషముగా నున్నను బ్రహ్మస్తుతి శివస్తుతికూడ గలదు.

### బ్రహ్మస్తుతి

జటినే దండినే నిత్యం
లంబోదర శరీరిణే
కమండలు నిషంగాయ
తస్మై బ్రహాత్మనే నమః (81)

### శివస్తుతి

శూలినేత్రిదశేశాయ
త్ర్యంబకాయ మహాత్మనే
భస్మ దిగ్ధోర్ధ్వలింగాయ
తస్మై రుద్రాత్మనే నమః (82)
చంద్రార్థకృత శీర్షాయ
వ్యాల యజ్ఞోప వీతినే
పినాకశూల హస్తాయ
తస్మై ఉగ్రాత్మనే నమః (83)

కాని తిక్కన, ఈ బ్రహ్మ శివస్తుతులను విడిచి, భారతమున కృష్ణ ప్రాధాన్యము నిరూపించుటకు ఈ స్తుతి యంతయు విష్ణుపరముగా చేయుటయేగాక, తన్మహిమా ప్రదర్శకమగు దశావతార స్తుతిని రచించినాడు. తక్కిన యవతారములను కందములలోను, గీతములలోను వర్ణించి, కృష్ణుని యవతారము మత్తేభముతో వ్రాయుటయు నిందుకు ప్రోద్బలకము.

## హరిహరతత్త్వము

భీష్మస్తవమున కృష్ణ ప్రాధాన్యము ప్రతిపాదించినను నిందు హరిహరా ద్వైతము నెలకొల్పుట తిక్కన ప్రతిభ వ్యక్తము చేయుచున్నది. కృష్ణుని స్తుతించిన హరిని స్తుతించినట్లయినది. ఇక హర– స్తుతి యేదియని ప్రశ్న రావచ్చును. అంతేకాక తిక్కన—పై నుదాహరించిన రెండు శివ సంబంధములైన శ్లోకములు–విడచినాడు– అంతయు హరిపరమే చేసినను ఈ స్తుతి–36 పద్యములలో వ్రాయుట.

హరతత్త్వము నిరూపించును. ఈ 36 పద్యములు శైవమున, షట్త్రింశత్తత్త్వ సంప్రదాయమును సూచించును.

'క. సర్వేశ్వర! షట్త్రింశ
త్పర్వోపరి గత జగత్ప్రభవ హేతు జగ
న్నిర్వాణ సోమ రూపను
ఖర్వ మహత్త్వంబు బొగడఁ గడు నరిది శివా
శివతత్త్వసారము 14 ప.

శైవమున—నీ ముప్పది యారు తత్త్వములకు ప్రాధాన్యము గలదు. (1) పృథివి (2) ప్రకృతి (3) బుద్ధి (4) అహంకారము (5) మనస్సు (6) శ్రోత్రము (7) త్వక్కు (8) చక్షువు (9) జిహ్వ (10) ఘ్రాణము (11) వాక్కు (12) పాణి (13) పాదము (14) పాయువు (15) గుహ్యము (16) శబ్దము (17) స్పర్శము (18) రూపము (19) రసము (20) గంధము (21) ఆకాశము (22) వాయువు (23) వహ్ని

(24) జలము (25) మాయ (26) కాలము (27) నియతి, (28) కల (29) రాగము (30) పురుషుడు (31) శుద్ధ విద్య (32) సకల (33) ఈశ్వరుడు (34) మహేశ్వరుడు (35) సర్వేశ్వరుడు (36) సదాశివుడు.[9]

తిక్కన షట్‌త్రింశత్పర్వములు వ్రాసి— ఈ భీష్మ స్తవము, హరిహర స్తుతిగా సృష్టించుటయే యాతని ప్రతిభ-

## శాంతి పర్వము
## ఛందో విశేషములు

ఈ పర్వమున ధర్మ నిరూపణము ప్రధానమగుటచేత, తిక్కన, లోతైన జాతియములు, పలుకుబడి, యుపయోగింపక, సరళమును, సర్వజన గ్రాహ్యమునగు శైలిలో రచించియున్నాడు. ఇందలి ఛందస్సును పరిశీలించిన యీ విషయము స్పష్టమగును. ధర్మములు నీతులు తెలుపుటకు—కందములు ప్రధానము—తిక్కనయందు 1212 కందములు వాడినాడు. ఇన్ని కందములతఁ డితర పర్వములందు వాడనే లేదు. ఈ పర్వము రసప్రధానము కాదు కాబట్టి 30 మత్తేభ వృత్తములు 14 శార్దూల వృత్తములే వాడినాడు. ఇందువలన పర్వముల కథావస్తువు ననుసరించి, తిక్కన, ఎట్లు ఛందస్సును మలచెడివాడో మనకు తెలియగలదు స్రగ్ధర, మహాస్రగ్ధర— రెండింటిని మాత్రమే ఒక్కొక్కటి వాడినాడు. ప్రసిద్ధ వృత్తములతక్క తక్కిన వృత్తములు— తిక్కన ఇందు వాడనేలేదు.[10]

శాంతి పర్వమున నాతని ఛందో వివరణమిది.

| | |
|---|---|
| వృత్తములు | |
| ఉత్పలమాల | 55 |
| చంపకమాల | 111 |
| మత్తేభము | 30 |
| శార్దూలము | 14 |
| మాలిని | 6 |
| స్రగ్ధర | 1 |
| | 217 |
| | 217 |
| మహాస్రగ్ధర— | 1 |

| | |
|---|---|
| జాతులు : ఉపజాతులు | |
| ఆటవెలది | 165 |
| (సీసము) | 65 |
| తేటగీతి | 243 |
| (సీసము) | 148 |
| సీసములు | 241 |
| | 1080 |
| | 1080 |
| కందములు | 1212 |
| వచనములు | 801 |
| | 3093 |

నన్నయ ఛందస్సువలె, తిక్కన ఛందస్సును గూర్చి పరిశ్రమ చేయవలసియున్నది. శిల్ప కళా దృష్టితో తిక్కన ఛందస్సును గూర్చి పరిశ్రమ జరిగి నది![11] కాని శ్రీనాథుడు చెప్పిన—

సీ. వాక్కుతుత్తిక్క యజ్వప్రకారము రసా
భ్యుచిత బంధంబు నొక్కొక్కమాటు

అమసూక్తి ననుసరించి, ఏయే పర్వముల నాయా రసాను గుణ్యముగా నాతని కవితారీతి యున్నదో పరిశీలింపవలసి యున్నది — స్త్రీ పర్వమున, తనకు

---

9. శివతత్త్వసారము— నా విపుల పీఠికా పరిష్కరణము. పుట 26 అధోజ్ఞాపిక. కృష్ణా పత్రికాధిపతులచే ప్రకటితము.

10. సమగ్ర ఆంధ్ర సాహిత్యం రెండవ సంపుటం కాకతీయ యుగం. తిక్కన సోమయాజి 'తిక్కనగారి గద్యపద్యాలు' అనే పట్టికలో ఇచ్చిన కొన్ని వివరములు సరికావు. ఉదా. సీసములు 40 మాత్రమే యున్నట్లు వ్రాయబడినది. ఒక్క ప్రథమాశ్వాసములోనే 57 సీసములున్నవి. ఇక, తరువోజ శుద్ధవిరాటి, సరసిజము—స్రగ్విణి—స్వాగతమూ అ వృత్తములున్నట్లు చూపబడినది. కాని అది సరికాదు, ఆ వృత్తములు శాంతి పర్వమున లేవు. (పుటలు 90-93.)

11 డాక్టరు పాటిబండ మాధవశర్మగారి ఛందఃశిల్పము—

ఛందశ్శాస్త్రమున ప్రజ్ఞయున్నట్లు ప్రదర్శించుటకు విలక్షణ వృత్తములనేకములు రచించెనని విమర్శకులు వ్రాసినారు[12] కాని యిది యెంతమాత్రము సరి కాదు. స్త్రీపర్వము కరుణరస ప్రధానము. శోకరసము స్థాయి. ఈ శోకోల్బణమును తగ్గించుటకే తిక్కన— భిన్న భిన్న వృత్తములను విరచించెను.

ధర్మము, వేదాంతము, పరతత్త్వము మున్నగు గంభీరవిషయములను, ఏనుగువద్దములో చూపినట్లు తెలుగు పదములలోనే తెలిపిన తిక్కన తెనుగు కవితా సృష్టి—ఒక్కచోట మాత్రము ధర్మరాజా ఉత్కర్ష నిరూపించుటకు దీర్ఘ సంబోధన వాడినాడు—

క. హింసావిహారియైన నృ
శంసుండీయాఱుఁ గలుగుజనుఁ కంటెనుగీ—
డం స్వప్రదేశలవితో
త్తంసీకరణోపలాల్య ధరణీ వలయా

(3-4-26)

ఇందు కందము 4 పాదములలో రెండు పాదములు సంబోధన—ఈ పర్వమున—యతిప్రాస విశేషము లెన్నో పరిశీలింపవలసిన యావశ్యకత యున్నది.

## తిక్కన పూర్వకవి యనుసరణలు

సాధారణముగా తిక్కన పూర్వకవియను సరుణలను చేయుదు—తిక్కనలోనున్న ప్రత్యేక విశిష్టత యదియే—అయినను వచ్చుటచ్చుట యాతని కవితలోనవి గన్పట్టు చుండును—శాంతిపర్వమున నట్టి పట్టులు మూడుగలవు.

1

4–128 క. వినుమంతర్నాడిం జను
బనువడి పవనంబు బ్రహ్మపద మొందఁ గశాం
తి నిరాధమైన చిత్తము
గను నాచందంబు నందకల యుం బిదపన్

ఈ పద్యమున తొలి రెండు పాదములను— కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయమునగల నాంది యందలి రెండవశ్లోకము ప్రథమపాదము ననుసరించి నది—

'అంతర్నాడీనియమిత మరుల్లంఘిత బ్రహ్మరంధ్రః'

2

6–97 క. దీపమున ననేకములగు
దీపములు పరంపరాను దీప్తాకృతులై
వ్యాపించు చందమునగుణ
రూపంబులఁ బఱవుఁ బ్రకృతి దోష విదూరా!

ఈ పద్యమున మొదటి మూడుపాదములు—

'ప్రవర్తితో దీపఇవప్రదీపాత్' అను రఘువంశ శ్లోకపాదము ననుసరించినది—(5–37)

3

6–119 చ ఉదిత సమగ్ర బోధుఁడగు
యోగికి నిశ్చల దీపరూపసం
పద సుఖసుప్తభంగి ఘనపంక్తులు
లేని వియత్తలంబు నా
ప్పిద మొదవుం దరంగముల పెల్లునఁ
దాఁజలితంబుగాని వా
ర్ధిదశ నతండ కంపుఁడగు
ధీ పరివృత్తులుగల్గ నేనియున్

ఇది

''అవృష్టి సంరంభ మివాంబు వాహ
అపామి వా ధారమనుత్తరంగమ్
అంతశ్చరాణాం మరుతాన్నిరోధా
నివాత నిష్కంప మివ ప్రదీపమ్''.

అను కుమార సంభవశ్లోకమున కనువాదము

(3–48)

## స్వసంవాదములు

ఈ శాంతి పర్వమున స్వసంవాదముల ప్రశంస లేదు. ఈ క్రింది యుదాహరణములను పరిశీల నార్హములు.

## 1. షోడశరాజ చరిత్ర

శాంతి పర్వమున షోడశరాజ చరిత్ర 1 ఆ. 229 నుండి 1 ఆ. 244 వఱకు పదునాఱు సీస

12. సమగ్ర ఆంధ్రసాహిత్యం పుట. 89

ములు పదునాఱు నింతకుముందు ద్రోణ పర్వమున 2 ఆ 197 నుండి 2 ఆ. 212 వఱకు గలవు. ద్రోణపర్వసంపాదకులీ విషయమును గూర్చి 2–146వ వచనమున అధోజ్ఞాపికలో చర్చించియున్నారు. (పుటలు 354–55) అందీ పదునాఱు పద్యములు యథాతథముగా శాంతి పర్వమున నున్నట్లు స్పష్టముగా వ్రాయబడినది. కాని శాంతిపర్వమున– నీ షోడశరాజ చరిత్ర ప్రారంభమునగాని పీఠికలోగాని, సంపాదకు లెప్పటను, నీ స్వసంవాద విషయము తెలుపలేదు. ఈ రెండు పట్టులను పాఠ భేదము లుదాహరింపబడినవి. రెండును తిక్కనవేయై నప్పుడు ఏదో ఒక పాఠమే యుండవలెను గదా. ప్రస్తుత మొకే భాగమున పాఠభేదము లుండుటవలన – తిక్కన పాఠమేదో నిర్ణయింపవలవుగాకున్నది.

## 2. సువర్ణష్ఠీవి కథ

ఇదియును ద్రోణ పర్వమున నున్నదే. 2–188 మొదలు 2–195 వఱకు నున్నది. కాని యిదియు సూచింపబడలేదు. ఈ కథలో 264 పద్యమగు

క. ప్రముచ్చుల మూఢత్వమునం
జచ్చి నరక వాసమునకుఁ జనిన తనయున్
దెచ్చిద మగుడంగ వేనీ
కిచ్చెద వగ్గుడు మింటనేనియు నధిపా

అనునది ద్రోణపర్వమున ద్వితీయాశ్వాసమున 219 పద్యముగా నున్నది.

క. ఫలములయెడ బ్రహ్మార్పణ
కలనపరుండగుచుఁ గార్యకర్మమునడపన్
వలయుం దత్త్వజ్ఞానము
దలకొనినన్ కర్మ శమము దానై కలుగున్
1–69

...థాతథముగా భీష్మపర్వము ప్రథమా... 02 వ పద్యముగా నున్నది.

తే. పొదలు దఱుగుటకై పొనొదవ్వబడుట
కై కడుం జేటఁ బాయుటకై జనించు
కోరియుటకునై సుఖంబుఁ బొందు దుఃఖ
పొందుటకునై పదార్థంబులెందు నధిప

(శాంతి 1. 206) — ఈపద్యమే యథాతథముగా అశ్వమేధపర్వము 2–165 లో నున్నది.

పర్వమునందే–రెండువూరులు చెప్పబడిన పద్యములను గమనించినట్లు లేదు—

క. అరయంగా శబ్దంబును
పరంబునన రెండునూవె బ్రహ్మములు గుణో
త్తర శబ్దబ్రహ్మ భజన
పరుఁడు పరబ్రహ్మమహిత పదముం బొందున్
4–71.

ఈ పద్యమే యథాతథముగా 4 ఆ. 332 పద్యముగా నున్నది.

క. జలపవనాంబర వసుధా
నల సమవీర్యుఁడగు పుత్రు నాకొసగంగా
వలయుననుడు నిచ్చితి వని
పలికిచనియెనమ్మహాకృపామూర్తి నృపా
6–249 పద్యము–

షష్ఠాశ్వాసమున 339 పద్యముగా నున్నది.

క. మునులును సురలును దీనిని
విని కొని యాడుదురు విష్ణు వినుతింతురు భ
క్తి నిరూఢులై జపింతురు
మనమునఁ జర్చింతు రతి సమాహితులగుచున్
6–392

ఇదియే కొంచెము భేదముతో 6–411 లో నున్నది.

క. మునులును సురలును విష్ణున్
వినుతించి నమస్కరించి నిజపదములకుం
జనిరి పరమేష్ఠి యొకరుఁడ
చన కచ్చట నిలిచె హరియు సన్నిహితుండై

ఇట్లే ఎత్తుగడలు సమానములుగా నున్నవి.

క. ప్రియములు నప్రియములును హృ
దయమును జిక్కువడఁ..... 4–6.

ఇదే 4—345 కందపద్యమున మొదటి రెండు పాదములు.

క. ఆదిత్య మరు ద్వసు రు
ద్రాది దివిజ గణములెల్ల 2–37.

ఇది

క. ఆదిత్య మరు ద్వసు రు
ద్రాది సకల దేవతామయా 4–456

క. ఆదిత్య మరు ద్వసు రు
ద్రాది దివిజగణము 6—386

క. ఆదిత్య మరు ద్వసు రు
ద్రాది సురులు 6—403

అను మూడుపట్టుల నున్నది.

తే. ఎల్లి చేసెద ననక మేలిపుడ చేయు
మనఘ వార్చునె మృత్యువు జనుల పనులు
5—382

ఇదియే 6—234 లో నున్నది.

ఇట్టి వింకను గలవు.

## శాంతిపర్వము—విషయవిశిష్టత

తిక్కన శాంతి పర్వమున, బట్టలకు కారము పెట్టుటనుండి బ్రహ్మపదార్థము వఱకుగల సకల విషయములను ప్రపంచినాడు. ఇవి గ్రహించుటకు మూలముతో నామూలాగ్రముగా పరిశీలింపవలెను. తిక్కన మూలమున కొన్నిపట్టులు స్వతంత్రించినాడు. ఉదాహరణము: తృతీయాశ్వాసము దండోత్పత్తి కథనమున—అర్థశాస్త్రమును నీతివిద్యగా చెప్పినాడు—"అర్థశాస్త్ర నీతివిద్య (3—216) కాని మూలమున—అర్థశాస్త్ర చతుర్థంతు" అని—ఇది దండనీతి భాగముగా చెప్పచున్నది — రాజధర్మ. ఉపద్ధర్మమోక్ష ధర్మములేగాక-సాంఘిక వ్యవస్థనుగూర్చి విషయములున్నవి. (1) అజగరన్యాయము — (2) బట్టలకు కారముపెట్టిన మలినముతొలగును (3) బాహుదానది, చెయ్యేరుకథ లిఖితుడను వాడు చేతులు ఖండింపబడిన తరువాత—అందు మునుగంగా, తిరిగి చేతులు వచ్చినవి—అందుచేతది 'బాహుదా' నదియైనది. (4) పూర్వము వెట్టిని మాన్పుటకు కొన్ని విధములైన నశ్యము లుపయోగించెడి వారు (5) నటకులు పంక్తి బాహ్యులు—శాంతిపర్వము నెంతగా పరిశీలింపవలయునో దిఙ్మాత్రముగా చూపుటకే—పై విషయములు వ్రాసినాడను—

## సంప్రదాయ దృష్టి వివర్జనము

సంస్కృత పదములను విడిచి, మహోన్నత భావములను యలతియలతి తెలుగుపదములలో కవితా సృష్టి గావించిన తిక్కన కవితాతత్త్వమును గూర్చి నేటివఱకు సాధికారమైన గ్రంథము వెలువడలేదు—తిక్కన—భీష్మునిచే— "వాఙ్మయాధ్వరార్చితు జేసితి నాజనార్దను—" (2—55) అని యనిపించి నాడు—తిక్కన—అధ్వరములో చేసిన;

## కర్మ యోగి యే గా క

వాఙ్మయాధ్వరమొనర్చిన జ్ఞానయోగి. కర్మజ్ఞాన సముచ్చయాత్మికమైన భక్తియోగము—తిక్కన కవితా తత్త్వము—ఇట్లు లౌకికా ధ్యాత్మికములను సమన్వయించిన—

## ఆంధ్ర వ్యాసుని

గూర్చి—ఇతోఽధికముగా వ్యాసంగము జరుగుగాక—

మ. తమకావించిన సృష్టి తక్కొరుల
చేతంగాదు దా, నే ముఖం
బునఁ దాఁబల్కిన బల్కు లగమములై
పొల్పొందు నా, వాణి న
త్తను నీతండొకరుండు నా జను
మహత్త్వవ్యాప్తిం గవిబ్రహ్మ నా
వినుతింతుం దగఁ దిక్కయజ్వ
నిఖిలోర్వీ దేవతాభ్యర్చితున్.

ఎఱ్ఱన—

(అయిపోయింది)

---

మని ప్రధానాంగాలు నాలుగూ నాలుగు వర్ణాలకీ ఉద్భవస్థానాలని మాత్రమే ఇందులో ఉన్నది. దీనిని బట్టి 'వర్ణం' జన్మతః యేర్పడినట్లే భావించవలసి ఉంటుంది. విరాట్పురుష వర్ణన నాటి ఆర్యసాంఘిక వ్యవస్థకు రూపకల్పనగా తోస్తుంది. ఈ వ్యవస్థలో పంచములు లేరు. వర్ణవ్యవస్థ ఆరంభమైనప్పుడు పంచమవర్ణమే లేదని గ్రహించవలసి వస్తున్నది. ప్రాచీన తమ వేదకాలంలో లేని పంచమవర్ణం తరువాతి యుగాలలో ఎందుకు జనించినదో కూడా చరిత్రకారులకు అంతుతేలని సమస్యగానే పరిణమించింది.

ఆర్యులు గంగా సింధు మైదానాల్లో ప్రవేశించకముందు వారిలో వర్ణ విభజన లేదు. వారందరిదీ ఒకే వర్ణం. పశ్చిమాశియానుంచి వివిధ మార్గాలలో వీరు పయనించారు. యూరప్ ఖండం చేరుకున్నవారిలో గాని, పర్షియాలో నివాసం యేర్పరచుకున్నవారిలోగాని వర్ణవ్యవస్థ లేకపోవడంవల్ల ఈ ఊహకు బలం చేకూరుతున్నది.

ఆర్యులు పశుపాలకులుగా హిందూదేశంలో ప్రవేశించారు. సేద్యవృత్తితో వీరికి పరిచయం అతిస్వల్పం. సేద్యంలో అనుభవం గడించినవారు శతవిధాల తమ మాతృభూమిని విడిచి దూరతీరాలకు పయనించడం జరగదు. మూకఉమ్మడిగా హిందూ దేశానికి వలస రావడాన్నిబట్టి వీరికి కృషీవల పరిజ్ఞానం లేదని గ్రహించవచ్చు. సింధు, పంచనద ప్రాంతాల్లో అంతకు పూర్వం నివసిస్తున్న అనార్య ప్రజలను వీరు విశ్లేషంగా వధించి ఉండవచ్చు. తైత్తిరీయ బ్రాహ్మణంలో ఆర్యులు, లెక్కకు మిగిలినన్ని అనార్య జనపదాలను అగ్నికాహుతి చేసిన సందర్భాలు గోచరిస్తాయి.[2] ప్రాచీన చరిత్రలో యిటువంటి దండయాత్రలు నిర్దాక్షిణ్యంగాను, అమానుషంగాను ఉండేవి. పరాజితుల నందరిని సమూలంగా వధించడం సర్వసామాన్యం. నాటి పశుపాలకుల ప్రవర్తన బైబిల్ పూర్వకాండలో విపులీకరించబడింది. పశ్చిమాసియా సుక్షేత్ర చంద్రికలో సర్వసౌభాగ్యాలతో తులతూగే నగరాలనేకం దారుణంగా ధ్వంసం కావింపబడ్డవి. స్త్రీ, పురుష, శిశు, పశు వివక్షతలేకుండా ఊపిరి పీల్చుకునే ప్రాణులన్నీ వధింపబడటమూ, కట్టడాలను తగులబెట్టడము జరుగుతూ ఉండేవి. జాషువా గ్రంథంలో ఈవిశేషాలు గోచరిస్తాయి.[3]

ఈ దండయాత్రల ఫలితంగా అనార్యవర్గాలు తూర్పుగా గంగాయమునా తీరాల్లో వ్యాపించిన అరణ్యాలలోకి దక్షిణంగా వింధ్యాద్రుల వెనుక ప్రబలిన అడవులలోకి పారిపోవలసి వచ్చింది. ఈ అనార్య వర్గాలలో ద్రవిడజాతుల కూటములకు సేద్యమే ప్రధానవృత్తి. వీరు అడవులలో అనువైన స్థలాలు చూసుకుని స్థిరపడుతూ వచ్చారు.

కాని అనతికాలంలోనే సింధు, పంచనద ప్రాంతాలనుంచి ఆర్యులు తూర్పుగా వ్యాపించడానికి ప్రయత్నం ఆరంభించారు. వారి పశుగణాలకీ పెరుగుతున్నవారి జనసంఖ్యకీ, కొత్త పచ్చిక మైదానాలు వేటకి అనువైన అడవులు అవసరమయ్యాయి.

అరణ్యమధ్యంలో ఏర్పడ్డ అనార్యజన పదాలకు వారిని ఆవరించి ఉన్న దట్టమైన అడవులు కొంతవరకు సహజమైన రక్షణ కలుగజేస్తాయి. అనార్యులు కూటములుగా యేర్పడి ఆర్యుల దండయాత్రలను చాలవరకు నిరోధించగలుగుతూ వచ్చారు. దట్టంగా వ్యాపించిన అడవులగుండా విజయవంతంగా మూక ఉమ్మడి దండయాత్రలు కొనసాగించడం ఆర్యులకు అసాధ్యమైంది. ఎవరికీ సంపూర్ణవిజయం లేని సంఘర్షణలు జరుగుతూ ఉండేవి.[4] చివరకు శ్వేతవరులైన ఆర్యులు, బభ్రువర్ణంగల అనార్యులతో సఖ్యం పెంచుకుని, సహజీవనానికి అంగీకరించారని నమ్మవచ్చు. కుశాగ్రబుద్ధులైన ఆర్యులు అనార్యుల

---

2. తైత్తిరీయ బ్రాహ్మణం II 4, 6 & 8.

3. Old Testament 6.

4. మహాభారతంలో ఖాండవదహనం ఈరకపు సంఘర్షణనే సూచిస్తున్నది.

డా. ఆర్. సుబ్రహ్మణ్యంగారు, ఈ విషయాన్ని నా దృష్టికి తెచ్చారు.

కృషీవల విద్యవలన కలిగే ప్రయోజనాలను త్వరలో గ్రహించారు.

జాతిభేదమూ, వర్ణభేదముకల మనుష్యులతో సహకరించి నూతన సాంఘిక వ్యవస్థను నెలకొల్పడానికి పాలకులైన ఆర్యులు నిశ్చయించుకున్నారు. ఈ సంకల్ప ఫలంగా ప్రభవించిన వర్ణవ్యవస్థ విరాట్పురుషుని వర్ణనలో మనకు గోచరిస్తున్నది. జాతుల మేళవింపుతో నూతన సమాజ నిర్మాణానికి ప్రయత్నం తొలిసారిగా హిందూదేశంలోనే జరిగింది.

ఈ సహజీవన యత్నానికి పూర్వం ఆర్యులలో కర్మకాండలకు అధ్వర్యులైన ఋషులు, యుద్ధతంత్ర నిపుణులైన పశుపాలకులు అని ద్విభజనకు మాత్రం స్థూలంగా అవకాశం ఉండేది. ఋషుల అభీష్టానికి లోబడి యుద్ధ నిపుణులైన క్షత్రియులు నడచుకునేవారు. వీరిలో జాతిభేదంగాని, వర్ణభేదం గాని లేవు. ధర్మశాస్త్రాలలో బ్రహ్మక్షత్రియుల మధ్య అభేదం పలుతావుల్లో సూచించబడింది. మానవధర్మ సూత్రాలలో ఈవిషయం స్పష్టంగా తెలుస్తుంది.[5] వర్ణవ్యవస్థ ఆరంభమైన తరువాత చాలకాలంవరకు బ్రహ్మక్షత్రియుల మధ్య భేదమే పాటింపబడేది కాదు. ప్రాచీన సంస్కృత సాహిత్యంలో బ్రహ్మక్షత్రియుల సంబంధ బాంధవ్యాలు చాల ఎక్కువగా కనిపిస్తాయి.

తమలో స్థూలంగా రెండువర్గాలు ఉండడం వల్ల అట్టివర్గాలు తమ పాలితుల్లోకూడ ఉండటం ఆర్యులకు సబబని తోచి ఉండవచ్చు. ఆదార్య పాలక వర్గాలు వైశ్యులుగాను, సామాన్యులు శూద్రులుగాను విభజింప బడ్డారు. పూర్వ ప్రభువులైన వైశ్యులను తమసాటి ద్విజాలుగా ఆర్యులు అంగీకరించారు. ఐదవ వర్ణపు ప్రసక్తి ఈనాటికి తలయెత్తలేదు. ఐదవవర్ణం లేదని మనువు సందేహ రహితంగా చెప్పడమూ ఈ సందర్భానికి జతపడుతున్నది.[6] పాలకులుగా స్థిరపడిన ఆర్యులు విరాట్పురుషుని ప్రధానాంగాలు తమకి ప్రత్యేకించుకోడంలో వింతలేదు గదా! వైశ్యులకు ఈ యేర్పాటు సంతృప్తికరంగానే తోచింది. ఆర్యులు వారి వృత్తులతో ప్రమేయం పెట్టుకోలేదు. తమ పశుసంపదను సహితము క్రమంగా వైశ్యులపరం చేశారు. వైశ్యుల రాజకీయ ప్రాబల్యం వెనుకబడినప్పటికి ఆర్థికంగావారి స్థానానికి ఇతోధిక ప్రాతినిధ్యం కలిగింది. యుద్ధ తంత్రంలో తమకన్న నిపుణులైన ఆర్యుల రాజకీయ సాంఘిక నాయకత్వాలకి వైశ్యులు క్రమంగా తలవంచ గలిగారు.

జాతుల సహజీవనంలో ప్రధానమైన సమస్య వర్ణసాంకర్యం. కృషీ వలులైన అనార్యులతో కలిసి జీవించడానికి ప్రయత్నిస్తున్నప్పటికి, వారితో వైవాహిక సంబంధాలు పెట్టుకోడం ఆర్యులకు యిష్టం లేకపోయింది సాధ్యమైనంతవరకు జాతుల పూర్వ్యప్రతిపత్తిని కొనసాగించడానికి ప్రయత్నిస్తూ వచ్చారు. బ్రహ్మ క్షత్రియుల మధ్య మొదట్లో ఉన్న అభేదం కూడా ఈ యత్నంలో మసగుపడ సాగింది. బ్రాహ్మణులు కర్మకాండలకు పూర్తిగా అంకితమైపోయి, అనుక్షణమూ దైవకార్య నిమగ్నులైన తాము

5. "When Kshatriyas became in any way over bearing towards the Brahmanas, the Brahmanas themselves shall duly restrain them; for the Kshatriyas sprang from the Brahmanas.'

"Fire sprang from the water, Kshatriyas from Brahmanas, iron from stone; The all penetrating force of those (three) has no effect on that whence they were produced "

"Kshatriyas prosper not without Brahmanas, Brahmanas proper not without Kshatriyas, Brahmanas and kshatriyas, being closely united prospes in this (world) and the next." 320 to 322 IX, P 399. Laws of Manu : Sacred Books of the East, Vol XXV, Oxford, 1886.

6. "The Brahmana, the Kshatriya and the vaisya castes (Varna) are the twice Born ones, but the fourth, the & Sudra has one birth only; there is no fifth (caste)" Loc. cit. 4, X, p. 402.

క్షత్రియులకంటె పవిత్రులమనీ, అధికులమనీ అనుకోసాగారు. ప్రపంచ చరిత్రలో పురోహిత వర్గాలకి ఈ భావం లేని జాతీ, దేశమూ లేవు. క్రమంగా ఈ ఆధిక్యతా భావమూ, పవిత్రతా భావమూ వారిని తమ జాతివారైన క్షత్రియులకు సహితము దూరం కావడానికి తోడ్పడింది. బ్రాహ్మణులకు వేదకాలంలో ఉన్న సాంఘిక నాయకత్వం తమ్మూలంగా తగ్గిపోతూ వచ్చింది.

జైన, బౌద్ధమతాలు ప్రబలుతున్న కాలంలో బ్రాహ్మణులు శాఖాహారులుగా మారడం ఆరంభమైంది. తమ పవిత్రతను ఇనుమడింప జేసుకోడం కోసం బ్రాహ్మణుల శాకాహారు లయ్యారు. వర్ణవ్యవస్థపై జైన, బౌద్ధమతాల ప్రభావం వర్ణోత్పత్తికి ప్రమేయంలేని శాఖాచంక్రమణం ఇక అప్రస్తుతం.

ఆర్యులు పాలకులైన సాంఘిక వ్యవస్థలో ఉండటం యిష్టంలేని అనార్యులు ఆర్యావర్తాన్ని విడిచి మరింతగా ప్రాగ్దక్షిణ దేశాలకు తరలి పోయారు. ముఖ్యంగా ద్రవిడవర్గాలకు దక్షిణదేశమే శరణ్యమైంది.

వర్ణసాంకర్యాన్ని నిరోధించడానికి ఎంతగా ప్రయత్నించినప్పటికి క్రమంగా సాంకర్యం జరుగుతూ వచ్చింది. యుద్ధాలవలన వర్ణసాంకర్యం ద్విగుణీకృతం ఔతూఉండేది. యుద్ధంవలన సంభవించే అనర్థాలలో వర్ణసాంకర్యం ప్రబలమైన పరిణామంగా భగవద్గీతలో చెప్పబడింది.[7] ఈ సాంకర్యాన్ని ఆర్యులు రెండు రకాలుగా విభజించారు. స్త్రీని క్షేత్రముగాను, పురుషుని బీజముగాను నిర్దేశించి, ఉత్తమ బీజము హీనక్షేత్రంతో సంయోగం కావడం అనులోమమనీ, హీనబీజం ఉత్తమ క్షేత్రంతో యేర్పరచుకున్న సంపర్కం విలోమమనీ నిర్వచించారు. అంటే బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలలో ఏవర్ణమైనా తన ముందు దానికంటే హీనమూ, తర్వాతి దానికన్న ఉత్తమమూ అని గ్రహించాలి.

అనులోమ సాంకర్యంలో ఏ ఆర్యస్త్రీగాని అనార్యపురుషుని పత్నికాగల అవకాశం ఉండదు. అందువలన అనులోమ సాంకర్యం పాలకులైన ఆర్యులకు అంగీకార యోగ్యమైంది. ఈ సాంకర్యం శ్రేష్ఠమని చెప్పక పోయినప్పటికి, నిషేధింప బడలేదు. రామాయణంలోనూ, మహాభారతంలోనూ. ఈ అనులోమ సంబంధాలు చాల కనిపిస్తాయి. పాండవ కౌరవులకు మూలపురుషుడైన శంతనుని పత్ని సత్యవతి దాసకన్య; పెంపకంవల్ల శూద్రవనిత ఐనప్పటికి ఆమె సంతానం క్షత్రియులుగానే పరిగణింప బడ్డారు. దశరథుని భార్యలలో సుమిత్ర శూద్రస్త్రీ. ఆమె సంతానమైన లక్ష్మణునికి జనకుడు తన ఔరసపుత్రియైన ఊర్మిళనిచ్చి నిరాక్షేపణగా వివాహం జరిపించాడు. మానవ ధర్మసూత్రాలలో క్షత్రియ పురుషునికీ, శూద్రస్త్రీకి కలిగిన సంతానం ఉగ్రులని చెప్పబడింది[8] ధర్మశాస్త్ర వ్యాఖ్యానకారులు, తరువాత కాలాల్లో ధర్మనిర్ణేతలు ఉగ్రుడనే పదం మరొక కులాన్ని సూచిస్తుందని అపోహ పడ్డారనుకోవాలి. మనుధర్మశాస్త్రంలో కనపడే సాంకర్యఫల పదాలన్నీ కులాన్ని సూచించే పదాలు కానేకావు, ఏవ్యక్తి కులాన్నిగాని అతని తండ్రియొక్క కులాన్నిబట్టి నిర్ణయించ వలసినదే ఈ సందర్భంలో క్షేత్రమేదైనా, వృక్షం బీజంమీదనే ఆధారపడుతుందని మనువు నొక్కి చెప్పడం జరిగింది[9] ఐదవవర్ణమే లేదనీ, బీజాన్ని బట్టి వర్ణం నిర్ణయింప బడుతుందన్న మనుధర్మాన్ని తృణీకరించి తరువాతి ధర్మనిర్ణేతలూ, వ్యాఖ్యానకారులూ వర్ణవ్యవస్థలో చెప్పనలవికాని గందరగోళానికి కారకు లయ్యారు. వశిష్ఠ, విష్ణు, పారాశర నారద స్మృతుల్లో వర్ణవ్యవస్థను గురించి చెప్పిన మాటలన్నీ, నాటికి వాడుకలో ఉన్న అశాస్త్రీయ పరిణామాలను సమర్థించడానికి వ్రాయబడ్డవే.

---

7. భగవద్గీత, I, 41, 42 & 43.

8. Op. cit. X 9. p. 404.

9. Ibid; IX 35, 36, 37 & 38. pp. 333. 34 & also X 70, 71 & 72 p. 418.

సాంకర్యఫలంగా యేర్పడ్డ సంతానాలకు యివ్వబడ్డ పేర్లు వారి జీవనోపాధికి అనుసరించ వలసిన వృత్తిని మాత్రమే సూచిస్తాయి. ఉదాహరణకు బ్రాహ్మణుడైన పురుషునికీ, వైశ్యస్త్రీకి కలిగిన అంబష్ఠుడు వైద్యవృత్తివలన జీవించవలసి ఉన్నది.[10] తండ్రి బ్రాహ్మణుడు కావడంవల్ల అంబష్ఠుడు ద్విజుడూ మీదు మిక్కిలి వర్ణంలో బ్రాహ్మణుడూ ఔతున్నాడు. కాని తల్లి బ్రాహ్మణ స్త్రీ కాదు గనక ఇతడు తలిదండ్రులిద్దరూ బ్రాహ్మణులైన సంతానానికి 'అనంతరుడు'గా పరిగణింప బడ్డాడు. ఈ అనంతరపదానికి ఎన్నో విపరీతార్థాలు కల్పింపబడ్డాయి. అనంతరు డనగా తండ్రికులం తరువాతి కులంవాడని వ్యాఖ్యానించారు. దీన్ని అక్షరాలపాటిస్తే అంబష్ఠుడు తలిదండ్రు లిద్దరి కులానికీ సంబంధంలేని క్షత్రియుడౌతున్నాడు! మరికొందరు వ్యాఖ్యానకారులు అనులోమ సాంకర్యంలో సంతానానికి తల్లికులం ప్రాప్తిస్తుందని సమర్థింప జూచారు. ఇది మనువు బీజానికి యిచ్చిన ప్రాధాన్యాన్ని బుద్ధి పూర్వకంగా విస్మరించడం వల్లనే జరిగింది. 'అనంతరు' డంటే ద్వితీయ ప్రాధాన్యం కలవాడని చెప్పుకోడంవల్లనే మానవ ధర్మ సూత్రాలకు సమగ్రత యేర్పడుతున్నదని గ్రహించాలి. మనువు ఉద్దేశించినది ప్రతివర్ణంలోనూ శ్రేష్ఠ తరతమ భేదాలు మాత్రమే.

రెండవది విలోమసాంకర్యం. ఇందులో ఉత్తమ క్షేత్రాలు హీనబీజాలతో యేర్పరచుకున్న సంబంధాల పరిణామాలు వివరించబడ్డాయి. ఆర్యులకివి దుస్సహమైన సంఘటనలుగా తోచాయి. ఆర్యవనితలు అనార్యుల భార్యలయే అవకాశం విలోమంలోనే కలుగుతున్నది. విరాటపర్వంలో కీచకుని జన్మ వృత్తాంతం ఉన్నది. క్షత్రియునకు బ్రాహ్మణస్త్రీ వలన కలిగిన సంతానం సూతులనీ,[11] కీచకుడట్టి సూతుడైన క్షత్రియుడనీ వివరింపబడింది. ఇక్కడ సూతులస్థానం క్షత్రియులకూ వైశ్యులకు మధ్యగా నిశ్చయించడం జరిగింది.[12] సూతుడు విలోమ సాంకర్యఫలంగా జనిస్తున్నాడు. ఐనప్పటికి అతడు అగ్రకులజుడుగానే గుర్తించబడ్డాడు. బ్రహ్మక్షత్రియుల మధ్య వేదకాలానికి పూర్వం జాతిభేదమేలేదని దీనిని బట్టి గ్రహించవచ్చు. భారత కాలానికి బ్రాహ్మణులలో తాము క్షత్రియులకంటె అధికులమనే భావం రూపు నేర్పరచుకున్నది. సూతునకు రథచోదకత్వమూ అశ్వరక్షణమూ వృత్తులుగా నిర్ణయింపబడ్డాయి.[13] బ్రహ్మక్షత్రియుల విలోమ సాంకర్యం నామమాత్రమే గనుక అది ఆర్యులకు అంగీకార యోగ్యమైంది. శుక్రుని కూతురు, క్షత్రియుడైన యయాతిని వివాహ మాడింది. శుక్రుడు అందుకు అనుమతించ గలిగాడు. విరటుని రాణి సుధేష్ణ సూతపుత్రి. ఆమె సంతానానికి క్షత్రియత్వం లోపించనే లేదు.

బ్రాహ్మణి శూద్రుని భార్య కావడం ఆర్యుల కత్యంత దుస్సహమైన విలోమ సంబంధం. ఇందువలన కలిగిన సంతానం చండాలుడనీ, మనుష్యు లందరిలోకీ హీనుడనీ చెప్పబడింది.[14] ఇక్కడ తొందరపాటుతో చండాలుడు పంచముడని నిర్ణయించడం అశాస్త్రీయం. శూద్రులలో చండాలు నిదిక నిష్ఠవర్గమని మాత్రమే గ్రహించాలి. పతంజలి వ్యాకరణ వ్యాఖ్యలలో చండాలుడు శూద్రుడనే చెప్పబడింది.[15] మనువుచెప్పిన బీజ, క్షేత్ర వివరణల ననుసరించికూడా యిదే నిర్ణయానికి రాగలము. శూద్ర బీజంవలన జనించిన చండాలుడు శూద్రుడే. చండాలశబ్దం అతని వృత్తిని మాత్రమే తెలియజేస్తుంది. ఆర్యులకు తమ స్త్రీ అనార్యుల పరం కావడంఉన్న అనిష్టత చండాలుణ్ణి హీనుడని చెప్పడంలో వ్యక్తమౌతున్నది.

---

10. I bid; X. 47. p. 413.

11. I bid, X, 11 & 17, pp. 403-405.

12. రథకార మితీమంహి క్రియాయుక్తం ద్విజన్మనాం|
క్షత్రియా దవరం వైశ్యా ద్విశిష్ట మితి చక్షతే॥ విరాటపర్వం 16.

13. See footnote 10 above.

14. Op. cit, X, 16, p. 405.

15. G. S. Ghurye, class, caste and accupation, Bombay 1961. ch 9, p. 218.

ఆర్యస్వామ్యాన్నీ వర్ణవ్యవస్థనూ తిరస్కరించి ఉత్తర హిందూదేశంనుంచి తూర్పు దక్షిణాలకు పయనించిన స్వాతంత్ర్య ప్రియులైన అనార్యులు సహితము వర్ణవ్యవస్థమీద మోజు పడ్డారు. వృత్తి భేదం కుల విభజనను సుకరం చేసింది. ఈ విధంగా రాజకీయమైన స్వామ్యం లేకపోయినప్పటికి ఆర్యులకు ప్రగ్దక్షిణ దేశాలపై సాంస్కృతిక నాయకత్వం లభించింది.

అనార్యులు ముఖ్యంగా ద్రవిడులు దక్షిణాపథానికి చేరుకునే నాటికి అక్కడ కాలవర్ణులైన ఆదివాసులు నివసిస్తూ ఉండేవారు. వారి పరిణామం తామ్రయుత శిలాయుగ పరిధులను నాటికి అధిగమించినట్లు తోచదు. కృషీవలులైన ద్రవిడులు వారిని సమూలంగా నిర్మూలించడానికి ప్రయత్నించ లేకపోయారు. ఆర్యుల ననుకరించి తా మేర్పరచుకున్న కుల వ్యవస్థలో వారికి సముచితమైన స్థానం యివ్వడానికి వారికి మనసొప్పలేదు. తామే కృషీవలులు గనక ఆ వృత్తిని ఆదివాసులకు ప్రత్యేకించడం వారికి అసాధ్యంగా తోచింది. ద్రవిడుల బభ్రువర్ణంతో ఆర్యులు సరిపెట్టుకోగలిగారు గాని ఆదివాసుల కాల వర్ణం మాత్రం ద్రవిడులకు దుస్సహమైంది. ఆదివాసుల జీవన సరళితో, నాగరికులుగా పరిణతి చెందిన ఆర్యులకు నచ్చిన విశేష మేదీ లేకపోయింది. అందువలన తమ జనపదాలను దూరంగా సంఘ బాహ్యులుగా వారిని బహిష్కరిస్తూ వచ్చారు.

ఇలా బహిష్కరింపబడిన వారిలో స్థూలంగా రెండు తెగలు యేర్పడతాయి అనార్య సంపర్కం కోసం ఎదురుచూడక దట్టమైన వన్య ప్రాంతాలలో, పర్వత సానువులలో నివాసం యేర్పరచుకుంటూ వచ్చినవారు. వీరు తరువాత కాలాలలో ఆటవికులు, గిరిజనులు అయ్యారు. అనార్యజనపదాలను ఆశ్రయించి వారి నిష్ఠురద్వేషాన్ని సహించి వారితోబాటు జీవనం గడపడానికి నిశ్చయించుకున్నవారు, వీరే హిందూ కుల వ్యవస్థలో తొలి పంచములు. వృత్తి మూలకమైన నాలుగు కులాలలోనూ స్థానం లభించకపోయినప్పటికి, వారి జనపదాల ప్రాంగణాలలోనే నివాసాలు యేర్పరచుకుని, నివసించడంవలన వీరు పంచములు అయ్యారు.

నాగరికతలు వృద్ధి చెందుతున్న కొద్దీ ఉత్తర దక్షిణదేశాల మధ్య సాంస్కృతిక సంబంధాలు పెంపొందసాగాయి. దక్షిణదేశ విద్వాంసులు ఉత్తరాది బ్రాహ్మణుల వద్ద సంస్కృతభాషా, యితర శాస్త్రాలూ అభ్యసిస్తూ వచ్చారు. రానురాను సంస్కృతభాషా పరిచయం కలవారు మాత్రమే విద్యావంతులుగా పరిగణింప బడటమూ మొదలైంది. దక్షిణ దేశంలో ప్రభవించిన పంచవర్ణాల యేర్పాటు ఆర్యావర్తానికీ వ్యాపించింది. దక్షిణదేశంలో పంచమవర్ణం జాతిభేదం వల్లనే యేర్పడింది కాని ఉత్తరదేశంలో పంచమ వర్ణం జాతిభేదం ప్రాతిపదిక కలదికాదు. ఉత్తరాది బ్రాహ్మణుల కత్యంత దుస్సహమనిపించిన విలోమ సాంకర్య సంతానంలో ముఖ్యంగా చండాలురు, పంచములు కావలసి వచ్చింది. తమ వర్ణవ్యవస్థ దైవదత్తమూ అందువలన అతి పవిత్రమూ అని నమ్మిన అగ్రవర్ణాలవారు దక్షిణాది పంచమ కులవ్యవస్థను దేశాని కంతటికీ వ్యాపింపజేశారు.

పంచమవర్ణ మేవిధంగా వర్ణసాంకర్యంవల్ల ఉత్పన్నమౌతున్నదో ధర్మశాస్త్రజ్ఞులు నిర్దేశించడం ఆరంభించారు. ముఖ్యంగా ఉత్తర భారతంలో అగ్రవర్ణాలవారి శృతిమించిన పవిత్రతా భావలోభమే పంచమవర్ణ సాంప్రదాయానికి స్థిరత్వాన్ని ప్రసాదించింది. నాటికే అమలులోఉన్న ధర్మశాస్త్ర గ్రంథాలలో కూడ ఈ వ్యవస్థను సమర్థిస్తూ కొత్త సూత్రాలు ప్రక్షేపించ బడ్డాయి. పంచమవర్ణమే లేదనే మనుసూత్రాన్ని ప్రమాణంగా తీసుకున్నప్పుడు ఈ ప్రక్షిప్త సూత్రాలను తేలికగా గుర్తించగలము.

విద్యావ్యాసంగమూ, దేవతారాధనా వృత్తులుగా స్వీకరించిన బ్రాహ్మణకులంలో తమ పవిత్రతను కాపాడుకోవాలనే కాంక్ష మితిమీరి, చివరకు సాంఘిక పురోగమన నిరోధక శక్తిగా పరిణమించింది. వేద కాలం నాటికి సాంఘికవ్యవస్థపై ఎదురులేని నాయకత్వం వహించిన బ్రాహ్మణవర్గం, తరువాతి కాలా

వర్ణ వ్యవస్థలో పుట్టుకతో వృత్తి నిర్ణయింప బడుతున్నది. పారంపర్యమైన వృత్తులవలన నైపుణ్యం సులువుగా సాధింపబడుతుంది. ఈ నాటికీ క్రాఫ్టు స్కూళ్లలో నేర్చినవారికంటె కొన్ని వృత్తులలో, జన్మతః ఆ వృత్తిలో ఉన్నవారు కౌశల్యాన్ని కలిగి ఉండటం మనం ఎరిగున్న విషయమే. జీవనోపాధికి అవసరమైన వృత్తిని ప్రతి పౌరుడూ పొందగలిగాడు. పారంపర్యమైన వృత్తులవలన ప్రాచీన సాంఘిక వ్యవస్థకు లాభమే కలిగిందని ఒప్పుకోక తప్పదు.

ఈ వృత్తులలోని ఎక్కువ తక్కువలు నాటి సాంఘిక భావాల ననుసరించి కృతకంగా యేర్పడ తాయి. ఈనాడు ఫిషరీస్ టెక్నాలజీలోను, లెదర్ టెక్నాలజీలోను అగ్రవర్ణాలవారు కూడా నిరాపేక్ష ణగా చేరడాన్నిబట్టి, ఈ విషయం సులభంగా గ్రహించ వచ్చు.

సింధు నాగరికతకు పూర్వమే జనపదాలైన అమ్రి, కోట్‌దీజీ, కాలిబంగా మొదలైన తావుల్లో కనిపించని నగర నిర్మాణ కౌశల్యం, సింధు నాగరిక తలో క్రీ. పూ. 2000 నాటికే పరిణతి చెందటాన్ని బట్టి ఇది వర్ణ వ్యవస్థవలన సాధింపబడినదేమోనని అనుమానం కలుగుతుంది. శ్రీ యమ్. వి. యన్. కృష్ణారావు, శ్రీ యస్. ఆర్. రావు ప్రభృతులు, ఇటీవలన సింధు ముద్రికలపై గల చిత్ర లిపి గీర్వాణ భాషా పదాలను సూచిస్తున్నదని అభిప్రాయ పడు తున్నారు. ఈ వాదం సింధు నాగరికత వర్ణ మూలక మనే భావానికి అనుకూలమే కదా!

వేదకాలానికి పూర్వం ఆర్యులు సృష్టించిన జాతి భేద మూలకమైన వర్ణ వ్యవస్థ మహా భారత కాలానికి వృత్తి మూలకంగా మారింది. అన్య దేశీయులకు, వారి వృత్తుల ననుసరించి వర్ణ వ్యవస్థలో ఉచిత స్థానాలు కల్పింప బడుతూ ఉండేవి. భగవద్గీతలో వర్ణవ్యవస్థ వృత్తులను పురస్కరించుకుని చేసిన విభజనగా చెప్పబడింది.[16] వృత్తినిబట్టి మానవుని స్వభావం యే విధంగా స్థిర పడుతుందో వ్యాఖ్యానకారులు విపులీకరిస్తారు. ఇక్కడ జననమూ, వృత్తి, వీరి వివరణలో కొంతతారుమారు కావడం అనూహ్యం కాదు. ఉదాహరణకు, తమస్సుతో కూడిన రజోగుణ ప్రధానుడైన వైశ్యుడు సేద్య వాణిజ్యములూ, పశుపోషణా వృత్తులుగా గ్రహించ డానికి యోగ్యుడని చెప్పబడుతున్నది[17]. సత్వరజస్తమో గుణాల విచారణ అటుంచి, పారంపర్యమైన వృత్తి మానవ స్వభావాన్ని చాలవరకు తీర్చి దిద్దగలదని గ్రహించాలి.

అనార్యవర్ణాల సహకారంతో వర్ణవ్యవస్థకు అంకురార్పణ చేసిన ఆర్యులు, ఆర్యావర్తంలో స్థిర పడడానికివచ్చిన విజాతీయులందరికి తమ సాంఘిక వ్యవస్థలో యోగ్యమైన స్థానాలను కల్పిస్తూ వచ్చారు. వర్ణవ్యవస్థలేని మానవ సంఘ సభ్యులకు ఆర్యులు తూష్ణీంభావంతో దస్యులని పేరుపెట్టారు.[18]

పశ్చిమ భారతంలో జనించి భారత కాలానికి పూర్వమే ఆర్యావర్తానికి పయనించిన వర్ణవ్యవస్థ క్రమంగా ప్రాగ్దక్షిణ దిశలకు పురోగమించింది. ఈ ప్రాంతాలలో నివసించే అనార్య సంఘాలు వర్ణవ్యవస్థ యొక్క ప్రయోజనాలను గుర్తించి, వృత్తుల ననుస రించిన కులవిభజనకు పూనుకున్నారు. ఇందువలన ఇక్కడి అగ్రవర్ణాలవారు సహితము చాలవరకు అనార్య సంతానమే అయ్యారు. ఇందువలననే ఒక కులం వారందరూ ఒక జాతివారుగా గోచరించక పోవడం సంభవిస్తున్నది. మహాభారత కాలానికి హిందూ దేశమంతటా వర్ణవిభజనకల దేశాలవారు నాగరికులుగా పరిగణింపబడ్డారు.

---

16. 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం
గుణకర్మ విభాగశః
తస్య కర్తార మపి మాం విద్ధ్య
కర్తార మవ్యయం' భగవద్గీత 4, 13శ్లో.

17. భగవద్గీత 18. P. 44.

18. op. cit. X, 45, p. 413

లలో జీవనోపాధికి పలువృత్తులు స్వీకరించడం ఆరంభించారు. ద్రోణుడు అహిక్షేత్రం రాజధానిగా ఉత్తర పాంచాల ప్రభుత్వాన్ని చేపట్టడం ఈపత నారంభాన్ని సూచిస్తుంది. సాంఘిక నాయకత్వాన్ని హస్తగతం చేసుకోడానికి ప్రయత్నిస్తూ వచ్చారు. పవిత్రతకే ప్రాధాన్యంయిచ్చిన బ్రాహ్మణ్యం తమ సమాజంతో సంబంధాలను మరింతగా తెంచుకుని భౌతిక పురోగతి నిరుపయోగమని భావించి ఆధ్యాత్మిక సాధనలోనే జీవిత పరమార్థం సంపాదించుకోడానికి ప్రయత్నించారు. ప్రాచీన హైందవ శాస్త్రగ్రంథా లన్నిటిలోనూ వస్తుధర్మ పరిశీలనకంటె భావనా విశ్లేషణానికి ప్రాధాన్యం యిందువల్లనే కలిగిందనుకోవాలి.

ఈనాటికీ రంగుభేదం మానవ చరిత్రలో అభివృద్ధి నిరోధక శక్తిగా పరిణమిస్తూనే ఉంది. మానవ సమైక్యతాభావం అభివృద్ధి చెందిన దేశాలలో కూడ అందాని ఆదర్శంగానే భాసిస్తున్నది. ప్రపంచ మంతటా శ్వేతవర్ణులు రాజకీయ, ఆర్థిక, సాంఘిక తలాల్లో ప్రముఖ స్థానాలను నిర్వహిస్తూ తమ విశిష్టతే అందుకు కారణమని నమ్మగలుగుతున్నారు. ఈ పరిస్థితుల పోల్చి చూచినప్పుడు రమారమి నాలుగువేల యేండ్లకు పూర్వంనాటి అభ్యుదయ శక్తుల సంకల్ప ఫలంగానే వర్ణ వ్యవస్థకు అంకురార్పణ జరిగిందని గ్రహించవచ్చు. నాటి వర్ణవ్యవస్థ సహజీవనం కోసం యేర్పడింది. ఈనాడు అదే వ్యవస్థ భేద భావాలను ప్రోది చేస్తున్నది. నాడు విద్యావంతుల నాయకత్వంలో వర్ణవ్యవస్థ జనించింది. తిరిగి విద్యావంతులు సాంఘిక నాయకులు కాగలిగిననాడు మాత్రమే నిరుపయోగమూ, అభివృద్ధి నిరోధకమూ ఐన ఈ వ్యవస్థను తుదముట్టించగలము.

[శ్రీయుతులు డా. ఆర్. సుబ్రహ్మణ్యం, డా. కె. కృష్ణమూర్తిగార్లతో పరిచయం ఈ వ్యాస రచనకు తోడ్పడింది. నా అభిప్రాయాలతో పూర్తిగా ఏకీభవించలేకపోయినప్పటికి, నన్ను ఔదార్యంతో ప్రోత్సహించిన వారిద్దరికీ నా కృతజ్ఞతలు.]

---



# బ్రౌన్ సేకరించిన సుమతి శతకము: దాని ఆంగ్లానువాదము

## శ్రీ డి. రామలింగం

'ఆంధ్ర గ్రంథములను సేకరించి రక్షించిన భాగ్య వ్రారంభమునందు బ్రౌనుగారికి గలిగినది. ఆ నిష్కామ భాషాభిమాని ఆంధ్రులకు బూజాపాత్రుడు' అని దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిచే (ఆంధ్రపత్రిక ముద్రాలయమువారు 1929 లో ప్రకటించిన ముద్రితాముద్రిత గ్రంథ సూచికకు వారు వ్రాసిన పీఠికలో) కొనియాడబడిన బ్రౌన్‌దొర తెలుగుభాషలో అనన్య ప్రచారంగల సుమతి శతకమును ఆంగ్లములోకి అనువదించినట్లూ, దాని లిఖిత ప్రతి ఒక్కటి మాత్రమే చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో వున్నట్లూ మొదట కనుగొన్నవారు శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారు. వీరు ప్రస్తుతం కేంద్ర సాహిత్య అకాడమీ దక్షిణ మండల కార్యాలయ కార్యదర్శిగా వున్నారు.

ఆంధ్రభాషా సాహిత్యాలకు అమూల్యమైన సేవ చేసిన చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ (సి. పి. బ్రౌన్‌గా ఈయన సుప్రసిద్ధుడు) సుమతి వేమన శతకములు రెండింటినీ ఆంగ్లములోనికి అనువదించాడు. ఆయన చేసిన వేమన శతక ఆంగ్లానువాదం 1824 లో ప్రచురితమైంది. కాని సుమతి శతక ఆంగ్లానువాదం ప్రచురింపబడకుండా వుండటమేగాక, ఇంతవరకు అది పండితుల దృష్టికి కూడా రాకుండా వుండిపోయింది. ఇది శర్మగారికి ఆశ్చర్యం కలిగించింది. దీనికి కారణం ఏమై వుంటుందీ అని ఆలోచిస్తే మద్రాసులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలోవున్న తెలుగు వ్రాత ప్రతుల వివరణాత్మక పట్టికలో సుమతి శతకముయొక్క ఇతర లిఖిత ప్రతుల వివరణ మున్నదిగాని, బ్రౌన్ ఆంగ్లానువాదం పేర్కొనబడలేదు బహుశా ఈ కారణంవల్లనే అది మరుగున పడిపోయి వుంటుందని శర్మగారు భావించారు. వారీ ఆంగ్లానువాదం సంగతిని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్ష, కార్యదర్శులైన శ్రీయుతులు బెజవాడ గోపాలరెడ్డిగారికీ, దేవులపల్లి రామానుజ రావుగారి కీ తెలుపగా వారు దాని ప్రతిని సేకరించి ఎడిట్ చేయవలసిందిగా శర్మగారిని కోరారు. అట్లేవారు దానిని స్వయంగా కాపీ చేసి ఒక క్రమంలో పెట్టి అకాడమీవారికి అందజేయగా వారు దానిని ప్రప్రథమంగా 1973 జనవరిలో చక్కగా ప్రచురించి ఆంధ్రుల కొక అమూల్యమైన చిన్న పుస్తకమును అందించారు. పుస్తకం చిన్నదేగాని ఆంధ్ర భాషకు గర్వకారణమైనది.

బ్రౌన్ తన ఆంగ్లానువాదమును(సుమతి శతకం) 1832 జూలై 30 తేదీన ఆరంభించాడనీ, అది కాగితపు లిఖిత ప్రతి నెంబరు డి. 3090 లో వున్నదనీ శర్మగారు తెలిపారు. ఎడమవైపు తెలుగు పద్యము, కుడివైపు దాని ఆంగ్లానువాదము బ్రౌన్‌దొర స్వహస్తముతో వ్రాసి వున్నట్లు చూచారు. తెలుగు మాత్రం ఎవరో లేఖకుడు వ్రాసినట్లున్నది. బహుశా వీరు తిప్పభొట్ల వెంకట శివశాస్త్రి (మచిలీపట్నం, అద్వైత బ్రహ్మయ్య బ్రౌన్‌దొర అసిస్టెంట్ జడ్జీగా పనిచేసిన ఒక కోర్టులో ఈయన పండితుడుగా

వుండేవాడు) అయివుంటారు. బహుశా ఈ పండితులే ఆంగ్లానువాద కార్యంలో తెలుగు అర్థాల వివరణలో బ్రౌన్‌కు సహాయపడి వుంటారు. వేమన పద్యాలను బ్రౌన్ ఎడిట్ చేసినప్పుడు ఈ ఇద్దరు పండితులు తనకు సహాయం చేసినట్లు బ్రౌన్ తన Preface to verses of Vemana లో పేర్కొన్నాడు. ఆ రోజుల్లో Brown College అని వ్యవహరించేవారు. ఆయనకు పండితుల దర్బారు వుండేది. దాదాపు 15 మంది పండితులు ఆయనకు సహాయకులుగా వుండేవారు. బ్రౌన్ అనేక పాఠములుగల ప్రతులను సేకరించి వాటిని పోల్చిచూసి చెప్పండని వారికిచ్చేవారు. తన పాఠాన్ని తుదిసారిగా నిర్ధారణ చేసేటప్పుడు పండితులకు తక్కిన పాఠములన్నీ చూపించి చివరి ప్రతిని తయారు చేసేవారు. బ్రౌన్ తన ప్రతిపుస్తకానికి చిన్ననోట్ (వివరణ) ఇచ్చేవాడు. కాని సుమతి శతకానికిమాత్రం ఏమీ వ్రాయలేదు. కారణం తెలియదు.

సుమతి శతకం బ్రౌన్ వ్రాతప్రతిలో 150 పద్యాలున్నాయి. అంటే ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలోవున్న పదివ్రాత ప్రతులలోగల పద్యాల సంఖ్యకన్న ఎక్కువ పద్యాలు బ్రౌన్ ప్రతిలో వున్నాయన్నమాట. ఇప్పుడు ప్రాచుర్యంలోవున్న సుమతి శతకంలో 110 పద్యాలు మాత్రమే వున్నాయి. సికింద్రాబాదు వాస్తవ్యులు శ్రీ పి. కృష్ణమూర్తిగారు ఆంగ్లములోని కనువదించి ప్రకటించిన శతకంలో 108 పద్యాలున్నాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు నిడదవోలు వేంకటరావుగారి సంపాదకత్వాన ప్రచురించిన ప్రతిలో 110 పద్యాలున్నాయి.

సుమతి శతకం రచింపబడిన కాలమునుగూర్చి, దాని కర్తృత్వమునుగూర్చి శర్మగారు తాము వ్రాసిన తొలి పలుకులో కొంత చర్చ చేశారు. ఆ చర్చలో దీని రచనా కాలం కర్తృత్వం ఇంకా సరిగా తేలలేదనే చెప్పారు. కారణం రెండు విభిన్నాభిప్రాయాలను సమర్థించే వాదానికి ఆధారాలున్నాయి. 12 వ శతాబ్ది—15 వ శతాబ్ది మధ్య కాలంలో ఎప్పుడో విరచితమై వుంటుందనీ, చాలామంది పండితుల అభిప్రాయం ప్రకారం 13 వ శతాబ్ది మధ్య ప్రాంతంలో రచింపబడి వుంటుందనీ అన్నారు. మొదటిసారిగా దీని ముద్రణ 1868 లో జరిగివుంటుందా అని ప్రశ్నార్థకంగా ప్రస్తావించారు. ఇక కర్తృత్వం విషయంలో కూడా విభిన్నాభిప్రాయములను పేర్కొన్నారే గాని ఇదమిత్థమని తేల్చలేదు. మానవల్లి రామకృష్ణ కవి సుమతి శతకమును నన్నెచోడుని వంశమునకు చెందిన బద్దెన (బద్దె నరేంద్రుడు లేక భద్రభూపాలుడు) వ్రాసి వుంటాడని చెప్పారు. వి. వెంకటరాయశాస్త్రిగారు ఈ నిర్ణయమును సమర్థించడమే గాక, నన్నెచోడుడు బద్దెన సమకాలికులనీ, ఒకరి తరువాత ఒకరు రాజ్యపాలన చేశారనీ అన్నారు. కాని కూచిమంచి తిమ్మకవి ఈ శతకమును భీమకవి వ్రాసి వుంటాడని అన్నాడు. శర్మగారు ఈ రెండింటిలో దేనినీ సమర్థించక సుమతి శతకం కర్త బహుశా ఒక జైన కవియై వుంటాడని చెబుతూ తమ అభిప్రాయమునకు సమర్థనగా సుమతి శతకం ముద్రిత ప్రతులలో మొదట 'శ్రీరాముని దయచేతను' అను పద్యం కనుపిస్తుందనీ, అయితే ఈ పద్యం బ్రౌన్ వ్రాతప్రతిలో కాని, చెన్నపురి లిఖిత పుస్తక భాండాగారంలో లభించే ఇతర లిఖిత ప్రతులలో గాని లేదన్నారు. బ్రౌన్ ప్రతి, తంజావూరు సరస్వతి మహల్ లైబ్రరీలో గల వ్రాత ప్రతి నెం. డి–420 'స్త్రీల యెడ వాదులాడకు' అన్న పద్యంతో ఆరంభింపబడి వున్నదనీ, ఇది గమనార్హమైన విషయమనీ శర్మగారు అన్నారు. అంతేగాక సుమతి శతకకారుడు తన ఉపమానములను చాలావరకు నిత్యజీవితంలోనుంచే గ్రహించాడనీ, శైవ వైష్ణవ మతముల పురాణ గాథలనుండి సేకరించలేదనీ చెబుతూ, ఇది జైనమత కవుల ప్రత్యేకతగా కనిపిస్తుందనీ అన్నారు. ఏమైనా కాలం, కర్తృత్వం విషయంలో మరికొంత లోతైన పరిశోధన అవసర మనిపిస్తున్నది.

సుమతిశతకం తమిళనాడులోకూడా ప్రాచుర్యం పొందినదని చెబుతూ శర్మగారు కొన్ని వివరాలిచ్చారు. తమిళ అనువాదంలో 110 పద్యాలున్నాయి. తమిళం

లోకి అనువదించిన వారు ఏజమూరు సమరపురి మొదలియార్. ఈ అనువాదం 1904 లో ప్రచురితమైంది. దీని ప్రతిని శర్మగారు మద్రాసు జార్జిటౌన్‌లోని మర్రైమలై అడిహళ్ లైబ్రరీలో చూచారు. ఇదికూడా ఒక డిస్కవరీయే అని చెప్పాలి. ఈ అనువాదం 'శ్రీరాముని దయచేతను' అనే పద్యంతో ఆరంభమై 'ఇన కలిమి ఇంద్రభోగము' అన్న పద్యంతో ముగిసింది. అనువాదకులు తెలుగు పద్యాన్ని తమిళ లిపితోఇచ్చి, ప్రతిపదార్థము, తాత్పర్య సంగ్రహము పద్యంలోని ముఖ్య భావము ఇచ్చారు. నిజం చెప్పాలంటే సుమతి శతకాన్ని పాఠకులకు ఈ విధంగా పరిచయం చేయడం ప్రయాసతో కూడిన పని. కాని ఈ పద్ధతి పరిశోధకులకు చాలా ఉపయోగకర మైనది. ఈ తమిళ అనువాదం అపురూపమైన పుస్తకం. ఇప్పుడిది అచ్చు కావడం లేదు.

ఇక బ్రౌన్ అనువాదాన్ని సవివరంగా పరిశీలిద్దాము. ఆయన దీనికి పెట్టిన పేరు 'సుమతి శతకము సవ్యాఖ్య' శ్రీరామ సహాయం, శుభమస్తు, అవిఘ్నమస్తు వంటి సాంప్రదాయికమైన ప్రసక్తు లున్నాయి. బ్రౌన్ 85 పద్యాలకు మాత్రమే ఆంగ్లాను వాదం ఇచ్చాడు. ఇంగ్లీషు అనువాదం లేకపోయినా బ్రౌన్ ప్రతిలోవున్న పద్యాలను (86 నుంచి 150 వరకు) శర్మగారు ఈ సంపుటిలో చేర్చారు. బ్రౌన్ ప్రతి 'స్త్రీలయెడ వాదులాడకుము' అన్నపద్యంతో ఆరంభమై 'తావుగల వానికెంటెను' అనే పద్యంతో సమాప్తమైంది. దీనిని ఎడిట్ చేసేటప్పుడు శర్మగారు బ్రౌన్ పాఠాలను మార్చలేదు. వాటిని యథా తథంగా ఇచ్చారు. కాకపోతే ప్రస్తుత ముద్రణ లలో కానవచ్చు పాఠాలను అధోజ్ఞాపికలో (Foot Notes) ఇచ్చారు. ఇలా శర్మగారు ఎత్తిచూపిన వాటిలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారి సంపాదకత్వాన ప్రకటించిన శతక సంపుటము (ప్రథమ భాగము)లోనుంచి, మదరాసు విక్టోరియా డిపో వారు 1922 లో శ్రీ రెంటాల వేంకట సుబ్బారావుగారి సంపాదకత్వాన ప్రచురించిన శతక రత్నావళినుంచీ, సుమతి శతకము తమిళ సేతనుంచీ స్వీకరించిన పాఠాంతరా లున్నాయి. అక్కడక్కడా వావిళ్లవారి ప్రతిని కూడా సంప్రదించారు. బ్రౌన్ ప్రతిలో పద్యాలు అకారాదిక్రమంలో లేవు. అకారాదిక్రమంలో వుంటే బాగుంటుందన్న ఉద్దేశంతో రాధాకృష్ణ శర్మగారు పద్యాల వరుస క్రమాన్ని మార్చి అకారాదిక్రమంలో పెట్టారు ఇదొక్కటే శర్మగారు చేసిన మార్పు.

బ్రౌన్ అనువాదం మరీ ముక్కికి ముక్కగా (లిటరల్‌గా) వుంటుందని కొందరు విమర్శకు లంటారు. కాని శ్రీ శర్మగారు ఈ పద్ధతి ఒక విధంగా మంచిదని ఇట్లా చెప్పారు: సాధారణంగా బ్రౌన్ ఏ అనువాదం చేసినా లిటరల్‌గానే చేశాడు. ఎందుచేతనంటే ఆయన ఆ అనువాదాన్ని తెలుగు రానివారికోసం చేశాడు. ఆంధ్రేతరుల కొరకు దీనివల్ల పద్యంలోని పాఠం ఇతరులకు బాగా అర్థమవుతుంది. 'నిజంగా ఆయన అనువాదం నన్ను ఆకర్షించింది. 'తెలుగు పద్యంలో వున్న స్వచ్ఛ నిసర్గభావాన్ని దానిలోని సొగసును, ఒక్క మాటలో చెప్పాలంటే 'ఆత్మ'ను బ్రౌన్ తన అనువాదంలోకి తెచ్చాడు.

బ్రౌన్ ఆంగ్లీకరించని పద్యాలను కూడా శర్మగారు అకారాది క్రమంలోనే ఇచ్చారు. అంతే గాక నీతిశాస్త్ర ముక్తావళిలోని పద్యాలకూ సుమతి శతకంలోని పద్యాలకూ పోలికలున్నచోట ఆ భాగాలను ఉదాహరించి పరిశోధన చేయదలచు కున్న విద్యార్థులకు తులనాత్మక పరిశీలనానికి వీలు కలిగించారు. ఉదాహరణకు—బ్రౌన్ పాఠం ఈ దిగువ విధంగా వుంది. (53 పేజి).

వరి పంటలేని యూరుం
దొర చూడని కొలువు, తోడు దొరకని తెరువున్
స్థిరమతి సతిలేని గృహం
బరయుంగా రుద్రభూమి యౌరా సుమతీ!

వరిపంటలేని పురమును
దొరచూడని కొలువు ,తోడు దొరకని తెరువున్

సిరికాంతలేని గృహమును
వెరవొప్పగ రుద్రభూమి వినరా సుమతీ

(సం. 1810 మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారపు ప్రతి.)

వరిపంటలేని యూరును
దొరయుండని యూరు తోడు దొరకవి తెరువున్
ధరను బతిలేని గృహమును
నరయంగా రుద్రభూమి యనదగు సుమతీ
(ఆం. ప్ర.)

ఈ మూడింటినీ చూచినప్పుడు ఏది మంచి పాఠాంతరమో పరిశీలకులు తెలుసుకోవచ్చు.

ఇక బ్రౌన్ ఆంగ్లానువాదాలను కొన్నిటిని ఉదాహరించి అవి ఎంత సూటిగా, నిరాడంబరంగా, సక్రమంగా, స్పష్టంగా వున్నాయో ప్రస్తావించి ఈ వ్యాసాన్ని ఇంతటితో ముగిస్తాము.

'కొరగాని కొడుకు పుట్టిన' అన్న పద్యానికి ఆంగ్లానువాద మిట్లా వుంది.

If a worthless Son be born, his worthlessness is not all; he ruins his father's excellence too, as an ear springing on a flowering sugar cane destroys all the sweetness of the cane.

'అల్లుని మంచితనంబును' అన్న పద్యానికి ఇంగ్లీషు అనువాద మిది :

A Son-in-law's good manners, a boor's skill in classics, shopkeeper's Veiacity, rice ferfectly clear of chaff and white crows are things taht equally exist not.

'ఏరకుమీ కసిగాయలు' అనే పద్యానికి బ్రౌన్ ఎంత సింపుల్‌గా ఆంగ్లానువాద మిచ్చాడో పరికించండి:

Pluck not raw fruits Reproch not thy relations, for it would be a Sin indeed. Fly not in battle. Transgress not thy master's Command.

తెలుగులో అన్ని శతకాలకన్న సుమతి శతకం శైలిలో, సూక్తులనూ లోకరీతినీ చెప్పడంలో ఎంత విశిష్టంగా వుందో బ్రౌన్ ఆంగ్లానువాదాలు మౌలిక భావ ప్రకటనలో అంత సరళంగా, స్పష్టంగా, తేట తెల్లముగా విశదంగావుండి, ఆ శతకానికి తగిన భాషాంతర మనిపించుకునే విధంగా వున్నాయి. బ్రౌన్ ప్రతిలో ఎక్కడా వ్యర్థపదా లుండవు.

పుస్తకం చివరన శర్మగారు పద్యముల అకారాది పట్టికనూ (పుటలతో సహా), డి. 3090 వ్రాత ప్రతి (అంటే బ్రౌన్ ప్రతి)తో కాకపోయినా సుమతి శతకం ప్రస్తుత ముద్రణలలో కానవచ్చు పద్యములనూ, శతక కర్త ఏ విషయాన్ని గూర్చి ఏమి చెప్పింది తెలుసుకునేందుకు సౌలభ్యంకోసమూ, కొటేషన్సుగా ఉపయోగపడటానికి Subject Wise గా ఉపకరించే సుమతి శతకము నందలి విషయాదికమును పద్య సంఖ్యను పేర్కొంటూ అనుబంధాలుగా ఇచ్చి, పుస్తకానికి మంచి ఉపోద్ఘాతం వ్రాసి, ఎడిటింగ్ చక్కగా వున్నదని సాహితీవరులు మెచ్చుకునే విధంగా సిద్ధపరిచారు. పుస్తకం ముద్రణ బాగున్నది. సుమతి శతకంలో ఉన్న లోపమల్లా కులాల ప్రసక్తి, దూషణ మాత్రమేననీ, వాటి ప్రస్తావన లేకపోయినట్లయితే అది అన్ని కులాలకూ, అన్ని జాతులకూ పనికివచ్చే విశ్వమానవ గ్రంథమనీ, అందులో సార్వకాలిక సత్యములు వున్నాయనీ చల్లా రాధాకృష్ణ శర్మగారి అభిప్రాయం. ఏమైనా బ్రౌన్ సేకరించిన ప్రతినీ, దాని ఆంగ్లానువాదాన్నీ కనిపెట్టి దాన్ని ఒక క్రమంలో పెట్టి వెలుగులోనికి తెచ్చి శర్మగారు తెలుగు భాషకు గమనార్హమైన సేవ చేశారు. వారి భాషాసేవలో ఇదొక మైలురాయి.

# సౌందరనందము - ఒక పరిశీలనము

## శ్రీ మల్లంపల్లి శరభయ్య

అద్వైతం సుఖదుఃఖయోః, అనుగతం సర్వాస్వవస్థాసు యత్,
విశ్రామో హృదయస్య యత్ర, జరసా యస్మిన్ అహార్యో రసః,
కాలేన ఆవరణాత్యయాత్ పరిణతే యత్ ప్రేమ సారేస్థితం,
భద్రం తస్య సుమానుషస్య కథ మప్యేకంహి, తత్, ప్రార్థ్యతే॥

"ఏది—సుఖ దుఃఖాలలో ఏకరూపమై, బాల్య, యౌవనాది సర్వావస్థలలో అనుగతమై, హృదయానికి విశ్రాంతి భూమియై, ఉంటుందో! దేని మాధుర్యాన్ని వార్ధకం హరించలేదో! కాలం గడచి—ఆవరణలన్నీ విగళితమైన కొలదీ—ఏది మరింత పరిణామపేశల మవుతుందో! దుఃఖ బహుళమైన యీ జీవలోకంలో ఏది సుదుర్లభమో! తాదృశ దాంపత్య ధర్మానికి భద్రమగును గాక!'

ఎంత ప్రశాంత మధురమైన కలగన్నాడు మహాకవి భవభూతి! అంత మధురమైనది స్వప్నం కాక మరేమవుతుంది? అది స్వప్నమే అయితే—ఆ స్వప్నం ఒక స్థిర స్వరూపంలో నిబంధింపబడింది సౌందరనందంలో. ప్రథమ సంధ్యలలోని తరుణ రాగమూ, చరమ సంధ్యలలోని స్థిర ప్రశాంతీ, ఆ కావ్యం పూర్వ—అపర భాగాంలో అలముకొని—ఉన్నాయి. ఆధునిక ఆంధ్ర సారస్వత కాసారంలో చతురస్ర సుందరమై విరిసిన నవారవిందం సౌందరనందం! మొట్టమొదట దాని ఆకృతి సౌందర్యమే నన్నెంతో ప్రలోభపెట్టింది. అంతసుందరంగా అచ్చైన తెలుగు కావ్యం నేనంతకుముందు చూడలేదు. సౌందరనందం ప్రతిఒకటి మా యింటికి వచ్చింది. అప్పుడు నాకు పదేళ్లు. మేఘసందేశం చదువుతున్నాను. తగినంత ఆంధ్రకావ్య పరిచయమూ ఉంది. మా నాన్నగారి అనుగ్రహంవల్ల ఏ కావ్యంలోని సౌందర్యాన్నైనా అందుకోగల రసజ్ఞతావేశం అలవడింది. తిరుపతి వేంకట కవుల పద్యాలు కొన్ని వందలు కంఠస్థం. సౌందరనందం చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారికి అంకితం. ఆ కృతి సమర్పణ పద్యాలకు ఆంధ్ర సారస్వతంలోనే ఒక విశిష్టస్థానం ఉంది. సౌందరనందం నన్నా వయస్సులో సమ్మోహితుణ్ణి చేసింది. పూర్వ సర్గలు మరీను—యౌవనమంతా నిండి ఆ సమ్మోహం అల్లాగే ఉంది. ఈ మధ్య వయస్సులో కడపటి సర్గలలోని పరిణతి కొంతకొంత అనుభవంలోకి వస్తోంది. వార్ధకంలో అవి మరింత ప్రియతమ మవుతాయేమో అనిపిస్తోంది. నాతో ఆ కావ్యమూ పెరుగుతూ వస్తున్నట్లుంది. గొప్ప కావ్యాల లక్షణమే అది కాబోలు! ఇంత సర్వావస్థా మనోహరంగా ఉండటానికి ఏ రహస్యం ఆ కావ్య నిర్మాణంలో గర్భితమై ఉందో!

మొట్టమొదట ఆ కావ్యం చదివిన రోజుల్లో—అప్పటి నా కావ్య వ్యామోహాన్ని ఎలా చెప్పటం? నవవధూ సమాగమంవలె ఉండేది. అందులోని దాదాపు ప్రతి పద్యమూ నాకు కంఠస్థము కాదు—హృద

యన్నమే అయిపోయింది. ఎప్పటికీ మరపలేను. తెలుఁగు భాషలోని మేలిమంతా ఒక్కచోటికి తెచ్చి—ఆ మేలిమికి తమ హృదయ సౌకుమార్య మాధుర్యములు మేళవించి—ఆ కవులు ఆ కావ్యాన్ని నిర్మించారేమో!

'మేలేర్చి నందుండు పూలు కోసి యొసంగ
సరము లందముగ సుందరి రచించు'

నిక్కడా నీరసమైన మాట కనపడదు. ఆ సిందుదనమే వేరు. వాడిన ప్రతి మాటా బంగారాన్ని తూచినట్లుంది. ఎత్తుగడా, నిర్వహణమూ, దింపుగడా, మంచి ఫామేదాతవంతో హుందాగా ఉండి పద్యంబరువుగా ఉంది. పద్యంలోంచి హృదయమే స్పందిస్తున్నట్లు! ఎన్నిసార్లు చదివినా పాతబడక ప్రియాతిథి వలె మరింత హృదయంగమ మవుతోంది. ఆ రోజుల్లో సౌందరనందంలో నన్నాకర్షించిన ప్రథమ లక్షణాలివి. క్రమంగా భారతం దగ్గరకు వచ్చేసరికి తెలియటం మొదలుపెట్టింది. వీరి కవిత్వంలో భారత కవితా లక్షణం ఎంత లోతుగా ఇంకిందో! ఆ చిక్కదనమూ, ముక్తసరీ మరెక్కణ్ణుంచి వస్తాయి? పింగళి సూరన్న వీరికి అభిమానకవే అయినా వీరిశైలి అదికాదు. పారిజాతాపహరణ శైలిలోని సౌకుమార్యమూ, మనుచరిత్ర శైలిలోని దీప్తి మాధుర్యములూ, వీరిశైలిలో గోచరిస్తాయి. తంజావూరు కవుల తెలుగులోని బెళుకునకు సిగ్గుతేర్చినట్లుంటుంది వీరి తెలుగు. కాని ఆ కవులలో గోచరించే చమత్కార చాపలమూ, దేశవాళీతనమూ, లేవు. పద్యాన్ని సాగపెట్టి—మాధుర్యాన్ని పెంపొందించి కాంతిని సంతరించి—తమ శైలికి ఒక విలక్షణమైన నవత్వాన్ని సాధించారు సౌందరనంద కవులు.

సౌందరనందం శైలేవేరు. మాటలోంచి మాటా పద్యంలోంచి పద్యమూ—సర్గలోంచి సర్గా—మొలుచుకొని వచ్చినట్లుంటుంది. అరుదుగా వాడినా వాడినట్లే కనిపించని సంస్కృత సమాసాలూ, తెలుగు పలుకుబడీ, బెరసి—ఆ శైలికి ఒక నూత్న లావణ్యాన్ని తెచ్చాయి. పూర్వాంధ్ర కావ్యాలన్నీ ప్రధానంగా మూడు విధాలుగా గోచరిస్తాయి. ఏ పద్యానికి—ఆ పద్యమే ఆస్వాదించ తగినవి—వసుచరిత్ర వంటివి కొన్ని, ఏ ఘట్టానికి—ఆ ఘట్టంమీద బాగుండేవి. పింగళి సూరన్న కావ్యాల వంటివి కొన్ని, పద్యానికి—పద్యమూ, ఘట్టానికి—ఘట్టమూ, రెండూ తీర్చినట్లుండి సమగ్ర సుందరములై ఆస్వాదించ తగినవి — మనుచరిత్ర వంటివి కొన్నీను. ఈ మూడవ రకం చాలా విరళంగా ఉంటాయి. సౌందరనందం యీ కోవలోనికి వస్తుంది. సూత్రగ్రథితమైన ముక్తామణి పరంపర దేనికి—అదిగా మెరుస్తూనే మొత్తం హారసౌందర్యాన్ని మిరుమిట్లు గొలిపించినట్లు—సౌందరనందంలోని ప్రతి పద్యమూ కావ్య సౌందర్యాన్ని ఉద్దీపింప చేస్తున్నది.

ఇక—కావ్యనిర్మాణ శిల్పంలో పూర్వాంధ్ర కావ్యాలకీ—సౌందరనందానికీ—ఏమీ సంబంధం ఉన్నట్లు కనపడదు. వస్తు నిర్దేశంతో ఆ విధంగా కావ్యం మొదలు పెట్టటంలోనూ—ఆయా సర్గల ఉపక్రమ—ఉపసంహారాల్లో కథా శరీరాన్ని తెర తీసినట్లు క్రమక్రమంగా ఉన్మీలితం చేయటంలోనూ—ఏ సర్గకు ఆ సర్గే ఒక కావ్య మన్నట్లు సూచ్యార్థ సూచనపరమైన ఆ సర్గాది పద్యంతో మలచటంలోనూ—సమగ్రాకృతి నిర్మాణంలో ఆ సర్గయొక్క సముచిత సంస్థాన విశేషాన్ని నిష్కర్ష చేయటంలోనూ—కావ్యం మొదట ప్రతిజ్ఞాతమైన అంశాన్ని చివరకు నిర్వహించటంలోనూ—వీరు ప్రదర్శించిన కావ్య శిల్పజ్ఞతకు మార్గదర్శి కాళిదాసు.

పూర్వాంధ్ర కావ్యాల్లో ఉండే అవతారికా, షష్ఠ్యంతాలూ, ఆశ్వాసాద్యంత పద్యాలూ, ఇందులో లేవు. మనోఽవస్థా చిత్రణం తప్ప—వర్ణనలు లేవు. కావ్యం—మొత్తంమీద ఆఖ్యానశైలిలోకంటె సంవాద శైలిలోనే, ఎక్కువభాగం నడిచింది. సర్గల మొదటో చూళికాప్రాయములైన పద్యాలు పొదగబడి సూచ్యార్థ సూచనం చేస్తున్నాయి. ఈ లక్షణాలన్నీ కలిపి దీన్ని దృశ్యకావ్యమనిపించేటట్లు చేస్తున్నాయి. ఈ కావ్యం తొమ్మిది సర్గలు. కవులు వీటికి విడివిడిగా పేర్లు పెట్టారు. పునరాగమనము, భిక్షాగమనము పరివ్రాజనము, నిరీక్షణము, అనుతాపము, ఉపదేశము,

ధర్మసంవాదము, అనుజ్ఞ, సహధర్మచర్యము—అని. ఈ పేర్లలోనే అనుస్యూతమై ఇతివృత్తమంతా స్ఫురిస్తోంది. బుద్ధుడూ, సుందరీనందులూ, ముగ్గురే పాత్రలు. ప్రథమ సర్గలో శుద్ధోదనుడూ, యశోధరా, కుమారుడూ, కొంచెం స్పృశింపబడ్డారు. ఆ సంస్పర్శ మాత్రంచేతనే ఆ పాత్రలలో ప్రాణం తొణికిసలాడుతోంది!

మహాభినిష్క్రమణంచేసి వెళ్లిన అలనాటి సిద్ధార్థుడు బుద్ధుడై తిరిగి కపిలవస్తుపురానికి రావటమే పునరాగమనం. ఈ కావ్యసౌధ—అళింద—మన తగిన ప్రథమసర్గ అంతా ఆ శాక్యముని అనుభావం తోనూ ప్రశాంత తేజస్సుతోనూ, నిండిపోయింది. ఆ వచ్చిన బుద్ధుని సందర్శనానికి కపిలవస్తు ప్రజ ఆ బాల వృద్ధమూ ఒడ్డు విరిగి వచ్చింది. రాచవారందరూ వచ్చారు. తడి యారని కన్నుగవా, పొడి యారిన నోరూ, అయి—పుత్రునికోసమై చేడ్పడి మంచపు తోడుగరయై కాలంవెళ్లబుచ్చుతున్న వృద్ధ భూపతి శుద్ధోదనుడు—'వచ్చెనా! నా తండ్రి!' అంటూ తడబడుతూ వచ్చాడు. ఆయన వెంట అంతఃపురం విడిచి వచ్చి—శూన్యదృష్టులతో భర్తను చూస్తూ, ఒక చేతితో కొడుకు కూఁకటి పుణుకుతూ, రూపం తాల్చిన శోకదేవతవలె యశోధర, దూరంగా నిలబడి ఉంది.

మమతా విరహితమూ, సంభ్రమదూరమూ, కరుణరస తరంగితమూ, శాంతమహోదారమూ, అయిన కటాక్షంతో గౌతముడు ఆ జనాన్నందరినీ చూస్తూ యీ సంసార దుఃఖ బహుళత్వాన్నీ, జీవిత క్షణ భంగురత్వాన్నీ, వివరించి—దుఃఖ సంతారకమైన తన నవధర్మాన్ని స్వీకరించవలసిందిగా ఉపదేశిస్తాడు. శుద్ధోదనాదులు నవధర్మ స్వీకారం చేస్తారు. బుద్ధుడు కపిలవస్తులో భిక్షలు చేస్తూ ఆ పట్టణ సమీపంలో ఉన్న వృక్షవాటిలో శిష్య సమేతంగా నివసించి ఉంటాడు. ఇది మొదటి సర్గలోని కథ.

ఆ శాక్యర్షికి సుందరనందుడనే తమ్ముడొకడు ఉన్నాడు. అతడు కోడెప్రాయంపు టందగాడు. కాంతి నిస్తంద్రుడు! అతని పేరటనే యీ కావ్యం సౌందరనందం అయింది. ఆ సుందరనందుని భార్య పేరు సుందరి. ఆమె సార్థకాఖ్య. పంతము, గర్వరేఖా, కలమానిని. ఎంత మానినియో అంత కాంతిమతి! అంత వికాస సుహాసిని! వారి ప్రణయం లోకోత్తరం. వారు క్షణవిరహకాతరులు. ఈ జీవితం సత్యమే అయితే—ఇది వారికి ఒక విరతిలేని స్వప్నం! ఇది సత్యంకాక స్వప్నమే అయితే—ఆ స్వప్నమే ఆ దంపతులకు సత్యం! వారి విలాసములకు ఈ అనంతకాలం చాలదు. వారున్న అనంత ఆకాశం క్రింద మూడవ వ్యక్తికి ఎడం లేదు. ఆ రాగమయ జీవనంలో భానుని రాకపోకలుకూడా వారెరుగరు.

ఒకనాడు వారిరువురి నడుమా ఒక ప్రణయ కలహం తటస్థించింది. మండన సాక్షీభూతమైన దర్పణాన్ని ఆమెకు అభిముఖంగా ధరించి నందుడు నిలబడి ఉన్నాడు. ఆమె అద్దంలోని తననీడ చూసుకుంటూ, నడుమ నడుమ అద్దాన్ని ధరించిన ప్రియుని ముఖాన్నిచూస్తూ, కస్తూరి అద్దిన వ్రేలితో విశేషక రచన చేసుకుంటూ ఉంది. ఇంతలో నందుడు కొంటెతనానికి అద్దంమీద 'ఉఫ్' అని ఊది ఆమె నీడను కనుమాయజేస్తాడు. సుందరి కోపాన్ని అభినయిస్తూ పరాఙ్ముఖియై రుంజుకుంటూ ఆవలికి వెళ్లబోతుంది. అడ్డంవచ్చి నందుడామె పాదముల మీద వ్రాలి సాంత్వనాలాప పరిదీనుడవుతాడు. సుందరి తేరుకొని—తుడిచిన అద్దంలో తన నీడ చూసుకుంటూ విశేషక రచన పూర్తి చేసుకుంటూ ఉంటుంది. ఇలా అద్దంలోని నీడ కొంతసేపు, కనుమాసిపోయి తిరిగి పరిస్ఫుటం కావటమనే కల్పన ప్రయోజన గర్భితమై కావ్యార్థాన్ని ధ్వనింప చేస్తున్నది. సరిగ్గా అదే సమయంలో ఆ యింటికి మధ్యాహ్న భిక్షార్థియై వచ్చిన బుద్ధుడు అలబ్ధ ప్రతివచనుడై తిరిగిపోవటం జరుగుతుంది. ఈ చరిత్రయిలా నడవవలసి ఉంది కాబట్టి బుద్ధుడు మరలిపోవటం ఒక పరిచారిక చూసి నందునికి విన్నవిస్తుంది. విని—విలువునా నీరై నందుడు గురుచరణ సేవార్థమై బయలుదేరుతాడు. అతణ్ణి వారింపనూ లేక—పంపనూ లేక సుందరి మథనపడుతూ ఉంటుంది.

ఎలాగైతేనేమి చివరికి—'సద్యోవిరచితమైన యీ విశేషకం తడియారేలోగా, వచ్చి తీరాలి!' అనే షరతు మీద నందుని కనుజ్ఞ యిచ్చి పంపి అనర్థాశంకియైన మనస్సుతో సుందరి బిక్కుబిక్కుమంటూ ఉంటుంది. ఇది భిక్షాగమనంలోని కథ.

ఇక—మూడవసర్గలో బుద్ధుడు నందునికి సన్న్యాసం యిప్పించటము, నాలుగవసర్గలో సుందరి విరీక్షణము, ఐదవసర్గలోనందుని అనుతాపము, ఆరవ సర్గలో బుద్ధుని ఉపదేశము, ఏడవసర్గలో అన్నదమ్ము లిరువురి ధర్మసంవాదము, ఎనిమిదవ సర్గలో సుందరికి బౌద్ధధర్మ స్వీకారార్థమై బుద్ధుని అనుజ్ఞ, తొమ్మిదవసర్గలో సహధర్మచర్యమూ, ఉపవర్ణితములైనాయి.

పూర్వ సర్గలలోని సముజ్జ్వలరాగము—ఉత్తర సర్గలలోని ప్రశాంత త్యాగము యీ నడుమ సర్గలలోని దశాపరిణామము—ఎంతో హృదయంగమంగా చిత్రించ బడినాయి. రెండవసర్గలోని ప్రణయ కలహ సముజ్జ్వలితమైన సంయోగ శృంగార చిత్రణానికి విరీక్షణ—అనుతాప—సర్గలలోని విప్రలంభ శృంగా చిత్రణం దీటుగా ఉంది. సుందరీ కపోల మండలి ఆ సపార్ద్ర విశేషకము మొదటి దశలో వారి ప్రణయ ప్రసంగములలోని రహస్యములను తలపించేరేఖ! రెండవదశలో అది తడియారిపోయి నందుడు చేసిన ప్రణయ సమయ భంగాన్ని ప్రవేలెత్తిచూపే ధర్మ ముద్ర! మూడవదశలో అది పేలెత్తి—నందుని భిక్షుక జన్మకై తనువు వాల్చిన కర్మవిపాక బీజం! తొలినాటి ఆ విశేషకం యిలా మూడుదశలలో కావ్యార్థాన్ని ధ్వనింప చేస్తోంది!

రాగమూ, త్యాగమూ, యీ కావ్యంలో సమాన స్కంధాన్ని అధిరోహించి ఉన్నాయి. ఉద్దామ వేగమైన సుందరీనందుల రాగనిర్ఝరము బుద్ధుని ఉపదేశ, శరత్సమాగమంతో తేరుకొని ప్రేమ మందాకినిగా రూపొందింది. నిజానికి నందుడు కాముక మాత్రుడు కాడు. అతని అనుభూతి యెంతో లోతైనది. అది మూడులోకాలను ఒక్కసారి ముంచియెత్తే జాలినది.

"వలపుల్ వడ్డికిఁ బాఱఁగొనటఁ
గదింపన్ బాత్రమై, నిండు చూ
పులకున్ వెన్నెలవై,
శ్రవోయుగళికింపుల్ నింపు గానంబవై,
అలరుం దావివి యయ్యు నూర్పులకు.
పై, నాత్మైకభోగ్యంబవై,
వలపుల్ దాటి యభిన్నవై,
తుది మదాత్మా! నాకు లేవైతివే!"

తాదృశమైన ప్రేమసురధుని అంగనైక నవాభిషేకార్హ కాదన్నాడు బుద్ధుడు! ఆధివ్యాధి జరా మరణ పరీతమైన ఈనాలోకం దయనీయస్థితిని వివరించి—ఆ—నీ—ప్రేమకు ఈ లోకాన్నంత నిపాత్రం చేయవలసిందని ఉద్బోధించాడు. విషయరాగంలో పాముగుపడిపోయిన సుందరీనందుల ప్రేమకణాన్ని వెలికితీసి దివ్యదీప కళికగాచేసి యీ విశ్వాన్నంతనీ వెలిగించాడు. తమ్మునికీనా సమ్యగ్దర్శనాన్ని ప్రసాదించాడు—

'గుచ్చి కవుంగిటన్ బొదివికోఁబనిలేదు,
వియోగబాధలవి
ముచ్చుముడుంగ బోవదు,
కలంగవలెన్ మరి వీనుదోయికిన్
మెచ్చు ఘటింపఁగోరదు, నిమిత్తమువేడ,
దొకప్డు మార, ద
య్యచ్చపుఁ బ్రేమమేడ!
విషయాది వికారములేదఁ! బుత్రకా'

ఎన్ని చెప్పినా భూతదయాళువైన బుద్ధుడు నందునికీ విధంగా బలవత్సన్న్యాసం యిప్పించటం దారుణమనే అస్వరస కొందరికి ఉండనే ఉంటుంది. అది సుందరి చెప్పినట్లు—మొగ్గను త్రుంచటమూ, పిందె కోయటమూ, అనిపిస్తుంది. నిజమే. వైరాగ్యం అనేది దానంతట అది కలగవలసిందే కాని—ఒకరి బలవంతం వల్ల వచ్చేదికాదుగదా! 'కావుల్ మొగ్గపువాత్రముకుళీ భావంబు సంధిల్లునే?' మరి అందరూ సిద్ధార్థులు కాలేనిమాటా, నిజమే — భోగానుభవం చేత రాగం మరింత పెరుగుతుందే కాని—ఏ నాటికీ తరిగే అవకాశం లేదు. దానికి ఎక్కడో ఒక చోట విడుపుర చెప్పి తీరవలసిందే. బుద్ధుడు చేసింది ఉచితమో అనుచితమో నిర్ణయించగల అధికారం ఎవరికుంది? వీటన్నింటికీ సమాధానం మూడవసర్గ ఆరంభానికి ముందున్న పద్యంలో కవులు చెప్పనే చెప్పారు.

'హితము సహితమ్ము మనిరానుచితములాది
యైన మేరలు దాటి—ఫలానుమేయ
ములగు నార్యశుభాలోభములకు స్వస్తి
యగుత!' అని—

అంతతః ఆలోచిస్తే సుందరీనందుల సహధర్మ చర్యానికి బుద్ధుడు అనుజ్ఞ ఇవ్వనే యిచ్చాడు. 'నందుని సుందరికిచ్చె సుందరిన్ నందునికిచ్చె దివ్య కరుణామయుఁడగు గురు దేవుఁడాదృతిన్'

ఈ కావ్యారంభ పద్యంలో బుద్ధుని త్యాగ మహిమ నిర్దేశింపబడింది. 'ఘనమహోత్యాగ మహిమంబు నాలకించి మూడు కాలముల్ రోమాంచమును వహించు' అని—తాదృశత్యాగ మహిమయందే యీ కావ్యం పరిసమాప్తం అవుతోంది! తమ్ముణ్ణికూడా తనంతటి వాణ్ణిగా చేశాడు శాక్యర్షి!

'తానొక గడ్డకట్టుకొని తత్పరతన్
శిలలై వశించు న
జ్ఞానుల కేడనోయి శుభసంగతి!
లాఁ, దనయాలు, నాత్మసం
తానము, తోడఁబుట్టువులు,
తల్లియుఁదండ్రి, కుటుంబు, దేశమున్
మానవులెల్ల ప్రాణులు కుమార!
సమస్తము తాను కావలెన్'

'కొడుకులులేని వారలకుఁ గూరిమిబిడ్డవు,
మాతృహీనులౌ
బుడుతల కెల్లఁదల్లివలె పోషణసేయుము,
'నా' యనంగ లే
కడలెడు దీనులన్ మనుపు,
మార్తుల కాదరువై తలంపు మీ
పుడమి దివంబు సత్యమిదె పో!
పరమార్థము బౌద్ధజాతికిన్.'

బౌద్ధజాతికే కాదు—లోకానికి—ఇది మానవ జాతికే సార్వకాలికమైన సందేశం!

(ఆలిండియారేడి సౌజన్యంతో)

# ధరల పెరుగుదల

డా. ఎస్. ఎల్. కాంతారావు

భారతదేశపు ప్రస్తుత ఆర్థిక సమస్యలలో ధరల పెరుగుదల ముఖ్యమైనది, 1939 వ సంవత్సరం నుండి వస్తువుల ధరలు పెరుగుచున్నప్పటికీ, 1956 నుండి ఈ పెరుగుదల మరీ విజృంభించింది. ఈ ఎడతెగని ధరల పెరుగుదలనే అర్థశాస్త్రవేత్తలు 'ద్రవ్యోల్బణం' అంటారు. ద్రవ్యోల్బణం అంటే ద్రవ్యంయొక్క సప్లయి పెరిగి, ద్రవ్యం విలువ, కొనుగోలు శక్తి తగ్గిపోవడమన్నమాట. భారతదేశంలోను, మరికొన్ని ఇతర దేశాలలోను ద్రవ్యం విలువ ఏ విధంగా తగ్గిపోతున్నది ఈ క్రింది పట్టిక సూచిస్తుంది.

పట్టిక_1. ద్రవ్యం కొనుగోలు శక్తి తగ్గుదల

| దేశం | 1959 లోని విలువ 100కి అనుకొంటె 1969 లో విలువ | 1959–69 మధ్య ద్రవ్యం విలువ సాలుసరి సగటు తగ్గుదల |
|---|---|---|
| ఇండియా | 56 | 5.6% |
| జపాన్ | 60 | 5.0% |
| ఫ్రాన్సు | 69 | 3.7% |
| పాకిస్థాన్ | 70 | 3·6% |
| పశ్చిమ జర్మనీ | 78 | 2.4% |
| అమెరికా | 70 | 2.2% |

Source : Britannica Book of the year 1971. P. 292.

ద్రవ్యోల్బణం ప్రపంచ వ్యాప్తమైన విషయమైనప్పటికీ ద్రవ్యోల్బణం రేటు భారతదేశంలో హెచ్చుగా ఉన్నదనే విషయం పై పట్టికవల్ల తెలుస్తుంది. భారతదేశంలో 1971—72 లో ధరల పెరుగుదల శాతం 48 కాగా, 1972 జూన్, 1973 జూన్ మధ్య 20·5 శాతానికి పెరిగింది. 1949 లోని రూపాయి విలువను 100 అనుకొంటె, 1972 డిసెంబరు నాటికి ఇది 39.2 కు తగ్గింది. అంటె 1949 రూపాయి విలువలో 1972 డిసెంబరునాటి రూపాయి విలువ 2/5 మాత్రమే. 1972–73 లో ఆహార పదార్థాల ధరల పెరుగుదలరేటు మిగిలిన వస్తువుల ధరల పెరుగుదలకన్నా హెచ్చుగాఉంది.

ధరల పెరుగుదలవల్ల స్థిరాదాయ వర్గాలవారు, ఇతరులంకంటె ఎక్కువ కష్టపడవలసి వస్తుంది. ప్రభుత్వ లెక్కలప్రకారం భారత దేశంలో నూటికి నలభైమందికి, కనీస అవసరాలకు చాలినంత తిండి బట్ట కొనడానికి అవసరమైన ఆర్థికస్తోమత మామూలుగానే లేదు. ఈ పరిస్థితులలో ధరలు విపరీతంగా పెరుగుతూ ఉంటే, కలిగేబాధ చెప్పనలవి కాదు. జీవితావసర వస్తువుల ధరలు పెరుగుతూ ఉంటే స్థిరాదాయవర్గాల జీవితం నికృష్టంకావడమే గాక, ప్రజలందరికీ ద్రవ్యంమీదగల నమ్మకం తగ్గిపోవచ్చు. అటువంటి పరిస్థితులలో డబ్బున్న ప్రతివారు వస్తువులను, స్థిరాస్థులను, బంగారాన్ని మున్నగు వాటినే అపేక్షిస్తారే కాని, డబ్బును అట్టిపెట్టుకోరు. అప్పుడు డబ్బంటె వద్దని పరిగెత్తుతారు. ఈ పరిస్థితులు 1920-23 మధ్య జర్మనీలోను, ఇటీవల కాలంలో ఇండోనీషియాలోను ఏర్పడ్డాయి. అటువంటి పరిస్థితులు భారతదేశంలో ఏర్పడకుండా ఉండాలంటే, ధరల పెరుగుదలకు దారితీసే కారణాలను తెలిసికొని వాటిని అరికట్టడం అవసరం.

ద్రవ్యోల్బణానికి దారితీసే కారణాలను సాధారణంగా, రెండు తరగతులుగా విభజిస్తారు.

(1) డిమాండ్ పెరుగుదలవల్ల ఏర్పడు ద్రవ్యోల్బణం (Demand Pull Inflation) (2) వస్తూత్పత్తి ఖర్చులు పెరగటంవల్ల ఏర్పడు ద్రవ్యోల్బణం (Cost Push Inflation) కాని ఇవి రెండు పరస్పర విరుద్ధమైన సిద్ధాంతాలుకావు. కొన్ని పరిస్థితులలో ఇవి రెండు ఒకదాని ప్రభావానికి మరొకటి లోను గావచ్చు. డిమాండ్ పెరుగుదలవల్ల ఏర్పడ్డ ద్రవ్యోల్బణం, వేతనాల పెరుగుదవల్ల మరింత పెరగవచ్చు. ద్రవ్యోల్బణం ఏర్పడడానికి కారణాలను తెలిసికొంటే నివారణ చర్యలు తీసికోవడం సులభమౌతుంది.

డిమాండ్ పెరుగుదల భారతదేశంలోని ద్రవ్యోల్బణానికి ప్రధాన కారణంగ చాలమంది అంగీకరిస్తారు. అంటే దేశంలోని సమిష్టి వస్తు, సేవల సప్లయికన్నా సమిషి (మొత్తం) డిమాండ్ హెచ్చుగా ఉందన్నమాట. ఆదాయాలు, జనాభా మున్నగునవి పెరిగితే డిమాండ్ పెరుగుతుంది. ఒకరి ఆదాయం మరొకరి వ్యయం ఒకరి వ్యయం మరొకరి ఆదాయం కాబట్టి ఆదాయాలు పెరగాలంటే ఎవరో ఒకరు ఖర్చుపెడుతూ ఉండాలి. అంతేకాదు పెట్టుబడి వ్యయఫలితంగా ఆదాయం పెరుగుతుంది. ఆదాయంలోని ఈ పెరుగుదల, పెట్టుబడి వ్యయంలోని పెరుగుదలను కొన్ని రెట్లు హెచ్చుగా ఉండవచ్చు. ఉదాహరణకు ప్రభుత్వ పెట్టుబడివల్ల ఒక వ్యక్తి ఆదాయం వందరూపాయలు పెరిగిందను కొందాం. అధికంగావచ్చిన ఆదాయంలో వస్తుసేవల కొనుగోలుకై 80 శాతం ఖర్చుపెట్టే ప్రవృత్తి ఆ సంఘంలో ఉందనుకొంటె, అతను వినియోగ వస్తువులకై 80 రూపాయలు ఖర్చు పెడతాడు. ఈ 80 రూపాయలు వేరొకరికి ఆదాయమై, వారందులో 80 శాతం అనగా 64 రూపాయలు ఖర్చుపెడతారు. 64 రూపాయలు ఆదాయంగాపొందిన వారు అందులో 80 శాతం అనగా సుమారు 51 రూపాయలు ఖర్చు పెడతారు. ఈవిధంగా ఆదాయం వ్యయానికి ఆదాయాన్ని పెక్కురెట్లు పెంచేశక్తి ఉంది. కాని అది ఎన్నిరెట్లు అనేది ప్రజలువస్తుసేవలకై ఖర్చుపెట్టే ప్రవృత్తిమీద (వినియోగ ప్రవృత్తి) ఈ ప్రవృత్తియొక్క స్థిరత్వంపైన ఆధారపడి ఉంటుంది. పన్నులద్వారా ధనాన్ని సేకరించి ప్రభుత్వం అధికంగా వ్యయంచేసినప్పుడు కూడ పైన చెప్పిన ఫలితం కొంత ఉంటుంది. అధిక వ్యయానికి కావలసినధనాన్ని ప్రభుత్వం లోటు ద్రవ్యవిధానం ద్వారా సేకరించితే పైన చెప్పిన గుణక ఫలితాలు మరింత ఉంటాయి. ప్రభుత్వ వ్యయం వృద్ధిచెందితే సమిష్టి డిమాండ్ పెరుగుతుందన్న మాట. ఇటీవల కేంద్రరాష్ట్ర ప్రభుత్వాల వ్యయం బాగా పెరుగుచున్నదనే విషయం ఈ క్రింది పట్టిక సూచిస్తుంది.

## పట్టిక—2. ప్రభుత్వ వ్యయం పెరుగుదల

| సంవత్సరము | (వ్యయం కోట్ల రూపాయలు) | |
|---|---|---|
| 1960—61 | 1677 | ,, |
| 1965—66 | 3437 | ,, |
| 1967—68 | 4323 | ,, |
| 1969—70 | 5351 | ,, |
| 1970—71 | 5875 | ,, |
| 1971 72 | 6354 | ,, |

Source,— Indian Economy. Some Basic Statistics-R. B. I.

పెరుగుతున్న ప్రభుత్వ వ్యయాలతోబాటే, ప్రభుత్వాలకు పన్నులు మున్నగు వానివల్ల వచ్చే రాబడి, చాలినంతగా పెరగకపోవడంచేత ప్రభుత్వాలకు లోటు బడ్జెట్లు ఏర్పడుతున్నాయి. ఈ లోటును భర్తీ చేయుటకు ప్రభుత్వాలు రిజర్వ్ బాంకునుండి అప్పులు చేస్తున్నాయి. ఈ విధమైన లోటు ద్రవ్య విధానంవల్ల దేశంలోని డబ్బు సప్లయి పెరుగుతుంది. 1951

# పట్టిక-3. లోటు ద్రవ్యం

| ప్రణాళికా కాలం | లోటు ద్రవ్యం మొత్తం | (కోట్ల రూపాయలు) సంవత్సర సగటు |
|---|---|---|
| మొదటి పంచవర్ష ప్రణాళిక (1951—56) | 420 | 84 |
| రెండవ ప్రణాళిక (56—61) | 954 | 191 |
| మూడవ ప్రణాళిక (61—66) | 1133 | 226.6 |
| ఏకవర్ష ప్రణాళికలు (66—69) | 1006 | 335.3 |
| నాల్గవ పంచవర్ష ప్రణాళిక (69—74) | 2140 (అంచనా) | |
| 1969—70 | | 58 |
| 1970—71 | | 411 |
| 1971—72 | | 738 |
| 1972—73 | | 848 |
| 1973—74 (అంచనా) | | 85 |

ప్రభుత్వం చేసే వ్యయాన్ని, అభివృద్ధి కార్యక్రమాలకైన వ్యయమని, అభివృద్ధేతర కార్యక్రమాలకైన వ్యయమని రెండు తరగతులు విభజిస్తారు. అదేవిధంగా వస్తుసేవల వినియోగంకొరకు అయిన వ్యయాన్ని, పెట్టుబడికొరకు అయిన వ్యయమని రెండు రకాలుగ వర్గీకరించవచ్చు. వస్తుసేవలకై చేసే వ్యయంవల్ల, అభివృద్ధేతర కార్యక్రమాలకై చేసే వ్యయంవల్ల వస్తూత్పత్తి ప్రత్యక్షంగ పెరగదు. పెట్టుబడి వ్యయంవల్ల అభివృద్ధి కార్యక్రమాలకయ్యే వ్యయంవల్ల వస్తూత్పత్తి పెరుగుతుంది. కాని కొన్ని రకాల పెట్టుబడులవల్ల వస్తూత్పత్తి శీఘ్రంగా పెరుగుతుంది. ఉదా॥ చిన్నతరహా పరిశ్రమలు కొన్ని రకాల పెట్టుబడులవల్ల వస్తూత్పత్తి ఎప్పుడో కాని పెరగదు. ఉదా ఉక్కు కర్మాగారాలు కొన్నిరకాల ఇర్రిగేషన్ ప్రాజెక్టులు ఇటీవల అభివృద్ధేతర కార్యక్రమాలపై ప్రభుత్వవ్యయం బాగా పెరిగింది. ఉదాహరణకు, 1969—70 లో మొత్తం వ్యయంలో కేంద్రప్రభుత్వం అభివృద్ధేతర కార్యక్రమాలకై 52.2 శాతం ఖర్చుపెట్టగా 1971-72 లో 53. 4 శాతం ఖర్చు బెట్టింది. అదేవిధంగా 1965-66 లో నికర పెట్టుబడి. జాతీయాదాయంలో 13.4 శాతం కాగా, 1969-70 లో 9.3 శాతానికి 1970—71 లో 10.5 శాతానికి, 1971-72 లో 11.5 శాతానికి తగ్గింది. 1965—66 లోని పెట్టుబడి రేటుకంటే ప్రస్తుత పెట్టుబడిరేటు తక్కువగా ఉందన్నమాట.

జాతీయాదాయాన్ని ప్రతిసంవత్సరం కనీసం 5 శాతమైనా పెంచవలెనని ప్రణాళికలు వేసికొన్నప్పటికీ, 1960-61, 1969-70 ల మధ్య 3.5 శాతం మాత్రమే పెరిగింది. 1971-72, 1972-73 లలో ఇది 1.5 శాతం లేదా 2 శాతం మాత్రమే ఉండవచ్చునని అంచనా. వ్యవసాయోత్పత్తి పారిశ్రామికోత్పత్తి ఆశించినట్లుగా పెరగడంలేదు. రెండు మూడు సంవత్సరాలుగ హరిత విప్లవం హిరణ్య హరిణం లాగ చేతికందకుండా పోయింది. ఈ పరిస్థితులలో ద్రవ్యరాశి మాత్రం బాగా పెరుగుతూ ఉంది. జాతీయాదాయం, ద్రవ్యరాశి, ధరల పెరుగుదలకు సంబంధించిన వివరాలు క్రింద పట్టికలో చూపబడ్డాయి.

## పట్టిక–4. జాతీయాదాయం, ద్రవ్యం సప్లయి, ధరల పెరుగుదల

| సంవత్సరం | ద్రవ్యం సప్లయి | | | జాతీయాదాయము 1960—61 ధరల్లో | | | టోకుధరలు | |
|---|---|---|---|---|---|---|---|---|
| | కోట్ల రూపాయలు | గతించిన సంవత్సరం పై పెరుగు దల శాతం | సూచీ సంఖ్య | కోట్ల రూపాయలు | గతించిన సంవత్సరం కంటె పెరుగు దల శాతం | సూచీ సంఖ్య | సూచీ సంఖ్య | గతించిన సంవత్సరం కంటె పెరుగు దల శాతం |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) |
| 1961—62 | 3046 | 6.1 | 100 | 13,740 | | 100 | 100 | — |
| 1962—63 | 3310 | 8.7 | 109 | 14008 | 1.9 | 102 | 103.8 | 3.8 |
| 1963—64 | 3752 | 13.3 | 123 | 14771 | 5.4 | 108 | 110.2 | 6.1 |
| 1964—65 | 4080 | 8.9 | 134 | 15896 | 7.6 | 116 | 122.3 | 11.0 |
| 1965—66 | 4529 | 11.0 | 149 | 15025 | —5.4 | 110 | 131.6 | 7.6 |
| 1966—67 | 4950 | 9.3 | 162 | 15267 | 1.6 | 111 | 149.9 | 13.9 |
| 1967—68 | 5350 | 8.1 | 176 | 16694 | 9.3 | 122 | 167.3 | 11.5 |
| 1968—69 | 5780 | 8.0 | 189 | 16815 | 0.7 | 122 | 165.4 | –1.1 |
| 1969—70 | 6387 | 10.6 | 209 | 18038 | 7.3 | 131 | 171.6 | 3.7 |
| 1970—71 | 7140 | 11.8 | 234 | 18876 | 4.6 | 137 | 181.1 | 6.0 |
| 1971—72 | 8138 | 14.0 | 267 | 19207 | 1.8(?) | 140 | 188.4 | 4.0 |
| 1972—73 | 9281 | 14.0 | 305 | (?) | 1.8(?) | | 20.70 | 10.5 |

Sourec—Reserve Bank of India Bulletins.

1961–62, 1972–73 సంవత్సరాల మధ్య ద్రవం సప్లయి 205 శాతం, ధరలు 107 శాతం, జాతీయాదాయం 40 శాతం పెరిగినట్లు పై పట్టికనుండి మనం గ్రహించవచ్చు. జాతీయాదాయపు పెరుగుదలరేటు తక్కువగా ఉన్నదనుకొంటె, తలసరి ఆదాయపు పెరుగుదల రేటు మరింత తక్కువగా ఉంది. 1960—70 ల మధ్య భారత దేశంలోను మరికొన్ని ఇతర దేశాలలోను తలసరి ఆదాయం, జనాభాల పెరుగుదల ఏ విధంగా ఉండేది క్రిందిపట్టిక చూపుతుంది.

## పట్టిక–5. తలసరి ఆదాయం, జనాభాల పెరుగుదల

| దేశం | తలసరి ఆదాయం డాలర్లు | తలసరి ఆదాయపు పెరుగుదల రేటు | జనాభా పెరుగుదల రేటు |
|---|---|---|---|
| తైవాన్ | 390 | 7.1 | 2.9 |
| ఈజిప్టు | 210 | 1.7 | 2.5 |
| చైనా | 160 | 2.1 | 2.0 |
| ఇండియా | 110 | 1.2 | 2.3 |
| పాకిస్తాన్ | 100 | 2.4 | 2.7 |
| | 7.3 రూపాయలు | | |

Source:—World Economic Atlas.

భారత దేశంలోని జనాభా పెరుగుదల రేటు కొన్ని ఇతర దేశాలలోని పెరుగుదల రేటుకంటె తక్కువ ఉన్నప్పటికీ, ఆర్థికాభివృద్ధి రేటు తక్కువగా ఉన్నందున, తలసరి ఆదాయపు పెరుగుదల రేటు కూడ చాల తక్కువగా ఉన్నది. జాతీయాదాయము, తలసరి ఆదాయముల పెరుగుదల రేట్లు తగ్గడమేకాదు, ఇటీవల ఒక్కొక్క వ్యక్తికి సగటున లభ్యమయ్యే జీవితావసర వస్తువుల పరిమాణం కూడ తగ్గుతున్నట్లు క్రిందిచూపిన పట్టికవల్ల గ్రహించవచ్చు.

## పట్టిక—6. ఒకొక్క వ్యక్తికి సగటున లభ్యమయ్యే వస్తురాశి

| సంవత్సరము | రోజుకు లభించే కాయధాన్యాలు (గ్రాములు (సెరియల్స్) | పప్పుధాన్యాలు రోజుకు లభ్యమయ్యేవి గ్రాములలో (పల్సస్) | సంవత్సరం | సంవత్సరంలో లభ్యమయ్యే నూలుబట్ట | లభ్యమయ్యే నూనెలు కిలోగ్రాములు |
|---|---|---|---|---|---|
| 1961 | 399 | 69 | 60—61 | 13.8 | 3.2 |
| 1965 | 419 | 62 | 67—68 | 13.6 | 3.2 |
| 1968 | 405 | 56 | 69—70 | 13.8 | 2.8 |
| 1970 | 404 | 52 | 70—71 | 15.2 | 3.3 |
| 1971 | 419 | 51 | 71—72 | 14.1 | 2.7 |
| 1972 | 381 | 47 | | | |

Source.—Economic Survey 1972-73-P. 104 & 106

ఈవిధంగ వస్తువుల సప్లయి తగ్గిపోవుచున్నందువ ప్రభుత్వవ్యయము లోటుద్రవ్యము. ద్రవ్యరాశి పెరుగుతున్నందువను సమిష్టి డిమాండ్ సమిష్టి సప్లయికన్నా హెచ్చుఅయ్యే పరిస్థితి ఏర్పడింది. కాన ధరలు హెచ్చుటలో ఆశ్చర్యములేదు.

ఈవిధంగా ఏర్పడిన వస్తువుల కొరతను వ్యాపారస్తులు, స్పెక్యులేటర్లు మున్నగువారు స్వంత లాభమునకు [illegible]మ మరింత చేయుచున్నారు. ఈవిధమగు చర్యలకు 'బ్లాక్‌మనీ' కూడ లభ్యమగుచున్నదనునది నిర్వివాదాంశము. ఈవిధమగు బ్లాక్‌మనీ పరిమాణము 1968-69 లో 1400 కోట్ల రూపాయలని ప్రత్యక్షపన్నుల కమిటీవారు అంచనా వేయగా, వేరొకరు 2830 కోట్ల రూపాయలుగా అంచనావేశారు. ఈ బ్లాక్‌మనీ అనేది ఆదాయపు పన్ను చెల్లింపుకు లోనుగాకుండ, ప్రభుత్వ లెక్కల లోనికి రాకుండాఉన్న మామూలు ధనమే. సృష్టికి ప్రతిసృష్టిలాగ మామూలు ఆర్థిక వ్యవస్థకు సమాంతరంగా వేరొక ఆర్థికవ్యవస్థ ఏర్పాటుకు బ్లాక్‌మనీ దోహదంచేస్తూ, ధరల పెరుగుదలను మరింత చేస్తున్నది.

భారత దేశంలోని ద్రవ్యోల్బణం, వస్తు సేవల కొరతవల్ల, ప్రభుత్వవ్యయం ద్రవ్యం సప్లయి విపరీతంగా పెరగడంవల్ల ఏర్పడిందని పై వివరణవల్ల తెలుస్తుంది. దీనిని ఏ విధంగా అరికట్టాలన్నది ముఖ్యమైన ప్రశ్న.

(సశేషము)

# "కవ్వడి కవ+వడి కాదు"

శ్రీ తిరుమల రామచంద్ర

క్రీడఁగి ద్రుపదానుజుఁడు నె
వ్వడి. గవ్వడి నేసె నూఱు వాఁడి శరంబుల్
కడు నలిగి వాని నొప్పియు
న సమున తునియంగ నేసె నరుఁడస్త్రములన్

భార. ఆది. 6—

అనే పద్యంలోను, ఇతరత్రాను కవ్వడి పదం వచ్చినప్పుడల్లా నాకు సందేహం కలిగేది; ఈ కవ్వడిని మన కోశకారు లిచ్చిన వ్యుత్పత్తి సరైనదేనని. కాదని మనసు చెబుతుండేది; ఇప్పుడూ చెబుతున్నది. కాని, అసందిగ్ధంగా నిరూపించే ప్రమాణాలు కనపించలేదు. ఇటీవల డాక్టర్ పి. యశోదారెడ్డిగారి 'తెలుగులో హరివంశములు' సిద్ధాంత వ్యాసం చదువుతుండగా, ఒక అపూర్వ పదం కనిపించి మెరుపవలె వ్యుత్పత్తి తోచి ఎగిరిపడ్డాను. కాని, నా వాదం సరైనదని నిరూపించడానికి సాధన సంపత్తి పూర్తిగా దొరకక కొంచెం కుంగిపోవలసే వచ్చింది. అయినా, భగవంతుని వెదకడానికి నేతినేతివాదం వుండనేవుంది కదా. దానినే సాహిత్యంలో సత్యగవేషణకూ వినియోగించుకుంటే ఏమి పోతుంది—అనుకొని మనస్సులోనే చర్చించుకొన్నాను; దానినే ముడిముడిగా పండితుల ఎదుట పెడుతున్నాను.

కవ్వడికి విద్వాంసులు చెప్పే వ్యుత్పత్తి కవ+వడి—రెండు చేతుల వడిగలవాఁడు. అర్జునుఁడు—అని. ఇది శబ్దరత్నాకరం ఇచ్చిన వ్యుత్పత్తి. బ్రౌణ్య మేమో వ్యుత్పత్తికి ప్రయత్నించక, దీని మూల స్వరూపం తెలియదు—అని తన చిత్తశుద్ధిని ప్రకటించింది. ఈ పదం సంస్కృతంలోని సవ్యసాచి అనే పదానికి అనువాద రూపమయిన పర్యాయమని సాహిత్య పరిచయమున్న ప్రతివారికీ తెలుసు. దాని అనువాదమే అయినప్పుడు, దాని అర్థం పూర్తిగా తెలుగు పదంతో రావాలి కదా! మూల సంస్కృత పదం పుట్టుపూర్వోత్తరాలు చూద్దాము:

శబ్ద కల్పద్రుమం సవ్యసాచి పదాన్ని ఈ విధంగా వ్యాఖ్యానించింది:—'సవ్యసాచీ=సవ్యేన, వామేన హస్తేనాపి సచతి సంధధాతి బాణమితి. సవ్యసంధానే ణినిః. అర్జునః—ఇతి హేమచంద్రః మహాభారతమ్— 4 12—19.

'ఉభౌ మే దక్షిణౌ పాణీ
గాండీవస్య వికర్షణే,
తేన దేవ మనుష్యేషు
సవ్య సాచీతి మాం విదుః.
సవ్యమ్ వామమ్ స్వప్రేరణే'

ఎడమ చేతితోను బాణాలు సంధించేవాడు గనుక సవ్యసాచి అని అర్థమని పై దాని తాత్పర్యం. 'రెండు చేతులా గాండీవాన్ని వంచి బాణాలు వేయడంలో సమర్థమైనవి గనుక, దేవతలలోను, మానుష్యులలోను నాకు సవ్యసాచీ అనే ప్రసిద్ధి' అంటాడు అర్జునుడు.

'వామం శరీరే సవ్యం స్యాత్
అప సవ్యంతు దక్షిణమ్'

అని అమరసింహుడు—శరీరంలోని ఎడమ భాగం సవ్యమని, దానికి ఎదురుగా వుండేది, అపసవ్యం, దక్షిణమని స్పష్టపరచాడు. ఈ సవ్యాపసవ్య పదాల అర్థాలు తర్వాత కొంత చిక్కులు కలిగించినా. సవ్యం పదం వేదంలోను, మనుధర్మ శాస్త్రంవంటి స్మృతుల

లోను స్పష్టంగా ఎడమ అనే అర్థంలోనే కనిపిస్తుంది. మహర్షి ఉపవీత ప్రాచీన ఆవీతి నివీతాలను నిర్వచిస్తూ,

'ఉద్ధృతే దక్షిణే పాణౌ
ఉపవీత్యుచ్యతే బుధః,
సవ్యే ప్రాచీన ఆవీతి
నివీతీ కంఠ సజ్జనే' 2—63

అని స్పష్టపరచాడు. కాని ఎందుకో ఏమో సవ్యం సరైంది, కుడి అని, అపసవ్యం సరైంది కాదు, వామమార్గం అని, అర్థాలు, తర్వాత మారిపోయాయి. అనర్ఘ రాఘవ నాటకంలోని 'ఏకేన సవ్య పాణినా విశిఖ ముత్థాయ కిమాహ రావణః. సాధురే మనుష్య డింభ. సాధు.' అన్న వాక్యాలలోని సవ్య శబ్దానికి వ్యాఖ్యాత 'సవ్యపాణినా దక్షిణ హస్తేన' అని అర్థ మిచ్చాడు. సవ్యాపసవ్యాల అర్థాల తర్వాతి మార్పు ఏమైనా, మన వివక్ష కవ్వడి శబ్దార్థం కదా.

కవ్వడి సవ్యసాచి పదానికి అనువాదమన్నది నిస్సందేహమయినప్పుడు, కవ్వడి అన్నపదానికి ఎడమ చేతితోను బాణాలు సంధించేవాడు అని అర్థం వుండాలి, వుంటేనే సరైన అనువాద పదవౌతుంది. మరి, కవ్వడి పదాన్ని మన నైఘంటుకులు కవ+వడి అని విడదీశారు. కవ పదానికి తెలుగు కన్నడాలలో రెండు, రెండుగా చీలు, పంగచీలు అనే అర్థాలున్నాయి గనుక, కవ+వడి=కవ్వడి కావడంలో ఏలాటి విప్రతిపత్తి లేదు. అర్థంకూడ గురికి జేసెడు దూరంగా సరిపోతూను వుంది. ఈ అర్థానికి అర్జునుడే చెప్పిన శ్లోకమూ దోహదకారి. కాని, ఇది సవ్యసాచి సమస్త పదంలోని ప్రతిపదానికీ అర్థమూ కాదు; అనువాదమూ కాదు. ఎడమచేతితోను బాణాలు వేసేవాడనీ స్పష్టంగా అర్థం చెప్పినప్పుడే ఎవరికైనా సంతృప్తి కలుగుతుంది. అందువల్ల—

కవ్వడికి నేను అనుకొన్న వ్యుత్పత్తే సవ్యసాచికి దగ్గరగా కనిపించింది. కప్+బడి—>కవ్+వడి—> కవ్వడి అయివుంటుందేమోనని నా మనసులో చాల కాలంగా మెదలుతూంది. కవ్, కవి, కవియు అనే క్రియలకు కవియు, ఆక్రమించు, ప్రేరించు అనే అర్థాలున్నాయి. కవియు+బడి—>వడి. బడితోను కవిసేవాడు, బడితోను బాణాలు వేసి కవియబడేవాడు. అని అర్థం చెప్పుకోవచ్చు.

మరి, బడి అంటే ఏమిటి? బడి అనే పదానికి ఎడమ అనే అర్థం వుంటే, ఎడమచేతితోను కవిసేవాడు, లెఫ్ట్‌హేండర్ కూడ అని చెప్పుకోవచ్చు. కాని తెలుగు నిఘంటువులను చూస్తే, బడి పదానికి ఎడమ అనే అర్థం కనిపించదు. ఎడ, ఎడమ, డా అని తెలుగులోను, ఎడ, ఎడదు అని కన్నడంలోను వామార్థక వాచకాలు ఉన్నాయి. తమిళంలోను ఎడయే. వామార్థకం, వల, వలను, బల, వల, వలద అనేవి దక్షిణ వాచకాలు, వీటిలోని లకారం డకారమో రభేదంగాను, వకారం బకారమో రభేదంగాను మారిందని సరిపెట్టుకున్నా వల బడ—>బడి కావచ్చును గాని, అర్థం సుతరామూ కుదరదు. ఇంతమాత్రాన నాకు నిరాశ కలుగలేదు. బడి అనే పదం ఎడమ అనే అర్థంలో ప్రయోగంలో కనిపించింది; సాంబోపాఖ్యానములో సూర్య వర్ణనంలో బడి పదం వామార్థకంలో అసందిగ్ధంగా ప్రయుక్తమయింది.

సీ. 'హరు బడి కంటికి హరి కుడి కంటికి
మనువిచ్చు నేవేల్పు మండలంబు
తిమిర శృంగము నాఁటేయాద్రి శృంగంబు
గరగతం బేవేల్పు గాఢ గతికి
బదిరెండు రాసుల బహుళార్థ రాసుల
ఫల మీఁగి యేవేల్పు తెలియ బఱచు
దొగల వాకట్టు సాధువుల వాకట్టును
వర్ధింప నేవేల్పు వలతియయ్యె
నన వెలయు హేళి పద్మినీవనివి తాళి
తుహిన భూధర దంభోళి మహిమశాలి
సర్వము భజించు సత్రాజి దాహ్వయుండు
పరకు కల్యాణ పరిపాక బాంధవమున'
('ఆ. 2–4')*

సూర్యుడు శివుని బడికన్నుగాను, అనగా

* తెలుగులో హరివంశములు పు. 459.

ఎడమ కన్నుగాను, విష్ణువు కుడికన్నుగాను వర్ణితుడు కావడం పురాణ గాథాజ్ఞులకు తెలిసిన విషయమే.

ఎడమకు ఈ బడి పదం దొరికింది గదా అని పొంగిపోతున్న నాకు డాక్టర్ యశోదారెడ్డిగారే నాచన సోముని ఉత్తర హరివంశంలోని మరొక బడి పదం చూపి పుణ్యం కట్టుకొన్నారు.

'అప్పుడప్పరమ పురుషుం గొనియాడం దలంచి యత్తాపసోత్తము లిట్లనిరి.

పన్నగంబుల రాజు బగవాడు గూడి నీ
శయనంబు బయనంబు సంతరింప
దుగ్ధవారాశి కూఁతురు నాలుగూడి నీ
శరణంబు భరణంబు సవదరింప
తామర పగవాడు దయితుండు గూడి నీ
బడిచూపు కుడిచూపు పరిఢవింప
బందురు చెలికాడు సయిదోడు గూడినీ
యుల్లంబు మొల్లంబు నుపచరింప
గంపమాన మనోధ్యాన గతులు మాన
కేకతంబున్న మునులకు నేకతంబు
లేక పాడగానవచ్చు నీలీల గాన
నమ్యలేనాఁట ధన్యులే యంబుజాక్ష

1–119.

తామర పగవాడు—చంద్రుడు బడిచూపుగాను, — ఎడమ చూపుగాను, తామరదయితుండు— సూర్యుడు కుడిచూపుగాను ఉన్నవాడు నీవని మునులు కృష్ణుని స్తుతించారు. కవిత్రయం తర్వాత ప్రామాణికతకు పరముడైన ఎవీన గుణనవాధుని ఈ ప్రయోగం విని ఎంత హాయి కలిగింది. ఇది నిఘంటువులకు ఎక్కక పోవడం ఎంత దురదృష్టం!

బడి పదానికి ఎడమ అనే అర్థంవున్న ప్రాచీన ప్రయోగాలనుబట్టి కవ్వడి పదం వ్యుత్పత్తి కవ+వడి కాదని, కవ+బడి అయి ఉంటుందని మనం భావించవచ్చు. కవ+బడి=ఎడమచేతితోను కవియువాడు ఎడమచేతితోను ఆక్రమించేవాడు, బాణాలు వేసేవాడు అని అర్థం స్పష్టం కావడమేకాక సవ్యసాచి పదానికి సరైన అనువాద పర్యాయంగాను అవుతుంది. కవ+బడిలోని బకారం వకారం కావడం, అజ్లోపం వంటి మార్పులు ప్రతి భాషలోను సహజమైనట్టివే.

ఈ బడి వంటివే కాక హరివంశాది ప్రాచీన ప్రబంధాల పలుకుబళ్ళు నేటికీ సజీవమై పండితులను ఆశ్చర్యచకితులను చేసే తెలంగాణా జానపదుల పులకండ పలుకులవంటి పలుకులు, పలుకుబళ్ళు వింటున్న నాకు ఇవన్నీ నిఘంటువులకు ఎక్కలేదే అని విచారం కలుగుతుంది. ఇలాటి వేనవేలు పదాల పుట్టుపూర్వాలను అలవోకగా తెలుపుతూ వాఙ్మయ పరిశోధకుల పాలిటి సంచార నిఘంటువైన డాక్టర్ యశోదా రెడ్డిగారికి కృతజ్ఞుణ్ణి. ఇలాటి ఉత్సాహశక్తులైన మంచివారిని గురించే ఏ మహానుభావుడో అన్న ఈ సూక్తిని స్మరిస్తాను:—A good woman inspires a man, a beautiful woman fascinates him and a sympathetic woman gets him.



కలగూరగంప :

# మార్క్సిజానికి కాలదోషం?

జూన్ నెల భారతిలో 'లే', 'విప్లవం వర్ధిల్లాలి', 'మహతి' పుస్తకాలమీద నేను వ్రాసిన సమీక్షకు ఆగస్టు నెల భారతిలో శ్రీ కె. వి. రమణారెడ్డిగారు సమాధానం వ్రాసేరు. సమాధానాలకు సమాధానాలు వ్రాస్తూ పోవడం ఇష్టంలేకపోయినా, మహతి సమీక్షలోవున్న పరిమితుల దృష్ట్యా ఇది వ్రాయవలసి వస్తూంది.

మహతి వ్యాస సంపుటిలో నూరుకుపైగా వున్న వ్యాసాలలో శ్రీ రమణారెడ్డిగారి దొకటి. కనక ఆ సమీక్షలో వారి వ్యాసంమీద నా అభిప్రాయం ఇవ్వగలిగేనేగాని, దానిని సమర్థించుకోగల కారణాలు చూపలేకపోయేను, విస్తరభీతితో, ఆ లోపాన్ని సవరించుకొనే అవకాశం కలిగించిన మిత్రులు శ్రీ రమణారెడ్డికి ధన్యవాదాలు.

వారు తమ సహజ ధోరణిలో వ్రాసిన నిందా పూర్వకాలయిన అప్రస్తుత విషయాలతో నాకు పని లేదు తమ వ్యాస క్రమంలో మార్క్సిజం గురించి వ్రాసినదిగా సాభిమానంగా చెప్పకొన్న వాక్యమే మనకు చర్చనీయం. అదే తీసుకొంటాను.

'మార్క్సిజం ఆధునిక భావ చేతనలో ఒక ప్రధానమైన అంశం. వర్గాలు వాటి మధ్య ఘర్షణ ఉన్నంతకాలం మార్క్సిజానికి కాలదోషం పట్టదు.' (మహతి—పుట 76)—అంటారు వారు.

బాగుంది. శ్రామికవర్గ విప్లవం వచ్చి, శ్రామిక వర్గ నియంతృత్వం ఏర్పడి, సోషలిజాన్ని నెల కొల్పుతుందనీ, అది కమ్యూనిజం దశకు అభివృద్ధిపొంది వర్గరహిత సమాజం ఏర్పడుతుందనీ మార్క్సిజం లక్షిస్తూంది. మానవ సమాజం అక్కడ అంతరించదు ఇంకా సాగుతుంది. కాని, ఆ దశలో మార్క్సిజంయొక్క ప్రమేయం వుండదనీ, దానికి కాలదోషం పడుతుందనీ శ్రీ రమణారెడ్డిగారి అవగాహన. అంటే మార్క్సిజం వర్గ సమాజానికి మాత్రమే పరిమితమైన శాస్త్రం అనుకోవాలి. శస్త్రం సరేసరి !

అయితే మార్క్సు, ఏంగిల్సులు గతి తర్క సూత్రాలను నిర్వచించి, వానిని మానవ సమాజ చరిత్రకు సమన్వయపరచి చూపినప్పుడుగాని, లెనిన్ మొదలైనవారు సమాజ ప్రగతిలో వచ్చిన పరిణామాలకు అనుగుణంగా ఆ సిద్ధాంతాలను పరిపుష్టం చేసినప్పుడుగాని తమ శ్రమ అంతా వర్గసమాజ పరిస్థితులకే పరిమితమనే అభిప్రాయంతో లేరు.

## మార్క్సిజం సిద్ధాంతాలు

ఇవి మూడు : విరుద్ధాంశాల ఏకత్వస్థితీ, నిరంతర ఘర్షణా; పరిమాణాత్మకములయిన క్రమ పరివర్తనలనుంచి గుణాత్మకమూ, మూలగతమూనైన మార్పు; నిరాకృత స్థితినికూడా తోసిపుచ్చి శంఖావర్తరూపంలో ఉన్నతస్థాయి నందుకోడం.

ఈ సూత్రాలను గతితర్క సూత్రాలంటున్నాం. ఈ సూత్రాలను మానవ చరిత్రకు మార్క్సు సమన్వయపరచి చూపేరు. దానిని చారిత్రక భౌతిక వాదం అంటున్నారు.

ఈ సూత్రాలు రూపొందించబడినాక ప్రకృతినీ, సమాజాన్నీ అర్థం చేసుకోడం సులభమయింది. అంతవరకు క్రమహీనంగా, అస్తవ్యస్తంగా, గందరగోళంగా వున్న మానవ సమాజ చరిత్రలో అనుస్యూతంగా వున్న సూత్రం దొరికింది. ప్రకృతీ, మానవ సమాజం, చరిత్రా నిర్నిరోధ్యమైన ఒక

గతి క్రమంలో సాగుతున్నాయని తెలిసింది. ఆ క్రమాన్ని ఎల్లా అర్థం చేసుకోవాలో అవగత మయింది.

సమాజగతిక్రమ సూత్రా లర్థం అయ్యేక మానవుడు ఆ గతిక్రమాన్ని త్వరితపరిచేందుకు పూను కొంటాడు. ఆ పూనికలో అతనికి మార్క్సిజం మార్గదర్శక సూత్రంగా వుంటుంది. 'మార్క్సిజం ఏక కాలంలో శాస్త్రమూ, శస్త్రమూ కాగలుగుతుం' దని శ్రీ రమణారెడ్డిగారు చెప్పిన వాక్యం అసంబద్ధ మేం కాదు. ఆ 'శస్త్రం' ప్రసక్తి వచ్చేది ఇక్కడ. అయితే మిత్రులు తమ వుత్సాహంలో ఒకటి మరిచి పోకూడదు. ప్రతి వస్తువులోనూ మంచి, చెడ్డ (పర స్పర విరుద్ధ) లక్షణా లున్నాయనేది గతి తర్క సూత్రాలలో ఒకటి. శస్త్రానికీ వున్నాయి. అది ఆత్మ రక్షణకూ, ఆత్మహత్యకూ, ప్రాణం రక్షించడానికీ, తీయడానికీ కూడ సమర్థం. మన నేర్పు, వుపయో గించగల శక్తి పట్టి ఆయా లక్షణాలు వ్యక్త మవుతాయి.

మార్క్సిస్టు సూత్రాల్ని సావధానంగా చూస్తే అవి వర్గ సమాజానికి మాత్రమే పరిమితాలు కావని అర్థం చేసుకోగలం. కాని, మార్క్సిస్టు సిద్ధాంతా నికీ, ఆచరణకూ కూడ భిన్నమైన విధంగా శ్రీ రెడ్డి గారు 'వర్గాలూ వాని మధ్య ఘర్షణ వున్నంతకాలం మార్క్సిజానికి కాలదోషం పట్టదు' అన్న అభిప్రాయా నికి ఎందుకు వచ్చేరు? గట్టి కారణమే వుంది.'

ఈ సమాధాన వ్యాసంలోనే వారు 'సాయుధ ప్రజా పోరాట' మార్గమే మార్క్సిజం నిర్దేశించినట్లు వ్రాసేరు. వీరు వ్రాసిన 'ఎర్ర పిడికిలి'లో, ఇతరేతర వ్యాసాలలో ఆ నినాదం ప్రతిధ్వనిస్తూంటుంది. 'కపా లాలతో కందుక క్రీడలాడగల కఠినత, నెత్తుటితో అత్తరు స్నానంచేసే క్రౌర్యపరత' 'యునతకుండా లవేది వీరి అభిలాష (ఎర్ర పిడికిలి పుట 50.)

మార్క్సిజం కేవల సాయుధ పోరాటాన్నీ, కపాలాలతో కందుక క్రీడల్నీ, నెత్తుటితో అత్తరు స్నానాల్నీ బోధిస్తూందన్నప్పుడు వర్గ సమాజంలోనే వీనికి గురిచేయవలసిన వర్గం—శత్రువర్గంవుంటుంది. వర్గరహిత సమాజం ఏర్పడ్డాక ఎవరిమీద సాయుధ పోరాటం? ఎవరి కపాలాలతో కందుక క్రీడలు? ఎవరి రక్తంలో అత్తరు స్నానం? ఈ కసికి పాత్ర మయ్యే శత్రువర్గం వుండదే. పెద్దచిక్కు వచ్చి పడింది. మిత్రులు రమణారెడ్డి గారికి కవకవర్గ సమాజం అంతరించడంతో మార్క్సిజానికి అవసరం తీరిపోతుందన్నారు.

ఎంతో మమకారం పెంచుకొన్న ఆ నినాదాల్ని వదలలేక పోయారు. కనక మార్క్సిజాన్నే వది లేసేరు. అదీ వారి స్థితి.

ఇది ఇంతతో పూర్తి కాలేదు.

1936 రోజుల్లో కమ్యూనిస్టులు (ఆ నాటికి మార్క్సిజాని కింకెవ్వరూ cliam పడెయ్యలేదు) హింసావాదులని, రక్తపిపాసులని, కుత్తుక లుత్త రించడం వారి creed అని వ్యతిరేకులు నిందించేవారు మార్క్సిజం పరమోన్నత మానవత్వ సమర్థకమనీ, హింస అహింసలు సాధన మాత్రలేగాని దానిలో ఏ ఒక్క దానినీ తాము creed గా ఒప్పుకోమనీ కమ్యూ నిస్టుల వాదం.

ఈ నాడు తామే మార్క్స్ సిద్ధాంతాలకు అసలయిన వారసులమన్నట్లు మాట్లాడుతున్న శ్రీ రమణారెడ్డిగారు మార్క్సిజానికి శత్రువులైన వారి కవి సుబువుచేసి పెడుతున్నారు. ప్రజా ప్రదర్శనలూ, వూరేగింపులూ, సమ్మెలూ మొద లైనవి జరిగేటప్పుడు వానితో చేరి కొందరు తమ తీవ్రోత్సాహాన్ని కనబరిచేందుకూ, నిరూపించుకొనేం దుకూ జనాన్ని రెచ్చగొట్టడం, రాళ్లు రప్పలు విస రడం వంటి 'విప్లవ' కార్యాలకు పూనుకొంటారు. ఉద్యమాన్ని పక్కదారులకు పట్టించి, మనం తయా రుగా లేని సమయంతో శత్రువు మన మీద దెబ్బ తీసి అణచివేసేందుకు అవకాశం కలిగిస్తారు. అల్లాంటి వారంతా 'ఏజంట్ ప్రొవొకేటర్లే' కానక్కర్లేదు. విప్లవోత్సాహపరులే చేసినా పర్యవసానం ఒక్కటే.

మిత్రులు రమణారెడ్డిగారు విప్లవోత్సాహంలో తాము పలికే నినాదాల విసురుకు కొట్టుకుపోయి

మార్క్సిజానికి తప్పు వ్యాఖ్య చేస్తున్నారు. దానిని నిరాకరిస్తున్నారు.

ఇంక వారి సమాధానం ఉత్తరభాగం చూస్తే వారు 'లే' కవులమీద చూపే సానుభూతిని అనుమానించవలసి వస్తోంది.

ఏమంటే పీఠికలోనే శ్రీ శ్రీ అంతవారు ఈ కవితలలో కవిత్వాంశకన్న వస్తువుకు ప్రాధాన్యం వున్నదన్నట్లు చెప్తుంటే నేను కవిత్వాంశను రాపాడించనా? అన్యాయం లేనిదాన్ని గురించి చర్చెందుకు?

ఆత్మ విమర్శకూ, ఆత్మ పరిశీలనకూ తోడ్పడడం నా సమీక్ష లక్ష్యం అన్నా. అది సానుభూతి లేకపోవడమా? చిత్రమైన ఆలోచన.

సోసీ రమణారెడ్డిగారు చదువుల గురించి, ప్రణాళిక గురించి, ఐక్య సంఘటన గురించి లే కవుల అభిప్రాయాలు ఆత్మ విఘాతకాలుగా వున్నాయన్న నా వివరణను వారెక్కడా కాదనలేదు. పైగా, వేరే సంభాషణలలో ఆ విమర్శ ఆలోచించవలసిందేనన్నట్లు ఎరుగుదును. ప్రైవేట్ చర్చలిక్కడ అనవసరం. మిత్రులు రమణారెడ్డిగారు వ్రాసిన ఈ సమాధానమే తీసుకొందాం.

నక్సల్బరీ వుద్యమాన్ని పేర్కొంటూ శ్రీ రమణారెడ్డి 'విప్లవం మొదలై అయిదేళ్లయింది....అదింకా ప్రారంభదశలో వుంది....దీర్ఘకాలికమైన సాయుధ ప్రజా పోరాటం ఇది'—అన్నారు.

వారి వుద్దేశం ఏమిటి?

నక్సల్బరీ వుద్యమం రైతాంగంలోవున్న అసంతృప్తిని, వారి ఆశలనూ, ఆశయాలనూ విస్ఫోటనరూపంలో కనబరచింది. ఇల్లాంటి విస్ఫోటనలు అనేక రూపాలలో చరిత్ర తెలిసినప్పటినుంచీ వస్తున్నాయి. గత పాతిక ముప్ఫయ్యేళ్ల లోపున ఆ విధంగా వచ్చిన 'తేభాగా' వుద్యమం తెలంగాణా రైతాంగం తిరుగుబాటూ చాలా ప్రసిద్ధికెక్కాయి.

ఆ చరిత్రను తుడిచివేసి, నక్సల్బరీ వుద్యమాన్ని చరిత్ర హీనం చెయ్యడం ఆ వుద్యమానికే అప్రతిష్ఠ అనే మాట అటుంచుదాం. చరిత్ర పాఠాల అనుభవాలను నిరాకరించి, దానికి అపకారం చెయ్యడమే అవుతుంది. మార్క్సిజాన్ని శస్త్రంగా వుపయోగించడం అంటే ఇల్లా కాదు. ఇది ఆత్మహత్యకు దారి గాని.

రెండోది—భారతదేశం అన్ని రాష్ట్రాలలోనూ ప్రజలు తమ పరిస్థితులు బాగుపరచుకొనేందుకూ, ఉన్నత సోషలిస్టు సమాజ నిర్మాణంకోసమూ పోరాటాలు జరుపుతున్నారు. వానిలో నక్సల్బరీ వుద్యమం ఒక భాగం.

ప్రపంచం మొత్తంమీద ప్రజానీకం విముక్తి కోసం, సోషలిజం—కమ్యూనిజంకోసం జరుపుతున్న పోరాటాలలో మన దేశ ప్రజలది అంతర్భాగం.

ఈ విధంగా నక్సల్బరీ వుద్యమానికి జాతీయ, అంతర్జాతీయ ప్రజా పోరాటాలలో వున్న అవినాభావ సంబంధాన్ని నిరాకరించడం 'లే' కవుల కవితలలో నాకు కనబడలేదు. పైగా పీఠికలో శ్రీ శ్రీ 'ధనస్వామ్య వ్యవస్థ మరణ వేదన పడుతున్నదేగాని ఇంకా చచ్చిపోలేద'నీ, మన ప్రభుత్వం...ఉన్న అధికారాన్ని నిలుపుకో చూస్తున్నద'నీ వ్రాస్తూ 'లే' కవుల ఆలోచనలకు ప్రపంచ రాజకీయాలతోనూ, దేశం మొత్తం మీద ప్రజల పోరాటాలతోనూ గల సంబంధాన్ని చెప్ప ప్రయత్నించేరు.

అందుచేతనే 'లే' కవులమీద శ్రీ రమణారెడ్డిగారు చూపుతున్న సానుభూతిని అనుమానించాలనడం !

ఇంక ఒక్క మాట, 'మావో ఆలోచనా విధానం మాత్రమే మార్క్సిజం' అనే విషయంలో శ్రీ రమణారెడ్డిగారి అభిప్రాయాలూ, నా అభిప్రాయాలూ ఏకీభవించవు. అయినా 'నా అభిప్రాయాలతో ఏకీభవించని వారంతా నా శత్రువులే' అనుకోలేను. మిత్రులు రమణారెడ్డిగారనుకుంటారు. సంస్కార వైవిధ్యం! అందుకు నేను వారిని నిందించను.

—'అవంతి'

# గ్రంథవిమర్శలు

## శ్రీ పర్వత పురాణము

తెలుగుదేశము త్రిలింగ క్షేత్రము. శ్రీశైలము దాక్షారామము, కాళేశ్వరము—అను నీ మూడు క్షేత్రములలో ఆదియైన శ్రీ శైలక్షేత్ర మాహాత్మ్యమును తెలుపునది శ్రీ పర్వత పురాణము — అందువలననే 'దీనికి 'శ్రీశైల ఖండము' అను నామాంతరము గలదు.

శ్రీ పర్వత పురాణమను నీ ప్రబంధమును రచించిన కవి నాగులపాటి శేషనాథుడు. ఈతడు రాయల యుగమునకు ముందువాడైనను, నీతడు కవుల చరిత్ర కెక్కినను, ఈతని కృతి సాహిత్య లోకమున వ్యాప్తిగాలేదు. వాఙ్మయ పరిశోధకులును నీ గ్రంథము నంతగా నెఱుగరు.

ఇట్టి సందర్భములో నీ గ్రంథమును ప్రచురించి ఆంధ్ర లోకమున కందజేసిన ప్రకాశకులగు— జ్యూపిటర్ బుక్ హౌస్ (గుంటూరు) వారభినందనీయులు.

ప్రచురణ కర్తలిట్టి ప్రాచీన కావ్యమును ప్రకటించునప్పుడీ కావ్యోత్కర్షను విశదీకరించు, విపుల పీఠికతో దీనిని వెలయింపవలసి యుండెను. వారట్లు చేయలేదు సరిగదా— 'విజ్ఞాపనము' అను పేరితో రెండు పుటలీ గ్రంథమునుగూర్చి కవిని గూర్చి వ్రాసియున్నారు. అందైన నొక పుటక్షేత్ర ప్రశంసయే.

పూర్వకవికృత ప్రబంధములను ముద్రించునపుడు ప్రబంధము, తాళపత్ర మాతృకనుండి వ్రాయబడిన ప్రతినిబట్టి ముద్రితమైనదో, లేక, పూర్వముద్రిత ప్రతిసాహాయ్యమున ముద్రితమైనదో తెలుపవలసిన బాధ్యత ప్రచురణ కర్తలకు గలదు. కాని ప్రస్తుత ప్రచురణ కర్తలీ బాధ్యతను గుర్తించినట్లు కావరాదు—ఆ పైగా వారిట్లు వ్రాసినారు. 'శ్రీ పర్వత పురాణమింతకాలము అముద్రితమై యుండుటచే మేము దీనిని భక్తిశ్రద్ధలతో ముద్రించి ఆంధ్ర మహాజనుల కరకమలములందుంచుచున్నాము. శ్రద్ధాభక్తులతో లోకము దీనిని స్వీకరించుగాక.'

పై వాక్యములలో 'శ్రీ పర్వత పురాణ మింత కాలము ముద్రితము అను మాట సుతరాము అసంగతము. ఈ శ్రీ పర్వత పురాణము—

శ్రీశైల దేవస్థానమువారు ప్రచురించిన 'శ్రీశైల ప్రభ' అను మాస పత్రికయందు (1966–1968) ప్రతి నెల ధారావాహికగా ముద్రితమై పూర్తియైనది. ఇప్పుడు ప్రకటితమైన గ్రంథము తూ చా తప్పక— శ్రీశైల ప్రభలో ప్రకటితమైనదే కాని వేఱు కాదు. అట్టిచో ప్రకాశకులు తమ విజ్ఞాపనములో నీ విషయమెందులకు లోకమున వెల్లడింపలేదో దురూహ్యముగా మున్నది.

శ్రీశైల దేవస్థానము ప్రభుత్వ సంస్థ—అట్టి ప్రభుత్వ సంస్థ పక్షమున ప్రకటితమైన పత్రికలో వెలువడిన గ్రంథమును, శ్రీశైల దేవస్థానమువారే స్వయముగా ప్రకటింపవలసియుండెను. వా రట్లేందులకు చేయలేదో, ఆ కారణము మనకు తెలియదు. ఒకవేళ శ్రీశైల దేవస్థానమువారే హేతువుచేతనో ప్రకటింపక, ప్రస్తుత ప్రకాశకులకు గ్రంథ రూపమున వెలువరించుట కనుజ్ఞ యిచ్చిన—ప్రకాశకులా యనుజ్ఞను—నీ విజ్ఞాపనముననో, లేక వేఱుగానో, ముద్రించి పాఠక లోకమునకు తెలియుపఱచవలసి యుండెను. కాని ప్రకాశకు లట్లును చేయలేదు. ఇందువలన నీ గ్రంథ ప్రచురణ సందేహమున కవకాశమిచ్చుచున్నది. ప్రకాశకులు సందేహ నివారణ మొనర్తురు గాక.

## పూర్వ ముద్రణము

ప్రకాశకులు పరిశీలింపలేదు గాని — శ్రీశైల ప్రభలో ప్రకటింపబడుటకు పూర్వము చాలాకాలము క్రిందటనే—యిది ముద్రితమైనది. దాని ముఖ పత్ర మిది.

శ్రీ పర్వత పురాణము
అను
శ్రీశైల ఖండము
అష్టభాషా కవితా విశారదులగు
శ్రీ నాగులూటి శేషనాధార్య ప్రణీతము
ఇది
బొగ్గారపు చెన్నయగారిచే
శైవరత్నాకర ముద్రాక్షరశాలలో
ముద్రింపబడినది
మదరాసు
1888.

అనగా శ్రీశైల ప్రభలో ప్రకటితమగుట కెనుబదేండ్లు ముందుగానే ముద్రితమైనది.

## గ్రంథ పరిష్కరణము

పై విషయము లెటులున్నను— ఏదో ఒక ప్రాచీన ప్రబంధము వెలుగులోనికి వచ్చినది గదాయని సంతసింతమన్న నదియు సమకూడలేదు—3 వ పుట కవితా ప్రశంసలో, పూర్వ ముద్రణముగనున్న యీ క్రింది పద్యములేదు.

శా. చేతశ్శుక్తిక యందునిల్చి, కళలం
జేకూరి శాస్త్రోదక
వ్రాతంబక్షరమూర్తి మౌక్తికములై
వర్ధిల్లుడున్ సత్ప్రభు
ఖ్యాతోపేత గుణ ప్రయుక్త సద లం
కారాంగ హారాళిగా
రీతిన్ సత్కవిగూర్ప నేర్చును బుధ
శ్రేణీశాగ్రంబునన్

ఇక నిందు స్థాలముగా గానవచ్చు యతి ప్రాసగణ భంగములను జూడుడు.

## యతిభంగములు

| పుట[1] | పంక్తి | |
|---|---|---|
| 31 | 5 | 'సి వింక గణాళిలోన నొక లెక్కనుగా' |
| 105 | 11 | భవత్యోప చారుఁడై వెరు గును–నైతిని |
| 107 | 12 | గుంధిల్లు బిల్వభూజంబు క్రింద |
| 130 | 17 | జిహ్వలము లేక మర్దింతు విఘ్నములను |
| 152 | 23 | గనుగొని వీరాగ్రచణ్యుండు |
| 160 | 2 | శ్రీగిరితాపన జనభాస్వరమని |
| 161 | 5 | కు కలాఘంబుద చం సహారమని |
| 145 | 12 | నిత్యాత్మక కదళీ తపోధన వరుల్ షట్చక్ర పారంగతుల్ |

## ప్రాస భంగములు

పుట 131. చివరి పద్యము.

ఉ. పొందుచు బుగ్గలింపుచు
నభోగతి దాటుచు మీాటి పాఱుచున్
గ్రోఁగుచు నావులింపుచును
మూల్గుచు మీానము లోరగించి తా
నఁగము సాఁచి నిల్చి యలి కాగ్రము
నుక్కడ వార మార్చుచున్
ముంగల జిహ్వ సాఁగ నిడి
మూతులు నాకుచు హత్తరింపుచున్

పుట 148. 3 వ పద్యము.

క. తెలిసిరును తలిరాకును
బరి క్రొవ్విరితేనె దోఁగుపొడి నెత్తావుల్

1. పద్యములకు సంఖ్యలు లేనందున పుట సంఖ్య యీాయబడినది. పద్యములకు సంఖ్యలు లేవు. అంతేకాదు క. చ. ఉ. సీ. మ. శా. మున్నగు ఛంద స్సంజ్ఞలుకూడలేవు.

చిలికింప కన్ను తెమ్మెర
లలరులపైఁ దేటి దాట లావిన సరసిన్.

ఇందు ప్రాస భంగము, రెండవ పాదమున యతి భంగము గలవు.

## గణ భంగములు

పుట 145. 4 వ పద్యము.

కందము 4 వ పాదము.

'ద్రాక్షామాకందకుంద తరు భవనముల్'

,, 148. 2 వ పద్యము.

కందము 3 వ పాదము

'దారక తత్త్వ మహత్వముచే'

,, 151. 5 వ పద్యము శార్దూలము 4 వ పాదము.

భీరజ్ఞాన కళా కళాపముల
జృభించున్ ప్రతాపోన్నతిన్

,, 154. 3 వ పద్యము గీతము మొదటి పాదము.

సాధకుం డవటఁ గల్పోక్తి జపము చేసి

,, 157. 4 వ పద్యము సీసము మొదటి పాదము.

'శ్రీ గిరిపై జన్మశేణుల లీలా వి
రాంబు లశ్వమేధా ధ్వరములు'
అందే—3 వ పాదము .....యంబి
కాధీశు సమర్పణములు చేయు.

స్థాలీపులాక న్యాయమున కొన్నిమాత్రమే చూపితిని.

## ముద్రిణ దోషములు

పుట 105 మోహినియమ జగఁబును చూచుట.

ఈ శీర్షిక క్రింద పద్యమున

చ. ఎదురుగ మోహినీ గజముహెచ్చి పద్యమున గజము—అని యుండగా విూద జగము.

పుట 145 18 పం.

వటువులతో వేదభాష్య వాక్యర్థంబుల్
వాక్యార్థంబుల్ అని యుండవలెను.
అదే పుట 24 పం.

ఏణీ కంధర పహారమిచ్చిన సిదపన్
ఏణీ కంధరువహార మిచ్చిన సిదపన్

అని యుండవలెను. మచ్చునకు కొన్ని మాత్రమే చూపితిని.

## కావ్యకర్త శేషనాథుడు

విజ్ఞాపనమున సీతవిగూర్చి యిట్లు కలదు.

'క్రీ. శ. 1560 ప్రాంతముల వర్ధిల్లిన శ్రీ నాగలూటి శేషాచార్యకవి ఈ మహాత్మ్య గ్రంథ మును మనోహరముగా రచించినాడు. పెదపాటి జగ్గన్న ప్రబంధ రత్నాకరములో నీ కవి పద్యము లుదాహరించి నాడు. భద్రకవి, లింగకవి ఈతనిని పూర్వకవిగా స్తుతించినారు.'

ఈ వాక్యములన్నియు నసంబద్ధములు.

(1) ఈతడు క్రీ. శ. 1560 ప్రాంతము వాడుకాడు. ఇతడు క్రీ. శ. 1500 లకు ముందు వాడని యిప్పటికి ముప్పది యేడేండ్ల క్రిందట 'నాగు లూటి శేషనాథుడు' అను నా వ్యాసమున నిర్ణయించి యున్నాను.[2]

(2) ప్రబంధ రత్నాకరములో పెదపాటి జగ్గనసీకవి పద్యము లుదాహరించినాడు—అని బహు వచనము గలదు. అది తప్పు— పెదపాటి జగ్గన యుదా హరించినది ఒక్కపద్యము మాత్రమే—ఆ పద్యమిది:

ఉ. తత్తఱపాటులో నిరులు దద్దయు
మాప్పఁగఁ జాలు కన్నును
వ్రేత్తున వేల్పు మూకలకు
విందులు వెట్టెడు కన్ను దమ్మియున్
మొత్తము వత్తలచ్చికవి
ముమ్మఁగఁ బుట్టిన ముద్దుపట్టిమే
నెత్తిలఁజూచు కన్నుగల
యొట్టిడి వేలుపు గొల్తు విచ్చలున్
(ప్రబంధ రత్నావళి 135 పుట.)

---

2. భారతి జూన్—1938.

ఈ పద్య మీ గ్రంథమున నవతారికలో 5 వ పద్యము.

(3) భద్రకవి లింగకవి ఈతని పూర్వకవిగా స్తుతించినారు. ఇది తప్పే - భద్రకవి—లింగకవి యను కవు లిరువురు కారు. భద్రకవి— లింగకవియను నత డొక్కడే. అతడు సారంగపాణి కథా రచయితగ ప్రసిద్ధుడు. దీనినిబట్టి ప్రకాశకులు కేవలం తెలిపినవి విమర్శించక యట్లే విజ్ఞాపనము చేర్చినట్లు తోచుచున్నది.

## శ్రీ పర్వత పురాణ కావ్య విశిష్టత

శ్రీ పర్వత పురాణము ప్రశస్తతరమైన కృతి. కమనీయమైన కవితా రచన గలది. అంతేగాక నేకాక ప్రత్యేకతకూడ దీనికి గలదు. ఇది పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రయందలి పర్వత ప్రకరణము ద్విపదకు పద్యానువాదము—మచ్చుకై క్రింది వచన ను ద్విపదలు చూడుడు.

పుట. 14 వ. కుంభసంభవునిచేతఁ జర్చింప బడిన వింధ్యాద్రిదర్పంబెంత, గోవిందునిచేత నెత్తంగ బడిన మందరంబు సుందరంబెంత, రావణాసురో త్పాటితంబైన కైలాసంబు విలాసంబెంత, జలజాప్త మరీచికలకుం గాక యనలు హరించు హిమవత్పర్వతంబు గర్వంబెంత, త్రిపురంబైన గర్భంబుననా విర్భవించిన మిత్ర తేజం బణగించు వస్తాచలము శస్తంబెంత, చందన సందోహంబు దక్కదక్కిన వృక్షంబుల నోలయని మలయ భూధరంబు మహత్త్వంబెంత'—

పండితారాధ్యచరిత్ర—ద్వి—పర్వత ప్రకరణము.

ద్వి. భంగించి కుంభసంభవుడు ముష్టిక్కి
గ్రుంగిన వింధ్యాద్రి గురుత దానెంత
తూలి రావణుని చేతులమూపబడిన
కైలాస పర్వత గాంభీర్యమెంత
కమలాప్తరుచులకాకకు వశియించు
హిమవన్నగంబు మహిమ్మత యెంత
తలప చందనము నేదక్క కాష్ఠంబు
గలుగని మలయనగంబు పెంపెంత—
కడుపు పొచ్చిన మిత్రు ఘనతన తేజ
మడగించు నస్తాద్రియాధిక్యమెంత'

శ్రీనాథమహాకవి
పండితారాధ్య చరిత్ర
ద్విపదానువాదము

శేషనాథునికన్న ముందు శ్రీనాథమహాకవి పండితారాధ్య చరిత్రము పద్యకావ్యముగా రచియించి నట్లు నైషధమున గలదు.

క. జగము నుతింపఁగఁ జెప్పితి
ప్రెగడయ్యకు నాయమంగుః బెద్దనకుఁ గృతుల్
నిగమార్థ సార సంగ్రహ
మగునయ్యారాధ్య చరిత మాదిగఁ బెక్కుల్
(1—26)

ఇచట ఆరాధ్య చరిత్రయనగా పండితారాధ్య చరిత్ర. శ్రీనాథుడు తన పద్యకృతిలో పాల్కురికి సోమనాథుని ద్విపదలనే యథాతథముగా పొదిగించినాడని పెదు పర్తి బసవన చెప్పినాడు. కాని శ్రీనాథుని పద్యకృతి లభ్యము కాలేదు. ఈ శేషనాథుని పర్వత పురాణము సావధానముగా బరిశీలించిన—నాతడు శ్రీనాథుని గ్రంథము ననుసరించినట్లు తోచుచున్నది.

పుట 13. సీ. పాతాళగంగా కబంధ వీచిచ్ఛటా
ఘూర్ణిత బ్రహ్మాండ గోళకంబు

విశ్వవిశ్వంభరా విర్భావ నిర్భర
మండల శ్రీ కర్ణ కుండలంబు
భాస్వత్ప్రాణేంధన పాషాణ వాలులో
జ్యోతిస్ఫుటి ప్రభా శోభితంబు
దీపిత త్రిభువన తీర్థముక్తాఫల
ప్రోద్భూత కారణ భువనరాశి

గీ. పారదా మృతకుండికా స్పర్శవేది
సర్వసంజీవనీ మహౌషధ వితాన
పుణ్యపావన కానవాద్భుత మహత్త్వ
పలద మహిమోన్నతంబు శ్రీపర్వతంబు.

ఈ సీసపద్యపు నడక అచ్చముగా శ్రీ నాథునిదే.

పుట 26. క. మలహరు గుడి గోమయమున
నలికిన మర్త్యుండు నలుకనట కస్తూరీ
మలయజ పంకము దివిష
జ్జల జానుతలోచనా కుచద్వయ పీఠిన్

ఇట్టి భావన శ్రీ నాథుని జన్మ హక్కు.

కావ్యమున—'అఘమర్షణ స్నానము' — 'వడకు గుబ్బలి రావవారు' మొదలగు పదబంధములను బట్టి చూడగా శేషనాథునికి నేడు లభ్యము కాని శ్రీనాథుని పండితారాధ్య చరిత్రము లభించియుండెనా అను సందేహము గలుగుచున్నది.

శేషనాథుని శ్రీ పర్వత పురాణము—సుపరిష్కృతముగా సంశోధిత ముద్రణమున్న శ్రీనాథుని పండితారాధ్య చరిత్ర కృతిలోని కొంత భాగమైన లభ్యమగు వని చెప్పవచ్చును. ప్రచురణ కర్త లట్టి—సంస్కరణ ముద్రణమును విపుల పీఠికా వ్యాఖ్యానములతో వెల యించిన శ్రీశైల క్షేత్ర మాహాత్మ్య మాంధ్రులకు కరతలామలక మగును.

*

## మైలార దేవ

తెలుగు సాహిత్యమున పౌరాణిక దేవతలను గూర్చియేగాని, చారిత్రక కాలమునాటి దేవతలను గూర్చి పరిశ్రమ జరుగలేదు. అట్టి చారిత్రక కాలమున ప్రసిద్ధి కెక్కిన దేవతలలో నొకడైన మైలార దేవునిగూర్చిన పరిశోధన గ్రంథమిది మైలారదేవ.

ప్రథమముగానీ మైలారదేవునిగూర్చి పరిచయము చేసినది క్రీడాభిరామము—అందోరుగంటిని నెలకొనియున్న 'శనివారసిద్ధి' సజ్జన పారిజాతము నైన మైలారుదేవుని ఉత్సవ విశేషములలో—మైలారి వీరభటులు శెట్టి సాహస కృత్యములు చేయువారో—యిట్లు వర్ణితమైనది.

సీ. అవఅవ ఖండునెఱ్ఱని చంద్రమల్లెల
చోద్యంపు గుండాలు చొచ్చువారు
కరవాఁడి యులఁగులఁ గనప పొత్తర్లలో
నుట్టిచేరులుగోసి యుఱుకువారు
గాలపుఁ గొంకిఁ గంకాళ చర్మము గ్రుచ్చి
ఉడువీథి నుయ్యెల లూఁగువారు
కటికి హొన్నాళంబు గండకత్తెర వట్టి
మిసిమింతులును గాక మ్రింగువారు

గీ. సందులను నారసంబులు సలుపువారు
యెడమ కుడిచేత నారతు లిచ్చువారు
సాహసము మూర్తిగొన్న సరణి వారు
ధీర హృదయులు మైలార వీరభటులు

కాకతీయుల రాజధానియైన ఓరుగంటియందే గాక, ఓరుగల్లు ప్రాంతముననున్న అయ్యనవోలులో నొక మైలార దేవాలయమున్నట్లు, రేచెర్ల వంశీయుడైన—అనపోతానాయని అయ్యనవోలు శాసనము తెలుపుచున్నది.

'శ్రీ సింగమనాయని అనపోతానాయనిం గారు, ఓరుగల్లు భువనగిరి, రాజుకొండ, సింగపురము మొదలైన తెనుంగుదేశ మా చంద్రతార ముత్తరోత్తరాభివృద్ధిగాను ధర్మరాజ్యము చేయుచును, దిగ్విజయ యాత్ర ప్రసంగానను అయ్యనవోలి తీర్థస్వామియైన మైలారదేవరను దర్శించి' ఈ శాసన కాలము క్రీ. శ. 1369.

పై వివరములను బట్టి మైలారదేవుడు—కాకతీయుల కాలమున—క్రైస్తవ శకము, పదమూడవ శతాబ్దమున—ప్రసిద్ధ దైవముగా నుండెనని తెలియుచున్నది.

ఈ 'మైలార' అను పదము కూడ—కాకతీయుల కాలము వెనుక—రెడ్డిరాజుల కాలమున—గన్పట్టుచున్నది. శ్రీనాథునికి దినవెచ్చ మొసగిన దాత పంట మైలారురెడ్డి.

ఇట్లున్నను మైలార శబ్దము క్రీ. శ. 1190 ప్రాంతమువాడైన పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలో కానవచ్చుచున్నది.[3]

ఈశ్వరుడు మాదిగవాని వేషము వేసికొని సూరసానమ్మ యను బ్రాహ్మణ భక్తురాలు లాతని-చర్చించినపు డగ్రహారములోని బ్రాహ్మణు లావెను చుట్టు ముట్టుటకు నితర బ్రాహ్మణులను పిలుచు సందర్భమున—

ఓరోరి మైలార, ఓరి యగ్గన్న
ఓరోరి కూచెన, ఓరోరి జన్న...
...... . ......... ....... ... ..
....................... . ...కేశ
భట్లును, మైలార భట్లుపాధ్యాయ
భట్లును.............. .........

అని మైలార నామము గానవచ్చుచున్నది. విశేషమేమనగా మైలారుడను దేవుని పేరు—బ్రహ్మణులు ధరించెడివారు.

వేములవాడ భీమకవి కాలమున — క్రీ. శ. 1160 మైలమ భీమన యను ప్రసిద్ధ సామంతరాజు కలడు. ఈ మైలమ-శబ్ద వ్యుత్పత్తి తెలియరాలేదు. 'మైలారమ్మ'—అను దేవతయే మైలమగా పరిణమించి యుండునని తలంచుచున్నాను. ఇంకను పరిశోధన చేయవలెను. దీనిని బట్టి క్రైస్తవ శకము పదవ శతాబ్దినుండి—మైలార దేవుడు పూజల నందుచున్నట్లు నిశ్చయింపవచ్చును.

ఈ గ్రంథమున మైలార దేవునిగూర్చియే గాక కాకతమ్మ— కాకతిశక్తి— ఎల్లారమ్మ— ఏకవీర మున్నగు శక్తి దేవతల విషయమై అనేకాద్భుతాంశములు వెల్లడి చేయబడినవి. కేవలము చారిత్రకముగనే గాక, శిల్పశాస్త్ర దృష్ట్యాపి, ఈ దేవతల పుట్టుపూర్వోత్తరములు—గవేషణము చేయుట ప్రశంసనీయమైనది.

ఈ కాలమున క్రోడీకరణ విధానమేతప్ప పరిశోధనలో మౌలికమైన మార్గము త్రొక్కినవారు వ్రేళ్లపై లెక్కపెట్టదగినవారు మాత్రమే. అట్టివారిలో పేర్కొనదగినవారు ప్రస్తుత గ్రంథకర్తలు శ్రీ జి. ఆర్. వర్మగారు. వీరిది నిర్నిద్ర పరిశ్రమ.

గోడే వేంకట జగ్గారావు—
గోడే నారాయణ గజపతి రావు

విశాఖపట్టణమున కడచిన శతాబ్దమున ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞాన సమన్వయము గావించిన జమీందారులు గోడే వంశీయులైన యిరువురనిగూర్చి యీ గ్రంథమున దెలుపబడుట యెంతయు నభినందింపదగినది. గోడే వేంకట జగ్గారావుగారు క్రీ. శ. 1846 లోనే విశాఖపట్టణమున — నక్షత్ర శోధనశాల (Observatory) స్థాపించిన విజ్ఞానవేత్త. ఆంగ్ల భాషలో రచనచేసిన ప్రథమ భారతీయులు తెలుగు వారిరువురిలో జగ్గారావు గారొకరు. ఖగోళశాస్త్రము విషయమై వ్రాసిన వ్యాసములు Madras Journal of literature & Science అను పత్రిక మొదటి సంపుటము. (క్రీ. శ. 1820) లో గలవు.

గోడే నారాయణ గజపతిరావుగారు హైందవ మత విద్వాంసులై హైందవ సంస్కృతిని పునరుద్ధరించినారు. వీరు కట్టించిన హిందూ పఠనమందిరము నేటికిని విశాఖపట్టణమున గలదు. వీరు గ్రంథ రచన చేసిరి. సాహిత్య ప్రియులు. తిరుపతి వేంకటకవులు—

'సంగర శక్తిలేదు, వ్యవసాయము
సేయుట సున్న, సంతలో
నంగడివైచి యమ్ముకొను టప్పటికన్న
హుళక్కి చక్కగా
బొంగు బుజాన వైచికొని
పోయెద మెక్కడికైన ముష్టికిం

3. పండితారాధ్య చరిత్ర—దీక్షా ప్రకరణము—సూరసానమ్మ కథ.

బుం గొనిపెట్టు మొక్కటి
యమోఘము మాకది దంతిరాణ్ణృపా'

అని చెప్పిన పద్యవిూతని గూర్చినదే.

దంతి రాణ్ణృపు డనగా నారాయణ గజపతిరాజు.

గోడేవారి సంస్కృతాంధ్ర భాషాసేవ అత్యంత ప్రశంసనీయమైనది. యావద్భారత వర్షమున ప్రథమమున అకారాదిగా సంస్కృత నిఘంటువును తయారు చేయించినది గోడే సూర్యప్రకాశరావుగారు.

ఇట్టి గోడే వంశీయులను గూర్చి గాని వారి వైజ్ఞానిక సాహిత్యసేవను గూర్చి గాని యీనాటి వారికి పరిచితము కాదు. వారిని గూర్చి ప్రత్యేకముగా వ్రాయ దగినంత గ్రంథ సామగ్రి యున్నది.

శ్రీ వర్మగారు గోడే వంశీయుల చరిత్ర వ్రాసి ఆంధ్ర లోకమున కర్పింతురు గాక—

* * *

## ఓరుగంటి చరిత్రము

'వరంగలు' అని నేడు వ్యవహారములోనున్న పట్టణము పూర్వకాలములో 'ఓరుగల్లు' అనునది. ఇది కాకతీయులకు రాజధానియై, వారి కాలమున మహావైభవముతో విరాజిల్లి ఆంధ్రదేశముననే గాక దక్షిణ భారతమున నొక ప్రసిద్ధి కెక్కిన నగరముగా నుండెడిది. ఓరుగల్లును గూర్చిన విపుల వర్ణన— ఏకామ్రనాథుని ప్రతాపచరిత్ర యందును, వల్లభ రాయని క్రీడాభిరామమునందును గలవు. తెలుగు సాహిత్యమున క్రీ. శ. 1250 నుండి ఓరుగల్లు ప్రస్తావన గలదు. అందు ఓరుగల్లు ఏకశిలా నగరముగా పేర్కొనబడినది. ఓరుగల్లునకు సంబంధించిన సంస్కృత శాసనములలో నిది—ఏకశిలా నగరము అనియే పేర్కొనబడినది.

ఓరుగంటి చరిత్ర—అను నీ గ్రంథమున— 128 పుటలు గలవు. 32 పుటల యనుబంధము లున్నవి. అయితే—ఈ 160 పుటలలోను—ఓరుగంటి చరిత్ర అను పేరు సార్థకము చేయు విషయ మొక్కటియు గానరాలేదు. చూడు డిందలి విషయములు—శీర్షికలు.

1. ఆధారములు.
2. చరిత్ర పూర్వ రంగము.
3. పూర్వ పోరాట ప్రయత్నములు.
4. ఇందులూరి అన్నయమంత్రి—కొలని రుద్ర దేవుడు.
5. ఓరుగంటి హద్దులు—సహరాజ్యములు.
6. కాపయ నాయకుడు—బహమనీ రాజ్యావతరణ.
7. బహమనీ సుల్తానులు—అమిత్ర చర్యలు.
8. తూర్పు కోస్తా—భక్తిరాజు వ్యవహారములు.
9. కాపయ నాయకుడు-రెడ్డిరాజులు.
10. కాపయ నాయకుడు—రాచకొండ ప్రభువులు.
11. అనైక్యత—దాని పరిణామములు.
12. విదేశీ దండయాత్రలు—కొన్ని ముఖ్యాంశములు.

పై శీర్షికలను బట్టి—యీ గ్రంథమున ఆంధ్ర దేశ చరిత్రయే యున్నది గాని—ఓరుగల్లును గూర్చి ప్రత్యేకముగా నేమియు లేదని వ్యక్తము కాకపోదు— ఓరుగంటి పరిహద్దులు సహరాజ్యములు — అన్న శీర్షికలో ఓరుగల్లు పట్టణమెప్పుడు నిర్మాణము గావింపబడినది? ఆ పట్టణ వివరమెట్టిది? కాకతీయులవెనుక నే యే రాజులు ఓరుగల్లు పాలించిరి? అన్న విషయము లేమియు లేవు—ఇంతేకాదు—తక్కిన శీర్షికలలోను—ఓరుగంటి చరిత్రకు సంబంధించిన మునునూరి ప్రోలయ, కాపనాయకులు—సింగమ నాయకుని విషయముదక్క తక్కిన వన్నియు ఓరుగంటికి సంబంధించినవిగావే కావు -

రెడ్డిరాజులలో మొదటివాడైన ప్రోలయవేమా రెడ్డి గూర్చి—42 నుండి 62—20 పుటలున్నవి— ఇట్లే—వీర కంపిలిరాయలు—అర్వీటి సోమరాజు హరి హరరాయలు బుక్కరాయలు అనువారలను గూర్చి— మఱి 14 పుటలున్నది—వీనికిని ఒరుగల్లు చరిత్రకు సంబంధమేమి?

ఇక అనుబంధమున—పిల్లలమఱి రేచెర్లరెడ్డి

సేనానుల వంశవృక్షము—అరౌటి రాజుల వృక్షము—రెడ్డిరాజుల వంశవృక్షము, విజయనగర భూపతులు—బహమనీ సుల్తానులు, బిరుదుగద్యము 20 పుటలలో నుదాహరింపబడినవి. వీనికి ఓరుగంటి చరిత్రతో నేమాత్రము సంబంధము లేదు—గ్రంథకర్తలు వీని నుదాహరించుటలో ప్రయోజనమేమియో దురూహ్యము—

ఈ గ్రంథమున కాకతీయ సామ్రాజ్య పతనానంతరమున ఓరుగల్లు—ముస్లిముల హస్తగతమైన వెనుక—ఆంధ్రదేశమున—ముసునూరి ప్రోలయ కాపయ నాయకుల మూలమున దేశమెట్లు స్వతంత్రత వహించినది తెలుపుటకు ప్రయత్నము కావింపబడినది. అందుచే నిది ఓరుగంటి ప్రత్యేక చరిత్రకాదు. ఈ స్వాతంత్ర్య సమరమున—ప్రోలయ వేమారెడ్డి—హరిహర రాయ బుక్కరాయలు—భాగస్వాములని — ఒక్క వాక్యములో చెప్పదగిన దానిని-పుటలకొద్దీ పెంచుటచే-ఓరుగంటిని గూర్చి వర్ణింపవలసిన విషయములన్నియు నిందు పూర్తిగా లోపించినవి—

## శాసనములు

గ్రంథకర్తలు తమ గ్రంథరచన కాధారముగా 14 శాసనములను పేర్కొన్నారు. వీనిలో ప్రోలయ నాయకుని విలస తామ్రశాసనము — పూర్తిగాను, కాపయ నాయకుని ప్రోలవర శాసనము-అని తల్లి కలుసచేరు శాసనము కొంత భాగమును అనుబంధమున నీయబడినవి. కాని యీ సందర్భమున ఓరుగంటి చరిత్రకే కాక, ఆంధ్రదేశ చరిత్రకు ముఖ్యమైన—

షితాబుఖాను—

వరంగల్లు శిలా శాసనము క్రీ. శ. 1504.

ప్రసక్తియే—ఈ చరిత్రలో గన్పట్టదు. ఇది యన్నింటికన్న చిత్రము!

వరంగలు కోటలోనున్న ఈ శాసనమును తొలుత గుర్తించి, దీని ప్రకటించుటకు పూను కొనిన కీర్తి. కీర్తిశేషులు కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణ రావుగారిది. దానిని పూర్తిచేయకుండ దివంగతు లగుటచే, డాక్టరు హీరానందశాస్త్రిగారిచే—సమగ్ర వ్యాఖ్య వ్రాయించి నిజాము ప్రభుత్వపు అర్కియాలజీ శాఖవారు—1932 లో ఆంగ్లమున దీనిని ప్రకటించిరి. విద్యా వయోవృద్ధులగు శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు—ఈ శాసనముతోపాటు—షితాబుఖాను - చరిత్రము—తెనుగున

షితాబుఖాను (చిత్తాపఖాను)
అను
సీతాపతిరాజు

అను పేరితో 1961 లో లక్ష్మణరాయ పరిశోధక మండలి (హైదరాబాదు) పక్షమున—ప్రకటించినారు. ఇందు ఓరుగల్లు ఏకశిలా నగరముగానే పేర్కొనబడినది.

శాసనమున పేర్కొనబడిన షితాబుఖాను సీతాపతిరాజు అను పేరుగల ఆంధ్రవీరుడు—ఆతడు—60,000 వేల మంది ధనుర్ధరులతో శ్రీ కృష్ణదేవరాయలు—ఓరుగల్లు జయింపకుండ—కాపాడినవాడు—కుతుబ్‌షాహీల కాలములో స్వతంత్రముగా ఓరుగల్లును పాలించినవాడు.

ఈ శాసనము క్రీ. శ. 1504 లో వేయించబడినది. ఇందు 36 శ్లోకములు గలవు. ఇందు చిత్తాపఖాను వంశము. ఏకశిలా నగరము నాక్రమించి పాలించిన విషయము—ఆతడెట్లు దేవబ్రాహ్మణ భక్తి గలిగి, ధర్మకార్యము లొనర్చెనన్న విషయములు వివరముగా చెప్పబడినది. ఆతడు మహాదాత—ఓరుగల్లు స్వయంభూదేవ లింగమును ప్రతి దినము నర్చించు మహాభక్తుడు—సీతాపతిరాజే, వరంగలు నాక్రమించిన తరువాత చిత్తాపఖానుడైనాడు—చిత్తాపఖానే షితాబుఖాను.

## ఏకశిలా నగరము

ఈ శాసనమున—ఓరుగల్లు ఏకశిలా నగరముగా పేర్కొనబడినదని తెలిపితిని. సంస్కృత శాసనము లన్నింటియందును—ఏకశిలా నగరమనియే గాని 'ఓరుగల్లు' అన్న పేరుండనే యుండదు.

ఇట్టి సందర్భమున—గీ ఓరుగంటి చరిత్ర 128 పుటలలోను ఎచ్చటనూ. ఏకశిలా నగరము అన్న పర్యాయపదమే వాడుక చేయబడలేదు—

తెలుగు సాహిత్యమున—బమ్మెరపోతన భాగవతమున ఓరుగల్లు అనాదానిని 'ఏకశిలానగరము' అనియే వ్యవహరించినాడు. కడప మండలమున—ఒంటిమెట్ట అను గ్రామముండుటచేతను అది ఓరుగల్లునకు పర్యాయపదముగా నుండుటచేతను, అరువదేండ్లక్రింద—బమ్మెరపోతన—ఓరుగల్లువాడా, ఒంటిమెట్టవాడా అను పెద్ద వివాదమాంధ్ర సాహిత్యమున చెలరేగినది—

కొలని గోపరాజు—తన సింహాసన ద్వాత్రింశకలో

ఉ. ఆకరనీతి శాస్త్రనిపుణుడై
గురువీడ్కోలు యేగెనంతటప్
గాకితమూలశక్తిగనిగా నొనరించిన
పైడిచట్టునా
నేక శిలాభిధానమున
నెన్నిక కెక్కి ధరిత్రిలోననే
పోకల బోనియట్టి సిరిపుట్టిన
యింటికి నోరుగంటికిన్ (8–150)

అని క్రీ. శ. 1440 ప్రాంతమున—ఏకశిలానగర మోరుగల్లేయని నిర్ధారణ చేసియున్నాడు—ఈ గ్రంథము ప్రకటింపబడిన తరువాత (1936) నీ వాదము పోయినది - కొలని గోపరాజు సమకాలికముగ వెలసిన క్రీడాభిరామములో—

'మండనమింటి వోపిన వో మన్మథుడేక శిలాపురంబులో' ననియు— 'ఓరుంగంటి పురంబు సౌధములపై నొప్పారెడిన్—' అనియు—నీరెండు పర్యాయపదములుగా జెప్పబడినవి—

ఏకశిలా నగరము మాటయటుండగా తెలుగు సాహిత్యమున—ఓరుగంటి ప్రస్తావన ఏమున్నది అను విషయమే యీ చరిత్రమున లేదు—చరిత్రకు శాసనముల తరువాత—సాహిత్యము — ప్రధాన సాధనమని చారిత్రకుల నిర్ణయము—

## చిత్రభారతము

ఇది చిత్తాపఖానుని మంత్రియగు—ఏనుములపల్లి పెద్దనామాత్యుని కంకితము చేయబడిన ప్రబంధము శతలేఖినీ సురత్రాణుడగు చరిగొండ ధర్మన్న విరచితము క్రీ. శ. 1504 ప్రాంతములలో ఓరుగల్లు ఎట్లుండెడిదో ఈ గ్రంథమున వర్ణింపబడినది—

సీ. అక్షయ క్ష్మాభారదక్ష దక్షిణ భుజా
కాక్షేయక క్షత్ర రక్షితంబు
కూటకోటీశాత కుంభ కుంభ ప్రభా
మండితాంభోజాప్త మండలంబు
గంధ సింధురదాన గంధాంధ మత్తమ
ధుంధయ ఝుంకార బంధురంబు
విశ్వవిశ్వంభరా వశ్యైశ్వర్యైశ్వర ప్ర
దాశ్వ రత్నవ్రాత శాశ్వతంబు
గీ. సంతతోత్సవతోషిత శంభులింగ
సమ్ముఖేందు శిలానంద చారుమంట
పస్థలీనృత్య చందనాపాదరణిత
నూపురంబగు నేక శిలాపురంబు— (1–10)

ఈ చిత్తభారతమున చిత్తాపఖానుని వర్ణన యెంత ఉదాత్తముగా నున్నదో చూడుడు—

సీ. అనువత్సరంబు బ్రాహ్మణులకు గోసహ
స్రములిచ్చు నృగనరేశ్వరుని రీతిఁ
గంధులకెనగఁ బాకాల చెర్వాదిగాఁ
జెఱువులు నిల్పు సగరుని రీతి
దీక్ష్యత్రపూతాపుడై దిగ్విజయంబు గా
వించు మాంధాతృ భూవిభునిలీల
దేవ భూదేవతార్థి శ్రేణి కగ్రహా
రములిచ్చు భార్గవరాము పగిది
గీ. నిందుశేఖర పాదారవింద యుగళ
భావనాపరుడంగనా పంచబాణు
డతుల ధైర్యాభిభూత హిమాచలుండు
మానభూపాల చిత్తాపఖాన విభుడు—

ఈచిత్ర భారతమేగాక, పైని నేను పేర్కొనిన సాహిత్య గ్రంథములేవియు ప్రస్తుత చరిత్రమువలేవు—ఇంకనూ నిందు చెప్పవలసిన విషయము అనేకము లున్ననూ గ్రంథవిస్తర భీతిచే విరమించితిని—ఇక నీ గ్రంథ ప్రయోజనము పాఠకలోకమే నిర్ణయింప గలదు—

శ్రీ పర్వత పురాణము: (రచయిత: శ్రీ నాగులాటి శేషనాచార్య కవి, వెల: 3 రూపాయలు, ప్రకాశకులు: జ్యూపిటర్ బుక్ హౌస్, అరండల్‌పేట, గుంటూరు—2.)

మైలారదేవ: (రచయిత: శ్రీ జి. ఆర్. వర్మ, వెల: పది రూపాయలు, ప్రకాశకులు: వర్మన్ పబ్లికేషన్స్, రిపోర్టర్‌వర్మ వీధి, తాడేపల్లిగూడెం.)

ఓరుగంటి చరిత్ర: (రచయిత: శ్రీ తేరాల సత్యనారాయణశర్మ), వెల: అయిదు రూపాయలు, ప్రకాశకులు: విజయభారతీ నిలయం, నల్గొండ.)

—శ్రీ సిడుదవోలు వేంకటరావు

## కవితా కదంబము

(శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మ, క్రౌన్ 235 పేజీలు—వెల రు 6/–ప్రాప్తిస్థానం:-మల్లవరపు ప్రచురణలు – 'ఇంద్రప్రస్థ'; ద్వారకానగర్; విశాఖపట్నం—4.)

విశ్వసుందరమ్మ—మాతృదేశారాధన తత్పరమైన కుటుంబములో పుట్టి పెట్టుటచే—'రక్తమ్ములో దేశభక్తి భావమ్ము ఉప్పెనగా పొంగ సుదేకమునను' (103 పేజి) అని ఆమె చెప్పిన రీతిగానే దేశభక్తి ఈమె కవనమున భాసిస్తున్నది. చివరి 'రాజకీయ సాంఘిక గీతావళి' గాంధీయుగ జాతీయోద్యమమున ప్రతి ఘట్టానికి వైతాళిక గీతంగా ఉన్నది. కాని, నేటి దేశ నైతికస్థితిని ఈమె చూచివుంటే, ఈమె మానసము ఎట్లా పొక్కిపొయ్యేదో. కాబట్టి ఈ గీతావళి ప్రయోజనం యిప్పుడు తీరిపోయినట్లున్నది.

ఈ రచయిత్రి భావశబలతయొక్క ఇంపుకు తగిన సుకుమారభాష—ధార రచనకు సొంపును గూర్చుచున్నవి. చక్కటి నుడికారము ఈమె సొమ్ము. ఈ సాధ్వి జీవిత వృంతము నడుమ త్రుంచివేయబడక పోయియుండిన, కవిత పరిపక్వమై అంగు లన్నిటిని చేకూర్చుకొనియుండును. ఇంగ్లండులో 'లేక్' కవు లనబడే వర్డ్స్‌వర్తు మొదలైన మహాకవుల వలెనే ఈమెకు ప్రకృతి సౌందర్యముపై మక్కువ ఎక్కువ. 'పరవశమును బొందజేయు ప్రకృతి సీమ లుండగ నిక పలునాగరికంపు ఆవాసముల వసించనేల?' (7 పే) అని ఉప్పొంగి, 'రాత్రి అంతయు గగన సామ్రాజ్య మేల చంద్రుడు డుదయించె చలువ లొలయ' అని చక్కటి నుడికారంతో అమృతాంశునికి స్వాగత మిచ్చినది. 'చిటపట బిందువుల్ చెట్ల కొమ్మలను మేలి ముత్తెంబుల జాలుగా రాల్చె' అని ప్రకృతి సౌందర్య మనకు ముగ్ధురా లగుచున్నది. ఈ వైవిధ్యపులో, మన ప్రబంధ కవులు అన్ని జాతివృక్షాలను ఒకే చోట మొలపించినట్లు, ఈమె అసమయ పుష్పము లను పూజకు సమకూర్చుచున్నది. మాలతీ చంపక వకుళ సుమరాజితోబాటు మల్లియను పేర్కొను చున్నది. శివ మాఘంలో పూసి (మాఘ్యం) వసంతానికి కనబడకుండాపోతవి. (67.)

ఈమె నుడికారంలో తెనుగు తియ్యదనమున్నది. 'మలయ పవనుడు మరచిపోయెను మాలతీ మృదు సౌరభము గొని, విలువ యెఱుగని చలువ కానుక లిచ్చినాడు గదమ్మ నీకు' (39). 'అంబర సౌధమ్ము లింక అల్లకు' (36). 'హృదయమను సంద్రాన కదిలాడియల లెన్నొ ఉత్సాహమును గూర్చె చిలకా' (33) ఇట్లాటి పనసదొనలు చాల ఉన్నవి. ఈ ఉత్సాహంలో కొన్నిచోట్ల క్రమము తప్పగొట్టినది. ఇది ఎవరి తప్పు అయినా ముందుగా చూచిన పెద్దలు సవరించి యుండవలసినది. (46) 'తూర్పు కొండపై తోచె నదె సూర్యుండు' అని చెప్పి, వెంటనే 'ఉషతోడ మంజనమ్ముల నాడి యుదయించు దెసల పొగమంచు తెరల తొలగించి యుదయించె' అని వర్ణించినది. ఈ పనిముందు జరిగినదని అనుకోవలసివచ్చినా 'సుంగి పోయెను వేగుజుక్క' అంటున్నది, అరుణోదయానికే

ఇది మరిగిపోతుంది. భావన భాష బాగున్నవి; క్రమ మునో భాషనో సవరించిన బాగుండేది.

'రాశి'కి బహువచనం 'రాసులు' అనేది సవరించి ఉండవలసినది. (72) ఇక 'థ' విషయమై ఆంధ్రు లందరికున్న నిరాదరణనే ఈమె గూడ చూపుతున్నది.

చాలమంది పురుషుల వలెనే ఈమె గూడ భావకవిత్వం భావుకతతో చెప్పినది. ఈ మధురప్రేమ నిజస్వామిని గురించియే కావచ్చును.

'కథాకవిత' చాలా పేలవంగా, కవితా దృష్టిలో వెలితిగా మన్నవి. అర్జును తీర్థయాత్ర అసలు భారతంలోనే పన్నెండు నెలలది పన్నెండేండ్లుగా సాగి రసాభాసగా మన్నది. ఇందు మణిపుర యాత్ర 90, 92 పాటలలో భిన్నభిన్నంగా చెప్పబడి ఉన్నది. 'సుజన స్తుతి' ఉదాత్తంగా ఉన్నది. ముఖ్యంగా వీరేశలింగం స్మరణ అన్ని కోణాలలో అద్భుతంగా ఉన్నది. ఆయన గావించిన పతితస్త్రీ రక్షణ కరుణామయం. సర్వకళా కుశలుడైన ఆ మహాంధ్రునికి ఇది తగిన పద్య నీరాజనం. ఆశావాదిగా ఈమె చెప్పిన పద్యాలు నేటి కలుషిత వాతావరణంలో ఊరట పలుకులుగా మన్నవి.

— శ్రీ మరుపూరు కోదండరామ రెడ్డి.

## భారతీయ సంస్కృతి

(గ్రంథకర్త: వేదవిద్యా విశారద, విద్వాన్ షడ్దర్శనం—సోమసుందర శర్మగారు, డెమ్మీ సైజు 189 పేజీలు. వెల అయిదు రూపాయలు. ప్రతులకు ప్రొద్దుటూరు—శ్రీరాములపేటలో ఉన్న గ్రంథకర్తకు వ్రాయవలెను.)

'చత్వారింశతా సంస్కారైః సంస్కృతః' అనే స్మృతి సూత్రాన్ని అనుసరించి భారతీయులకు—అంటే—భారతదేశంలో పుట్టి వేదమార్గాన్ని అనుసరించినవారికి నలభైనాలుగు సంస్కారాలు నియతములై ఉన్నవి. వాటి ప్రాముఖ్యం, వానిని ఆచరించడంవల్ల కలిగే ప్రయోజనం, ఆచరించనందు వల్ల కలిగే ప్రత్యవాయాలూ, సంస్కారాలను ఆచరించే విధానం మున్నగు విషయాలను తెలియజేసే గ్రంథం ఇది. పెద్దలు సూచించిన సూచన మేరకు ఇది రచింపబడినట్లు గ్రంథకర్త తెలుపుతున్నారు.

భారతీయులకు హిందువులనే పేరు పాశ్చాత్యుల మూలంగా వచ్చినదనీ, ఆర్యసంప్రదాయానికి అనుగుణంగా 'భారతీయు' లనడమే ఉచితమనీ గ్రంథకర్త చెప్పుతున్నారు.

ఇది 'భారతీయ సంస్కృతి'లో మొదటి భాగం. ఇందులో కొన్ని 'సంస్కారాదులను గూర్చి వివరించి వ్రాయగడంగితిని' అని రచయిత వాక్యం. అందువల్ల మరికొన్ని భాగాల్లో మిగిలిన సంస్కారాలను గురించి వారు వివరించదలచి యుండవచ్చును. ఇందులో గర్భాధాన, పుంసవన, జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, చౌల, ఉపనయన, వేదవ్రత, స్నాతకవ్రత, వివాహ సంస్కారాలను గురించీ, గృహస్థులు ఆచరించవలసిన విధులను గురించీ ఉన్నది. వీటిలో వివాహోపనయనాల విషయమే విపులంగా ఉన్నది. ఉపనయనాన్ని గురించి 35 నుంచి 78 పుటల వరకూ, వివాహాన్ని గురించి 78 నుంచి 145 వ పుట వరకూ ఉన్నది. వేదవ్రత, స్నాతకవ్రతాలను గురించి ఏమీ లేదు. 'ప్రాజాపత్యాది వేదవ్రత చతుష్టయమును నిర్వర్తించి, స్నాతకవ్రతము ఆచరించి యనంతరము వివాహము చేసికొనవలయును ద్విజులు' (పుట 77) అని మాత్రం చెప్పబడింది.

ఇందులో ప్రతిపాదించబడిన విషయాలను బట్టి చూస్తే యిది భారతీయుల నందరినీ గురించి కాక, ద్విజులను మాత్రమే ఉద్దేశించి వ్రాయబడినట్లు స్పష్టమవుతున్నది.

ద్విజులలో చాలామంది ఈ సంస్కారాలను ఆచరిస్తున్నారు. కాని, అవి ఎందుకోసం ఆచరించాలో గ్రహించి ఆచరించేవారు తక్కువ. అలా గ్రహించ లేనివారికి ఈ సంస్కారాల స్వరూప ప్రయోజనాదులను గురించి తెలిపే ఇట్టి గ్రంథం ఎంతో అవసరమైనదే! కాని, యీ గ్రంథం సరియైన పద్ధతిలో

ముద్రింపబడనందున ఆశించినంత ప్రయోజనం కలగ జేమో అని సందేహించవలసి వస్తున్నది.

ఇందులో ఎన్నో శీర్షికలు ఉన్నవి. ముఖ్యమైన కొన్నిటికి సంఖ్యలు ఇయ్యబడినవి. 'వివాహం' మున్నగు ముఖ్యమైన కొన్నిటికి సంఖ్యలు లేవు. ఏవి ముఖ్యాలో, ఏవి ఉపశీర్షికలో తెలుసుకోడానికి 'విషయ సూచిక' అవసరం. అది యిందు లేదు. అందుకోసం కావలసిన శీర్షికకోసం వెతుక్కోవలసి వస్తుంది. కొన్ని శీర్షికల పేర్లు తప్పుగా పడినవి. విషయ సూచిక ఉంటే ఏ మాట సరియైనదో తెలుసుకోడానికి వీలు ఉండేది.

గ్రంథకర్త చెప్పిన ప్రతి విషయానికి ప్రమాణాలు ఇవ్వబడినవి. కొన్ని సూత్రాలూ, కొన్ని మంత్రాలూ, కొన్ని సంస్కృత శ్లోకాలున్నూ వీటిలో నూటికి తొంభై తప్పుగా ముద్రించబడినందువల్ల ముద్రితమైనవే సరియైనవనే భ్రాంతి కలుగుతుంది.

'అచ్ఛిన్నపాదా గాయత్రీ
బ్రహ్మహత్యాం ప్రయచ్ఛతి,
ఛిన్నపాదాతు గాయత్రీ
బ్రహ్మహత్యాం వ్యపోహతి'

అని ముద్రణలో (పుట 67) ఉన్నది. ఇది.

'అచ్ఛిన్నపాదా గాయత్రీ
బ్రహ్మ హత్యా ప్రయచ్ఛతి,
ఛిన్నపాదా తు గాయత్రీ
బ్రహ్మ హత్యాం వ్యపోహతి.'

అని ఉండవలసి యున్నది.

'మాంగల్యం తంతునానేన
మమజీవన హేతునా,
కంఠె బధ్నామి సుభగే
త్వంజీవ శరదాం శతం'

అని 138 వ పుటలో ముద్రితమైన శ్లోకం

'మాంగళ్య తంతు నానేన
మమ జీవనహేతునా
కంఠే బధ్నామి సుభగే
త్వం జీవ శరదాం శతమ్.'

అని ఉండవలసి ఉన్నది. 152 వ పేజీలో ఉన్న

'అనుకూలా సదాహ్రష్టా
దక్షా సాధ్వీ ప్రజావతీ,
ఏఖరేవ గుణైర్యుక్తా
శ్రీరేవ స్త్రీ నసంశయః'

అనే శ్లోకం

'అనుకూలా సదా హృష్టా
దక్షా సాధ్వీ ప్రజావతీ,
(ఏఖరేవ?) గుణైర్యుక్తా
శ్రీరేవ స్త్రీ న సంశయః'

అని ఉండవలసి ఉన్నది. 'ఏఖరేవ' అని దేనికి మారుగా పడిందో? హెడ్డింగులోనే 'గర్భాధానం, చౌలం'లకు మారు 'గర్భావానం, కాలం' అని వున్నది. 'శాలగ్రామం' (పు 71) 'శ్యాత్' (పు 81) అపోశనం'కు అపోశానం (పు 47) 'బ్రాహ్మే'కు' బ్రహ్మే' (పు 79) 'కన్యాంకు' 'కన్యానాం'' (పు. 137) ఇట్టి తప్పులు లెక్కలేనన్ని ఉన్నవి. 'భిండివాలం' ఒకే పదమైనా, విడదీసి రెండు ఆయుధాలుగా చెప్పబడినవి. ముద్రణ జరిగేటప్పుడు శ్రద్ధ చూపలేదని వీటివల్ల తెలుస్తున్నది. ఇలా ముద్రించడం కన్న సంస్కృత భాగాలను విడిచిపెట్టి, తెలుగులోనే విషయం తెలుపుతూ గ్రంథం ప్రకటిస్తే చాలా పేజీలు కలిసివచ్చి ఉండేది. రచనలోకూడా కొంత శ్రద్ధ చూపడం అవసరం. రచయిత పునర్ముద్రణలో అయినా శ్రద్ధ చూపగలరని భావిస్తాము.

— ఆంగీరస

## తిరుపతి వేంకట కవులు

(రచయిత—ఆచార్య—దివాకర్ల— వెంకటావధాని. ఎమ్—ఏ (ఆనర్సు) పి—హెచ్—డి. 130 పుటలు—వెల సాదా ప్రతి రు. 2–00 గ్రంథాలయ ప్రతి రు. 4-00 ప్రకాశకులు—ఎ—పి. సంగీత నాటక అకాడమీ, కళాభవన్, హైదరాబాదు.)

ఈ శతాబ్దిలో బహుళ వ్యాప్తి నొందిన కీర్తి శేషులు— దివాకర్ల — తిరుపతి శాస్త్రిగారు, చెళ్లపిళ వెంకటశాస్త్రిగారు కలసి వీరి పేరులు తిరుపతి వేంకట కవులు. వీరి రచన లసంఖ్యాకములు—శిష్యోప శిష్యులు వేలకొలదిమంది కలరు. శతావధానాష్టావధానములు నామమాత్రముగా నుండినవి. వీరి కాలములో చాల వ్యాప్తి చెందినవి. చాలమంది రాజులవద్ద బహుమానములు పొందుట మొదలగు సంగతులతో ప్రజలలో వ్యాప్తి చెందిన వీరి కీర్తిని జగత్తునకు తెలియునట్లు శ్రీయుత దివాకర్ల—వెంకటావధానిగారు త్రిలింగ దేశస్థులకు ప్రకాశముగునట్లు వెల్లడించినారు. లలిత పదములతో భావగాంభీర్యము పద్ధతిని కవిత్వము ధారాళమగు శైలితో రచించిన గ్రంథములను చదివి దాని నీ గ్రంథమున విపులముగా చర్చించి చూపి యున్నారు. గజారోహణాది సత్కారములు పొందుట. దిగ్విజయము చేయుట. ఢీకొన్నవారితో నెట్టివారైనను లెక్కింపక ఎదురువాదముచే శాస్త్రీయముగా జయించి నిర్వీర్యులగునట్లు చేయుట. అత్యద్భుత కవితాశక్తి కల్గి కావ్యములు, నాటకములు, ప్రబంధములు, ప్రహసనములు, కోకొల్లలుగా వ్రాయుట. వీరలకు సాధారణమైన పని. సభలలో ప్రజలు ఆనందించు నట్లుపన్యసించుట వీరి కుగ్గుతో పెట్టినదే. అట్టివారి సామర్థ్యమును గ్రహించుటకు తగు సామర్థ్యము కలవారు ఈ వెంకటావధానిగా రొక్కరే కనబడుచున్నారు. వీరు రచించిన—తిరుపతి వేంకట కవులు—అను గ్రంథమే సాక్ష్య మిచ్చుచున్నది. ఆధునికాంధ్ర కవులలో వీరితో సమముగా తులతూగువారు వీరలే- 'గగనం గగనాకారం సాగర స్సాగరోపమః' అనునట్లు వీరికి వీరే సాటి—అని వీరలు రచించిన గ్రంథములు తెలుపుచున్నవి వీరి పాండిత్యము శాస్త్రజ్ఞానము అనితర సాధ్యమైనది. వీరి కవిత నొకపరి పఠించిన వెంటనే స్మృతి పథమున నాటివాటికి తోచుచు ఆనందము నొసంగును. నేటి కాలమున లెక్కలేనంతమంది కవులున్నారు. కాని చెల్లింకంపోసగని కఠిన సమాసములతోనింపి మాధుర్యము మేమేయని పిల్చుసిగుమన్నారు. లక్షలార్జించుచున్నారు. ప్రజాబాహుళ్యమునకు పనికిరాని కఠినహారికేళ పాకముసుమించిన శైలితోవ్రాసి నన్నయ మామ్ముందు పనికిరాడని ప్రగల్భములు పలుకుచున్నారు. జిలిబిలి పలుకులు వెదకుదమన్నను గ్రంథమంతయు సాంతముగా పఠించినను ఒక్కటి గూడ కానరాదు. అట్టి కఠిన్యముగాని భావ శూన్యమైన పదములుకాని రసవిహీనమైన పదములుకాని వీరి కవితలో కాన్పింపవు. పొల్లు పదములు అసలే కాన్పింపవు. గీరలములో ఒక పద్యములో వీరిట్లు వెల్లడించి యున్నారు.

చ॥ ఎవని కవిత్వమున్ వినిన య
హీనమహా మహిమాను భావులౌ
కవులిదివో కవిత్వమని
కంపిత శీర్ష చమత్కృతియా మహో
త్సవ సవిశేష సంచిత సు
ధారస ధాళ ధళీకులౌదురో
కవి యనగా నతండె యగు
గాక కా కవులే కవులేని గాకవుల్'

భట్టారకుఁడు 'సాధ్యోహి రపోయధాజథం కవిభిః' అని కదా వక్కాణించియున్నాడు. అట్టివారి పాండిత్యమును గ్రహించుటకు తగు సామర్థ్యము కలవారు నేటి కాలములో వేయింటి కొక్కరుండురేమో. 'కవితా రస మాధుర్యం వ్యాఖ్యాతా వేత్తినో కవిః' అని కదా లోకమున ప్రసిద్ధి నొందినది. వీరి నామములు కూడ స్వారస్యముగా కుదిరియున్నది. చర్ల బ్రహ్మయ్య శాస్త్రిగారికి శిష్యులు పలువురున్నను పేరు దెచ్చినవారు వీరలే కన్పించుచున్నారు. శాస్త్రములలో నసాధారణ ప్రజ్ఞ కలిగి అవధానాసులలో దానిని దిద్దుకొను సామర్థ్యము కల్గినవారు వీరలే. పండితులను ఎదురించి తప్పును ఒప్పుగా సవరించుకొను శక్తి కలవారు వీరలే. అట్టి మహాకవుల జీవిత విశేషములను వ్రాయుటకు వీరి కెక్కువ సామర్థ్యము కలదని వీరు రచించిన గ్రంథము సాక్ష్య మొసగుచున్నది. గురువుగారు వీరలను కర్ణాటక సీతారామశాస్త్రులతో పోల్చుట వీరి సామర్థ్యమును కనియేగదా వక్కాణించి యున్నారు. వెను

కటి దినములలో. (బాలుడా—బాలుడే. గంగాధరుడు గంగాధరుడే. కర్ణాటకుడు కర్ణాటకుడే — అని ప్రసిద్ధ పండితులను బాలశాస్త్రిగారిని, గంగాధర శాస్త్రిగారిని కర్ణాటక సీతారామశాస్త్రుల వారిని గోదావరీ తీరవాసులగు కోనసీమ పండితులు నేదు నూరు వాస్తవ్యులు. పండితరాయలవారు కాశిలో నుదువుచుండెడివారట. 'ఉల్లీవనాంతరా శేతు జోరీగః కోకిలాయితే, అనునట్టి పండితులు ఇప్పుడు కాశీ పట్టణమందు మందునకైన కాన్పించువారుకారట. అట్టివారి చరిత్రలు తల్లక్రిందులగునట్లు వ్యాకర ణాది శాస్త్ర పాండిత్యముకల్గి దేశములో నలు మూలల ప్రఖ్యాతిగాంచిన కవిపుంగవులైన వీరి సామ ర్థ్యము నేటి కాలమున నెవ్వరు గ్రహింపగలరు. శ్రవణానందము పాణిగృహీత మొదలగు కావ్యములు రసవంతముగా వ్రాయవలెనన్న వీరికి మించిన సామ ర్థ్యము కలవార లెవరున్నారు. ఇట్టివారి చరిత్రను విపులముగా వ్రాసి తెల్పినవారు శ్రీ దివాకర్ల వెంక టావధానిగారొకరే అని చెప్పుటకు వీరి గ్రంథమే తెల్పియానందమును కలుగజేయుచున్నది. 'కావేత్తి కవితా తత్వం ఈశ్వరో వేత్తివానవా'

శ్రీ వేమవరపు వేంకటేశ్వరశర్మ.

## సర్వధర్మ సమన్వయము

(కర్త; ఆకురాతి చలమయ్య; పుటలు: 500; వెల: 25 రూపాయలు; ప్రచురణ. శాంతి నిలయ గ్రంథమాల, కాకినాడ చీరాల.)

'దేశమీనాడు మతకలహములతో, జాత్యభి మానములతో అల్లకల్లోల పరిస్థితులలో నున్నది. పాఠకులీ గ్రంథములోని విషయములను శ్రద్ధతో పఠించి గ్రహించిన యెడల మహానుభావుల, మతప్రవ క్తల బోధలన్నియు నొకే సత్యమును బోధించుచున్న వనియు, సర్వమానవ భ్రాతృత్వమునే బోధించుచున్న వనియు గ్రహింపగలరు. తద్వారా మతకలహముల నుండి, ఈర్ష్యాద్వేషములనుండి, సంకుచితత్వముల నుండి పరమేశ్వరుడు మనలను రక్షించును.'

గ్రంథకర్త నివేదనలోని ఈ వాక్యము సార్థకములని పుస్తకమును పఠించిన వారికి స్పష్ట మగును.

పరమేశ్వరుని యునికియందు నమ్మికలేని వారందరు నొకమతము స్థాపించికొని, పరమత ద్వేషము పెంచికొని కలహమునకు కాలుదువ్వుట మన మెరిగిన విషయమే! అన్నిమతములను చక్కని ధర్మములనే ప్రబోధించుచున్నవి. సర్వమానవ కల్యాణ మునే యాకాంక్షించుచున్నవి. సర్వజన సమ్మతము లైన నీతులనే ప్రతిపాదించుచున్నవి. మతముల మూల సూత్రములన్నియు నొకటే! అయినను నా విషయ మును విస్మరించి, మానవు లనాది కాలమునుండియు నొకరిపై నొకరు కారములు మిరియములు నూరు కొనుట యవివేకము గాకమరేమి?

విజయవాటికలోని గాంధీ పర్వతముపై నిర్మింప బడిన స్థూపముమీద లిఖింపబడిన 'సర్వధర్మ సమా నత్వము లేక సర్వధర్మ సమన్వయము' అను సిద్ధాం తము రచయిత కెంతో యుత్సాహము నొసగెను. రచ యితకు వేదములు, ఉపనిషత్తుల విషయములు తెలి యును. అదృష్టవశమున శాంతి నికేతనమున విశ్వ భారతి విద్యార్థిగానుండు భాగ్యము కలిగెను. మాక్ డొనల్‌గారి వేదిక్ రీడరును జదివి హిందూ ధర్మ ధర్మమును ఋగ్వేదమును బట్టి నిర్ణయింపవలెనని నిశ్చయించెను. అందులో జాతి భేదమును, వర్ణ భేద మును గురించిన విషయములు లేవని తెలిసికొనెను. గురుదేవుడు రవీంద్రుడు రచయితకు బెంగాలీ పాఠ ములు బోధించెను. రాజర్షి రాజారామ మోహన రాయల గ్రంథములన్న రచయిత కాసక్తి మెండు. ఈ యనుభవము లన్నియు రచయితనీ గ్రంథ రచనకు ప్రోత్సహించినవి. 'నా నివేదన'లో రచయిత యిట్లు వ్రాసిరి.

'నా హృద్గతమైన అట్టి విషయములను ఉదార మైన విశ్వజనీనమైన సర్వమత సమ్మతమైన ఈర్ష్యాద్వేష రహితమైన ఆదర్శములను దివ్యబోధ లను బోధించు మరికొన్ని గ్రంథములలోని అమూ

ల్యము లయిన విషయములను సేకరించి వాని సాయముతో నీ గ్రంథమును రచియింప గలిగితిని. ఈనాటి మత కల్లోలముల సమయములో దీనిని సంపూర్ణముగా పఠించి, మన శాస్త్రములను మహదౌదార్య భావములను, విశ్వమైత్రీ భావములను గ్రహించెదరని నా ప్రార్థన.'

ఈ గ్రంథమును గ్రాంథిక భాషలో రచించుట ప్రశంసావహము. ఈ విషయమునకు తగిన భాష గ్రాంథికమే! భాష సరళముగా సాగిపోయినది. ఒక్క పర్యాయము తిరిగి చూచికొనియున్నచో రచయిత యీ గ్రంథము నింకను చక్కని గ్రాంథిక భాషలో వెలువరించియుండెడివారని నా యభిప్రాయము. వ్యావహారికములో వ్రాసియున్నచో నింత బాగుండెడిది కాదనుటలో సందేహము లేదు!

ఈ పుస్తకమున నూటయిరువది యొక్క యధ్యాయము లున్నవి. ప్రతి దానిలో నేదో యొక గొప్ప విషయముండును. లేదా చక్కని కథ యుండును. పెక్కు ముఖ్యవిషయములు యథాతథముగ నాయా యుద్గ్రంథములనుండి యెత్తి వ్రాయబడినవి. ఇట్లు వ్రాయుట పాఠకుల కెంతయు నుపయోగకరము. సంస్కృతము, ప్రాకృతము, ఆంగ్లము, బెంగాలీ, అరబీ భాష లుపయోగింపబడినవి. వాని క్రింద సరళాంధ్రమున ననువాదము లున్నవి. ఇంత కంటెను కోరదగిన దేమున్నది?

'భారిష ధరావారాఝె శాంతిర చారి' యను ప్రసిద్ధమైన రవీంద్రుని ప్రార్థనా గీతముతో సర్వధర్మ సమన్వయము ప్రారంభమగుట గమనార్హము. గాంధీమహాత్ముని యవతార మూర్తిగ భావించి, రచయిత పెక్కుపర్యాయము లా మహాత్ముని పసిడి పలుకులను యుటంకించిరి. మతకర్తల ప్రతిజ్ఞలలోను, మహాత్ముల సందేశములలోను, వారి ప్రబోధముల లోను రచయిత యేకత్వమును నిరూపించిరి. ప్రపంచములోని మతకర్తల ధర్మ సూత్రములను స్పష్టముగా జెప్పిరి. 'బైబిలు క్రీస్తుధర్మమునకు ప్రాణము, కొరాను ముస్లిమ్ ధర్మమునకు ప్రాణము, అటులనే వేదములు హిందూ ధర్మమునకు ప్రాణము. ఇదియే హిందువులకు ధర్మశాస్త్ర సమ్మతమైన మహా సత్యము' అని వక్కాణించి 'వేదములలో ఋగ్వేదమే సకల వేదముల సారము' అని నిదర్శనములను జూపిరి. ఋగ్వేదము ప్రకారము హిందూ ధర్మసారమును వివరించి, యీ నాటి వారి నమ్మకములను నమ్మ జేసిరి. 'అస్పృశ్యత—జాతిభేదము—ఋగ్వేద విరుద్ధమైన మహాపాపములు' అనుట గమనార్హము. రచయిత యీ విషయమును వివరించుటకు పెక్కు ఉదాహరణము లిచ్చిరి. మహాభారతములోని వనపర్వము, అజగర పర్వమునందుగల దృష్టాంతమువలన హిందూ మతమునందలి వర్ణవ్యవస్థ కర్థమును గాబట్టవచ్చును. లేకున్న రచయిత యుదాహరించిన లోమశముని కథను జదివి హిందూ మతము జాతి భేదమును పాటింపు మన్నదో లేదో నిశ్చయింప వచ్చును.

ఈ నాటి భారతీయుల వాదనలు వారి యవివేకమున కద్దము పట్టుచున్నవి.

'గోవును తిన వచ్చునా—లేదా'

యనునది యొక సమస్య!

'వసిష్ఠుడు తినెనుగదా! మనమెందుకు తిన కూడదు?'

ఇది యొక యాలోచన!

అన్ని మతములు జీవహింసను నిషేధింపుచుండ హిందూమతము ప్రోత్సహించునా? ఎవడో ఋషితినెను గావున హిందువులందరు గోవును తిన వచ్చునని యర్థమా? హిందూ మతమునకు కర్త యా మునీశ్వరుడా? ఇట్టి యాలోచన లెన్నియో గ్రంథకర్త మనసులో నుండియుండవలెను. ఈ గ్రంథమును జదువుచున్నప్పుడు 'ఓ యవివేకమా! ఇంకనైన మావారిపై నీకు దయ పుట్టలేదా? దయతో మావారి మతులనికపై చెడగొట్టక వెడలి పోవే తల్లీ!' యని రచయిత ప్రార్థించుచున్నట్లు పాఠకులకు దోచును. రచయిత కోరిక తీరుటకంటె మనకు కోరదగిన దేమున్నది!

ఏ మతమును వర్ణ వ్యవస్థను జెప్పలేదు. ఇక

హిందూమతములో నవి లేనే లేదు! కాలానుగుణముగ కొన్ని మార్పులు వచ్చుట సహజము. అది మతము తప్పు కాదు. మన తప్పు! ఈ విషయము లన్నియు 'సర్వధర్మ సమన్వయము' చదివినచో స్పష్టముగ తెలియును. మన యనుమానము లెన్నో పటాపంచ లగును.

హిందూమతము మూఢ విశ్వాసములకు నిలయమని నిందించుట యీ నాటి వారికొక గొప్ప! మాంసాహారులు జంతుబలులను నిందించుచు కవిత్వములు వ్రాయుచున్నారు. నాగరికుతలల హైందవ నాగరాజును దూషించుచున్నారు. నిజమునకు హిందూ మతము జంతుబలిని ప్రోత్సహించుటలేదు! ఇట్టి నమ్మకము లన్ని మతములలోను నున్నవి. ఆయా నమ్మకముల సారూప్యములను గ్రంథకర్త చక్కగా నిరూపించిరి. సేఖ్‌సాదీ కథను వివరించి మానవ సేవయే మాధవసేవయని మనోహరముగ చెప్పిరి. సర్వధర్మ సమన్వయముతో పాటు భ్రాతృత్వమును గూడ రచయిత మనోరంజకముగ బోధించిరి. దీనికి కథలను సాధనములుగ తీసికొనిరి.

'బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్ బాహూ రాజన్యకృతః
ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో ఒజాయత'

ఇది ఋగ్వేదములోని ఋక్—అని కొందరు చెప్పుచున్నారు. బ్రహ్మకు ముఖము బ్రాహ్మణుడు. బాహువులు క్షత్రియులు. ఊరువులు వైశ్యులు. చరణములు శూద్రులు—అని శ్లోకమున కర్థము. ఈ సూక్తమే సంహితంలోను, పురాణములలోను వేరువేరు రూపములు ధరించినది. నిజమునకిది ఋగ్వేదము లోనిదికాదని పెద్దలు నిరూపించిరి. ఇక దీనిపై వాదోపవాదములకు తావులేదు. ఈ విషయమును వివరించుచు చలమయ్యగారిట్లు చెప్పిరి.

'జ్ఞాన ప్రచారములో బ్రాహ్మణులు. వారు లేనిచో సంఘము జ్ఞాన విహీనమగును. బలము క్షత్రియులలో గలదు. వారు లేనిచో కార్యములు గావించు శక్తి లోపించును. కృషి వాణిజ్యములకు బలము వైశ్యులు వారు లేనిచో సంఘము యొక్క ఊరువులు నిలువజాలవు. సేవచేయుట శూద్రుల కార్యము. వారు లేనిచో సంఘముయొక్క హస్త పాదములు అన్నియు దుర్బలమై పోవును ఇదియే ఆ పురుష సూక్తములోని అర్థము. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రత్వము, సమ్మిళితమైన ప్రజాసమిష్టియే పరబ్రహ్మదేహము. పరబ్రహ్మ కాయము ఆర్యులలో, అనార్యులలో సకలజాతులలో పరివ్యాప్తమై యున్నది. పూర్వకాల మానవులు బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య, శూద్ర సంఘములుగా నేర్పాటు గావించు కొనినను ఎవరిని ద్వేషించు కొనలేదు. హీనముగా చూడలేదు. అందరము ఏక జాతికి చెందిన వారమనియు, అందరము ఏకోదర సోదరులమని ఆనాటి మానవులు గ్రహించిరి. అనాడు ఆ విధముగా సంఘభేదములు ఉండెడివి. కాని జాతి భేదములేదు.'

నిజమైన బ్రాహ్మణు లెవరు?

యస్తు శూద్రో దమే సత్యే కర్మేచ సతతోద్ధితః
తం బ్రాహ్మణమహం మన్యేవృత్తేన హి భవే ద్విజః

శూద్రులు నిగ్రహమందు, సత్యమునందు, సతతము అనురక్తులై యున్నచో వారు బ్రాహ్మణు లగుచున్నారు. ప్రవర్తనవల్లనే ద్విజులగుచున్నారు. ఈ సద్గ్రంథమున నిట్టి వివరణలు పెక్కులున్నవి.

ఈ గ్రంథమున పెక్కు కథలున్నవి. ఒక్కొక్క కథ యొక్కొక్క రత్నము. అన్ని మతముల కథలకును సమాన ప్రాముఖ్య మీయబడినది. ఈ చమత్కారపు కథలు కితకితలు పెట్టి నీతులను చెప్పును. కన్నీరు చిలికించియు ధర్మబోధను గావించును! అద్భుత సందేశముల నందించును! ఏకనాథునికథ లిందు కుదాహరణములు. గాయత్రి మంత్రమును సకల మానవుల సంపదగా భావించిన రచయిత చలమయ్య!

నేటి సమాజమునకీ గ్రంథ మమృత తుల్యము!
దీనిని జదివిన వారదృష్ట వంతులు!
గ్రంథకర్త ధన్యుడు!

—శ్రీ పులిచెర్ల సాంబశివరావు.

# 1. చీకటిలో జ్యోతి
# 2. అమృత గీతాంజలి

(కర్త: శ్రీ చర్ల గణపతిశాస్త్రి. ప్రతులకు : రచయిత, లలితా ప్రెస్. 6–2–977/1 ఖైరతాబాదు, హైదరాబాదు–4. చీకటిలో జ్యోతివెల 2–50. అమృత గీతాంజలి వెల : 4–50.)

ఈ రెండు పుస్తకాలలోను మొదటిది టాల్‌స్టాయి రచించిన 'ది లైట్ షైన్స్ ఇన్ ది డార్క్‌నెస్' అన్న నాటకానికి అనువాదము.

ఇది టాల్‌స్టాయి చరమ దశలో రచించాడు. అప్పటికి ఆయనలో ఆధ్యాత్మిక దృష్టి ఒక అవధికి వెళ్ళిపోయింది. ఒక వ్యక్తిలో తన జమీందారీ సొత్తు అంతా ఇతరుల దగ్గరనించి దొంగిలించినదేఅన్న ఆలోచన బాగా ప్రబలింది అందుచేత ఆయన అది అంతా ఆయా రైతులకు తిరిగి ఇచ్చి వెయ్యాలని ఆలోచిస్తాడు. కాని అతని భార్య దాని కంగీకరించదు. భార్యా భర్తలమధ్య అభిప్రాయ భేదా లేర్పడతాయి. సంగ్రహంగా ఇది ఈ నాటకంలోని కథ.

మూలంలో టాల్‌స్టాయి ఈ నాటకం పూర్తి చెయ్యలేదు. చాలావరకు రచించి, ముగించడానికి కావలసిన వివరాలు ఒక నోటు బుక్కులో — వ్రాసుకున్నాడు. అయితే అనువాదకులు ఆ వివరాల ప్రకారం ఇది అయిదంకాల నాటకంగా మలిచారు. ఈ నాటకంలోని కథ అంతా చాలావరకు టాల్‌స్టాయి జీవితానికి సంబంధించినదే అని విమర్శకు లంటారు. ఈ ఊహ సరిఅయినదే.

ఇటువంటి మహారచయితల నాటకాలు అనువదించ దలుచుకున్నప్పుడు యథాతథంగా అనువదించడమే సముచితము. అవి పైన నాటకాలేవయినా ప్రదర్శనానికి అనువుగా ఉండాలి. అనువాదకులు గద్దు గ్రాంథిక భాషలో అనువదించినందువల్ల ఇది నేటి రంగస్థలానికి అనుకూలంగా లేదు. గ్రాంథిక భాష కూడా చాలా చోట్ల సరళంగా. జాతీయంగా కొనసాగలేదు. పైగా పాశ్చాత్య వాగ్గేయకారకుల పేర్లకు బదులుగా అనువాదకులు తమ అనువాదంలో విూరాభాయి, త్యాగరాజు, దీక్షితులు మొదలయిన వారి పేర్లు వాడారు టానియా అన్న వ్యక్తి ఈ నాటకంలో 'పలుకవదేమిరా!' అన్న కీర్తన పియానోవిూద వాయిస్తుంది. ఇలాగ ఈ అనువాదం బాగా అసంగతంగా తయారయింది.

రెండవ అమృతగీతాంజలి టాగూరు ఆంగ్ల వంగ గీతాంజలి సంపుటాలకు రెండింటికి స్వేచ్ఛా గద్యానువాదము.

వంగ గీతాంజలిలోని గీతికల అనువాదాలు కొన్ని ఆంగ్ల గీతాంజలిలో చేరలేదు. పైగా ఆంగ్ల గీతాంజలి వంగ గీతాంజలిలోని గీతాలకు గద్యానువాదం మాత్రమే. కనకనే రచయిత వంగ గీతాంజలికి సమగ్రానువాదం రూపొందించాలని ప్రయత్నించారు.

వంగ గీతాంజలిలోని రచనలన్నీ చాలావరకు గేయాలు. 'అంత్యాను ప్రాసలతో మనోజ్ఞంగా సాగిపోతాయి.

భగవానుని గురించిన భక్తి అందమయిన కవితామయంగా పలికించగల గొప్పశక్తి టాగూరు గీతికలలో అడుగడుగునా తరళిస్తుంది. కనకనే గీతాంజలికి అంతటి ప్రపంచ ప్రశస్తి లభించింది.

అనువాదకులు, ఆ గీతికలు గద్యంలోకి అనువదించినందువల్ల మూలంలోని గేయ రచనా మాధురి లోపించడంలో ఆశ్చర్య మేమిలేదు.

అయితే లలిత సరళమయిన శైలితో మూల రచనలలోని భావచ్ఛాయలు కొంతవరకు తెనుగులో ప్రతిఫలింప జెయ్యగలిగారు శ్రీ గణపతి శాస్త్రిగారు. సమగ్ర వంగగీతాంజలి స్వరూప స్వభావాల అవగాహనకీ అనువాదం చాలావరకు ఛాయామాత్రంగా సహకరిస్తుంది.

—'శాస్త్రి'.

# సంస్కృత వాఙ్మయమునకు ఆంధ్రుల సేవ

Contribution of Andhra to Sanskrit Literature by Dr. P. Sriramamurti M. A., Ph. D., Andhra University, Waltair, Rs 15/-

సంస్కృత వాఙ్మయమునకు ఆంధ్రుల సేవను గురించి సమగ్రమైన యీ సంపుటము డాక్టరేటు

# గ్రంథ విమర్శలు

బిరుదము కొఱకు చదివింపఁబడిన పరిశోధక గ్రంథము. ఏతద్రచయిత శ్రీరామమూర్తిగారు, సుప్రసిద్ధ పరిశోధక వేత్తలైన డాక్టర్ కున్హనరాజా, రాఘవన్ మహాశయుల క్రింద తయారైనవారు. రాఘవన్‌గారి పర్యవేక్షణ క్రిందనే దీనిని రచించినారు.

సంస్కృత వాఙ్మయమునకు ఆంధ్రుల సేవ యనుటలో ఏదో ప్రత్యేకత ధ్వనించుచున్నది. సంస్కృతమునకు ఆంధ్రులు దూరమైనట్లో, సంస్కృతాంధ్రములే భిన్నములైనట్లో, కాబట్టి స్వకీయము కాని దాని సమాదరణలో నొక ప్రత్యేకతయో విశిష్టతయో యున్నట్లు తోచునట్లున్నది. ఇది ఆధునిక భాషాప్రయుక్త రాష్ట్ర విభజనవలన వచ్చిన భ్రమ. మన ప్రాచీనులు అట్టి భావమునకు తావీయలేదు. సంస్కృతము ఆసేతుహిమాచలము ఉమ్మడిభాషగా పెంపొందినది. అందరి సొమ్ము. వైదిక సంస్కృత వాఙ్మయకాలము దాటపోయిన తర్వాత లౌకికభాష రూపొందుచుండిన దశలోనే సంస్కృత విద్యాపీఠములు కాశ్మీర నేపాళములనుండి కాంచీ, మధుర కేరళములవఱకు వ్యాపించి నానా రాజస్థానములలో విలసిల్లుచుండినది. దేశమందు, సంగీత నృత్యాదులలో మార్గదేశి రచన ఉన్నట్లే భాషలో కూడ మార్గ సంప్రదాయము ననుసరించిన సంస్కృతమును ప్రాంతీయములైన భాషలును ఉండినవి. సంస్కృతము అఖిల భారత భాషగాను ఆంధ్రాదిభాషలు తత్తత్ప్రాంతీయ వ్యావహారికములుగాను వర్ధిల్లసాగినవి. స్థానికులు దూర ప్రదేశములకు పోలేనివారు ప్రాంతీయ భాషా సంస్కృతులను చేపట్టగా అఖిల భారతదేశ సంచారకవర్గము సంస్కృతము నాశ్రయించినది. ఇటు పరిణతివందిన ఈ సంస్కృతులలో క్రమముగా నొక వైవిధ్య మేర్పడి ప్రాంతీయము జాతీయముమీద తన ప్రభావమును కాలక్రమమున చూపసాగినది. ప్రయాణ సౌకర్యాదులు లేక శత్రుచోర వ్యాఘ్రాది భయాకీర్ణమగు సాంద్రారణ్యములు [illegible] ఈ విశాల భారత భూమిలో ఆంధ్ర ద్రవిడ కర్ణాట కేరళ మహారాష్ట్ర, అంగవంగ కళింగ మగధపాంచాల గూర్జర కాశ్మీర నేపాళాది దేశములుగా నేర్పడిపోయెను. వరి పాలకులును భిన్నులై నిరంతర యుద్ధకార్య నిమగ్నులై యుండినందున ప్రాంతీయభేదము ప్రస్ఫుటమై భిన్న సంస్కారతా భావమునకు దారితీసినది. ఇట్లు విడిపోయినను ప్రాంతీయ సంస్కారము అఖిలభారతీయ భాషయగు సంస్కృతముమీద మరల తన ప్రాంతీయ ప్రభావమును చూపసాగినది. వివిధ ప్రాంతీయులు తమతమ చిత్తవృత్తుల ననుసరించి గీర్వాణవాణికి అలంకార ప్రాయములైన కావ్యనాటకములను రచించి సేవింపసాగిరి. ఈ ప్రాంతీయ ప్రత్యేకతను జల్లెడపట్టి చూపుట సాధ్యముకాదు గాని, ఆయా ప్రాంతములలో వర్ధిల్లిన గ్రంథరాజముల పట్టికలను నిర్మించుట సులభము. అనంతర పరిశోధనకు సోపానము. ఈ ప్రాంతీయ వైశిష్ట్యము ప్రత్యేక గ్రంథరూపమున నిరూపింప దగినది. మున్ముందు సులభసాధ్యమగును. కావున ఒకసాటి ప్రణాళికతో, ప్రవేశికారూపమున, ప్రాంతీయ పండితుల రచనల పట్టికగా ప్రాంతీయ సంస్కృత సాహిత్య చరిత్రము నిర్మించుటకు అధునిక విశ్వవిద్యాలయముల వారు కొందఱు ఈ సత్కార్యమునకు పూనుకొనిరి. వంగదేశీయ సాహిత్య చరిత్రను డా. ఎస్. కే. డే గారును, కేరళ సాహిత్య చరిత్రను డా. కే. కుంజుణ్ణి రాజాగారును సంతరింపగా మన వారైన డా. శ్రీరామమూర్తిగారు ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి ఆదరమున ఆంధ్రుల గీర్వాణవాణీ సేవను, డా॥ రాఘవన్‌గారి దర్శకత్వమున చక్కని సంపుటముగా సన్నని అక్షరములలో, డెమ్మీ ఆకృతిలో, రెండువందల పుటలలో నాతి దీర్ఘమును నాతి సంగ్రహమునుగా విషయ కేంద్రీకరణ మొనరించి మనోహరముగా రచియించినారు. శ్రీ రాఘవన్‌గారి మున్నుడి దీనికిని, ఆంధ్రుల కృషికిని కైవారము.

ఆంధ్రదేశమునందలి సంస్కృతికొక విశిష్టత కలదు. వైదిక కాలమునుండియు నేటివఱకు ఆంధ్రులకొక విధమైన ఎడతెంపులేని అతిదీర్ఘ చరిత్ర యుండుటే గాక ఆసేతు విస్తృత భారతావనిలో ఉత్తర దక్షిణ భాగములకు నడిమి మధ్యస్థ భాగము స్థానము దొరకినది. ఆధునిక [illegible] నట్టి ఆర్యద్రావిడ సంప్రదాయము [illegible] ములను ఒకసాటి కలయికను సమకూర్చుచునే మనోహర విభిన్నతా వైశిష్ట్యమును ప్రతిపాదించినది ఆంధ్ర

భూమియైన దక్షిణాపథము. ఆర్యావర్తమునుండి దక్షిణాగ్రమునకుపోవు ఒక్కొక్క విజ్ఞాన స్రవంతియు ఆంధ్రభూమిమీదుగానే పోవలసి యుండినందువలన ఆంధ్ర సంపర్కముచే ఆంధ్రత్వ లక్షణములతోనే కావేరీతీర కేరళ ప్రాంతములను ఆశ్రయించుట సంభవించినదేమో! గీర్వాణవాణి ఉత్తరమునుండి బయలువెడలి ఆయా రాజాస్థానములలో కొంతకాలము విలసిల్లి అటు వెనుక క్రిందికి దిగుట గీర్వాణవాణి చరిత్రలోనే ఒక విచిత్రము.

ఆంధ్రదేశము కృష్ణా గోదావరుల నడిమి దేశమేయైనను కొంత పైకిని క్రిందికి విస్తరింపక యుండలేదు. మౌర్య చక్రవర్తుల కాలములో మెగాస్తనీసు రాయబారిగా వచ్చినప్పుడు ఆర్యావర్తమున మౌర్యులు, దక్షిణాపథమున ఆంధ్రులు, కావేరికి దక్షిణమున చేర చోళ పాండ్యులు, తూర్పున కాళింగులు నుండిరి. సంస్కృత వాఙ్మయమునాటికే ఎంతో ఏర్పడి మౌర్య చంద్రగుప్తుని నాటికి చాణక్యుడు అర్థశాస్త్రము సంస్కృతములో వ్రాసినట్లు కనబడుచున్నను కావ్య వాఙ్మయము మేదియు, వాల్మీకి రామాయణము, మహాభారతము తప్ప క్రీ. పూ. రచన మనకు స్పష్టముగా లేదు. తారీఖుల నిర్ణయములు వివాదగ్రస్తములు. సంస్కృతము కూడ శాసనభాషగ క్రీ. తర్వాత రెండవ శతాబ్దము నాటికే కనబడుట వింత. ఇట్లుండ దక్షిణాపథమున శాతవాహనుల నాటి సంస్కృత రచన యెట్లుండును.

ప్రాచీనాంధ్రులైన శాతవాహన రాజులు క్రీ.పూ. 240 ప్రాంతమునుండి క్రీ. శ. 240 దాదాపు వఱకు ఉండిరి గాని వారి భాష ప్రాకృతము. గాథాసప్తశతి (శాలివాహన సప్తశతి) ఆంధ్రులదే గాని బృహత్కథ విషయము చాల సందేహాస్పదము. కథా సరిత్సాగరమందలి కథా పీఠలంబకాది కథనమును బట్టి శ్రీరామమూర్తిగారు గుణాఢ్యశర్వవర్మల కథలనుబట్టి నాడు ఆంధ్రమున సంస్కృతము వర్ధిల్లినదనియు ఈ శర్వవర్మయే కాతంత్ర వ్యాకర్తయనియు వ్రాసియున్నారు. సంస్కృత వాఙ్మయముమీద బృహత్కథ ప్రభావముండియుండవచ్చును, 'ఉదయనకథా కోవిద గ్రామవృద్ధు' లుండియుందురు. భాసాదుల నాటకములకు ఆ బృహత్కథ పసికి వచ్చియుండునుగాని, బృహత్కథకును అనగా ఉదయనుని కథకును శాతవాహనులకును సంబంధము మృగ్యమనియు, అసలు గుణాఢ్యుడు కల్పిత పురుషుడనియు, ఆదిలో బృహత్కథ జైనమత కథయనియు, ఒక్క ఉపాఖ్యానముగాని, లంబక తరంగాది విభజనగాని లేని ఉదయన నరవాహనదత్తుల కథయ్యేయు, అటుకాండములుగా విభక్తమనియు, కాశ్మీరశైవులును, నేపాళశైవులును దీనికి క్రొత్త శైవరూపము కల్పించి, నానాకథాజాలమును ఇందులోని కెక్కించి, తుదకు సార్థక నామధేయముగా కథాసరిత్సాగరమని పేరిడిరని (నదీనాం సాగరోగతిః) యు, విషయము తెలియక ధనిక ధనంజయాదులు నాటకాదులకు (నాటలతీ నాథవాదులకు) కథలు బృహత్కథనుండి గ్రహింపబడినట్లు తలంచియుందురనియు—నేను 1960 జూన్‌నెల భారతిలో విపులము చర్చించియున్నాను. ఇంతవఱకు పండితులెవరును నాయభిప్రాయమును ఆక్షేపింపలేదు. 'బృహత్కథ' ఉదయన కథలకేగాని మిగిలినవానికి 'Source book' కాదు. ఆయాకథలను ఇందులోని కెక్కించి శైవరచయితలు లోకమును భ్రమలపాలు గావించినారు. శ్రీ రామమూర్తిగారు నా వ్యాసమును గుర్తించినట్లు కానరాదు. ఆకథయే నిజమైనచో బృహత్కథ, నాడే సంస్కృతీకరింప బడియుండును.

శ్రీ రాఘవన్‌గారు వ్రాసినట్లు పల్లవ చక్రవర్తులు పతనమందిన చాలకాలమునకు గాని ఆంధ్రదేశమున సంస్కృత వాఙ్మయము అభివృద్ధి కాలేదు. ప్రథమమున కాకతీయుల నాటికే సంస్కృత కావ్య వాఙ్మయ పోషణ ఆంధ్రమున కనబడుచున్నదని రాఘవన్‌గారు వ్రాయుటలో తత్పూర్వము లేదనియు, శాసనాదులలోను వ్యవహారమందును కనబడుచున్నను బృహన్నిర్మాణ మేదియు జరుగలేదనియు అర్థమగుచున్నది. శ్రీరామమూర్తిగారి రచనయు దీనికి అనుకూలమే. కాగా శాతవాహనుల నాటినుండి కాకతీయుల నాటివఱకు ఆంధ్రరాజుల యాస్థానములలో సంస్కృతమందు ఒక కావ్యము గాని ఒక నాటకము గాని వెలువడలేదు. వెయ్యేండ్ల కాలము ఇట్లుండి పోయినది ఆశ్చర్యజనకము.

ఆంధ్రదేశమును శాతవాహనుల తర్వాత పాలించినవారు అనేకులు. పైగా ఒక్కొక్కరు ఒక్కొక్క

ప్రాంతమును పాలించిరే గాని వారి వలె సర్వదక్షిణా పథమును పాలించినవారు లేరు. ఇక్ష్వాకులు, బృహత్ఫలాయనులు, సాలంకాయనులు మున్నగువారు ఆంధ్ర మధ్యమున కనబడుచుండ దక్షిణమున పల్లవు లభివృద్ధి యైరి. క్రమముగా దక్షిణాపథము ఆంధ్ర కర్ణాటకములుగా చీలి, చాళుక్యులు తలయెత్తిన తర్వాత కూడ సంస్కృత కావ్యరచన లేదు. క్రీ. శ. ఏడవ శతాబ్దము నాటికి బాణునికి సమకాలికముగా దక్షిణమున కావ్యాదుల మీదికి బుద్ధి పోయినది. నాటికి పులకేశి (II) ఐహోలె శాసనమున కాళిదాస భారవుల పేర్లు కనబడుచున్నవి. అప్పుడే పల్లవరాజులును సంస్కృతమును పోషింప సాగిరి. కాని ఆంధ్రమున ఈమాత్రము కూడ లేదు. క్రీ. శ. రెండవ శతాబ్దమున శాసనభాషగా కనబడి శ్లోకముల రచన యున్నను, నన్నయాదులు ఉభయభాషా కవులై యుండినను కావ్యవాఙ్మయపోషణ భాగ్యము కాకతీయులకే దక్కినది. శ్రీరామమూర్తిగారు మొదటి రెండు ప్రకరణములలోనే చారిత్రక విషయములను చక్కగా చర్చించియున్నారుగాని కాకతీయుల నాడేర్పడిన సంస్కృతభాషా వికసము ఆంధ్రదేశమున తత్పూర్వ మేలలేకపోయినదో వివరించియుండిన బాగుండెడిది. ఆంధ్రులైన కాకతీయులు రాజరాజ నరేంద్రునివలె ఆంధ్ర కావ్యరచనను పోషింపక సంస్కృత వాఙ్మయమునే ఆదరించుటయు, ఆంధ్ర వాఙ్మయము సామంత మాండలికులకడనే యభివృద్ధి యగుటయు ఎందులకో సకారణముగా నిరూపింపదగిన విషయములు.

మూడవ ప్రకరణమున కాకతీయుల గీర్వాణవాణీ పోషణము తెలుపుచు శాసనములను చక్కగ ఉపయోగపరచుకొనిరి. రెండవబేతరాజు (1080) ఖాజీపేట శాసనము మొదలుకొని శాసనకవుల చరిత్రను క్రమముగా చూపి గణపతి చక్రవర్తినాటి నృత్తరత్నావళ్యాదుల రచనా పరిశవ చరిత్రను వివరించియున్నారు. ప్రతాపరుద్ర చక్రవర్తి కాలమున సంస్కృత వాఙ్మయాదరణ మేరుశిఖరము నందు కొన్న విషయములను విపులముగా వివరించినారు. విద్యానాథుడే అగస్త్య మహాకవియనుటకు మంచి ఉపపత్తులు లేవని వీరి యభిప్రాయము.

శాకల్లెమల్లన్న ప్రతాపరుద్రుని నాటివాడే యైనను అనంతర విజయనగర రాజుల యాస్థానీ వాడు. విజయనగర హరిహరరాయల సమకాలికుడని వీరే వ్రాసియున్నారు. (పుట 54) ఇతనిని కాకతీయ యుగమునకంటె విజయనగరరాజ ప్రకరణమున పెట్టియుండదగును. ఆంధ్ర లక్షణకారులలో చిన్నకోట పెద్దనతో కలిపి శాకల్లెమల్లన్నను అప్పకవి చెప్పియున్నాడు. సంధికాలము వాడుగా నుండును. కాకతీయుల పండితులెందరో విజయనగరమున కనబడుచున్నారు.

కాకతీయుల పతనానంతరము సంస్కృత వాఙ్మయము రెడ్డి వెలమ విజయనగరరాజుల యాస్థానములలో వర్ధిల్లిన చరిత్రను చూడగా 'ఆంధ్రవాఙ్మయము కంటెను ఆంధ్రులు ఈ కాలమున సంస్కృత వాఙ్మయమునే సమాదరించిరా !' యను నంతటి ఆశ్చర్యము కలుగును. కాకతీయుల కాలమునుండియు ఈ మార్పు కనబడుచునే యున్నది. పై మూడు రాజాస్థానములలో వర్ధిల్లిన కవులయొక్కయు వారి రచనలయొక్కయు పట్టికలుగా కుదిరినవి వీరి ఆయా ప్రకరణములు. సంస్కృతకావ్య వాఙ్మయమందు ఆంధ్రేతర లక్షణకారులు చెప్పని క్షుద్రకావ్య లక్షణములను ఆంధ్రుడైన విద్యానాథుడు చెప్పుటయు, ఉదాహరణాది ప్రక్రియలలో సంస్కృతాంధ్రములలో రచనలు సాగించినవారు ఆంధ్రులే యగుటయు చూచి వీరును, నేటి ఉదాహరణ మీమాంసా రచయితల ననుకరించి, ఇది ఆంధ్రత్వ లక్షణమని తలంచినారు. కాదు. అది ఇదివరలోని యభిప్రాయము. ఉదాహరణాదిక రచనా ప్రక్రియలు మనకు మహారాష్ట్రులనుండి సంక్రమించి యుండునని తోచుచున్నది. ఈ విషయమును గురించి నేను ఈ సంవత్సరాది ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో విపులముగా ఆంధ్రవాఙ్మయముపై మహారాష్ట్ర ప్రభావము అను శీర్షిక క్రింద చర్చించియున్నాను. శ్రీరామమూర్తిగారి గ్రంథము అంతకుముందే రచితమై యుండును.

విజయనగర మాధవ విద్యారణ్యులు భిన్నపురుషులని వీ రభిప్రాయపడుచున్నారు. మఱి విద్యారణ్యు లెవరుగా నుందురు. ములకనాటి బ్రాహ్మణులనియు, 'హరిహర రాయలకు రాజ్యపాలనయందు దవేకులు మిత్రులు హితులు మంత్రులు మున్నగువారు తోడ్పడియున్నారు.

పీఠియం దగ్రగణ్యుడు విద్యారణ్యస్వామి బుక్కరాయలకు ఉదయగిరిని జయించుటకు సహాయభూతుడై యుండిన మాయణ మాధవాచార్యులే సన్న్యసించిన పిమ్మట విద్యారణ్యులను నామము ధరించిరనియు, గావున మాధవాచార్యులును, విద్యారణ్యులును నేక పురుషులే గాని భిన్నవ్యక్తులు గానియు ప్రాచీన కాలమునుండియు నొక ఇతిహాసము పరంపరగ వచ్చుచున్నది' అని శ్రీ డా. నేలటూరి వెంకటరమణయ్యగారు చాలకాలము క్రిందనే సిద్ధాంతీకరించినారు. ఈ యభిప్రాయము పండితావాదమును పడసినది. దీనిని వీరు చర్చించియుండిన బాగుండెడిది.

రెడ్డి వెలమ విజయనగర రాజులలో రాజకీయ స్పర్ధతో కూడ కావ్యవాఙ్మయ నిర్మాణ స్పర్థము నున్నట్లు తోచుచున్నది. శ్రీనాథాది మహాకవులు ఆయా రాజాస్థానములకు పోయి తమ పాండిత్య ప్రకర్షలను వివాద ప్రజ్ఞచే ప్రకటించుటయు, రాజులు కూడ రచయితలుగా విలసిల్లుటయు, శ్రీనాథుడు నైషధమును ఆంధ్రీకరింపగా మల్లినాథసూరిదానికే వ్యాఖ్య వ్రాయుటయు, అద్దంకివాడైన వామన భట్టబాణుడు పెదకోమటి వేమారెడ్డి ఆస్థానివాడై యుండి, కొండవీటికి రాక విజయనగరముననే నాటకాది రచయితగా కాలము గడపుట—ఇత్యాది విషయములు, నాటి పండితుల స్పర్ధలును మనోభావములును కొంత విశ్లేషించియుండిన మనోహరముగా నుండను.

కాటయ వేమారెడ్డిని కొండవీటిరెడ్డి రాజుల ప్రకరణమున పెదకోమటి వేమారెడ్డికి ముందుగా వీరు సమకూర్చినారు. కుమార గిరిరెడ్డి ముందువాడే (1402) గాని కాటయవేముడు ఆ తర్వాత రాజమహేంద్ర రాజ్యమునకు పాలకుడగుటయు పెదకోమటి వేముకాటయవేముల పోరాటములు కొంత కాలము సాగుటయు చరిత ప్రసిద్ధములు. క్రీ శ. 1410 లో కాటయవేముడు విజయనగరమునకు పోయి రాయల సాయ మపేక్షించియుండెను. తర్వాత జరిగిన రామేశ్వర యుద్ధమున కాటయ వేమారెడ్డి పెదకోమటి వేమారెడ్డిని ఓడించుటయు 1416 కు కొంతముందు జరిగిన కాకరపర్తి రణరంగముననో ఎప్పటనో ఓడియో లేక పోరుచునో గతింపగా దొడ్డయ అల్లాడరెడ్డి రాజమహేంద్ర రాజ్యస్థాపకుడగుటయు చారిత్రక విషయములు. ఈకాల క్రమాదికముల ననుసరించి ప్రకరణ శీర్షికను The Reddis of Kondavidu and Rajahmundry అని కూర్చియుండిన విశదముగా నుండి యుండును

చివర ఉపసంహారమునకూడ గుణాఢ్యుని బృహత్కథ సాతవాహనుల నాటిదని యుద్ఘాటించినారు విచారణీయము. నన్నయభట్టు ఆంధ్రశబ్ద చింతామణిని వ్రాసినట్లు చరిత్రకారులొప్పరు. ఇత్యాది అభిప్రాయభేదము లుండినను పలువిధముల ఈ పరిశోధక రచన (థీసిసు) జాపితాగానైనను సకలాంధ్ర గీర్వాణ రచయితలను 'ఒక్కచోటనె యొడగూర్చు' మత్సహింపి కాలాను క్రమమున నిర్మితమగుటచే ఎల్లవారికిని అవశ్యపఠనీయము. మొన్న మొన్నటి రచయితలను కూడ వదలక చక్కని అకారాది విషయ సూచికతోను, ఆధార ప్రమాణ గ్రంథముల పట్టికతోను పరిశోధక విద్యార్థులకు కూడ నిది మార్గదర్శకము.

—వేదము వేంకటరాయశాస్త్రి.

## సాహిత్యసమితి వ్యాసావళి—3

వెల : నాలుగు రూపాయలు. సాహిత్యసమితి, తిరుపతి.

తిరుపతిలోని పలువురు ప్రసిద్ధ సాహితీవేత్తలు సభ్యులుగా ఏర్పడిన సాహితీసమితి 1969–1971 ల మధ్య జరిపిన గోష్ఠులలో వక్తల ప్రసంగాలు కొన్నింటిని ఏరి ఈ వ్యాసావళి మూడవ సంపుటంగా ప్రచురించింది. దీనిలో వాల్మీకి, లీలాశుకుడు వంటి ప్రాచీన కవులనుంచి, శ్రీశ్రీ, దిగంబర కవులవరకూగల అత్యాధునికుల రచనలవరకూ, తెలుగులో వాక్యరచన, స్టైలిస్టిక్సువంటి కేవల శాస్త్రచర్చలనుంచి ఆరు తెలుగు నవలల సోదాహరణ సమీక్షలవరకూ చాలా ఆసక్తిదాయకములయిన వ్యాసాలు పదమూడున్నాయి. ఎంతో సులభంగా బోధించవలసిన అతిసామాన్య లౌకిక విషయాన్ని దేవి దేవళ ఏంచేసి డా. టి. కోటేశ్వరరావుగారు 'సరస్వతీ తత్త్వము—వాల్మీకి' వ్యాసాన్ని అతి గహనంగా తయారు చేసేరు.

# గ్రంథ విమర్శలు

మన ప్రాచీన సాహిత్యకారులు సాహిత్యం పరమార్థం గురించి అనాదిగా సమాలోచన జరుపుతూనే వున్నారు. కవి భావనకు అక్షర రూపం కలిగించినంత మాత్రాన చాలదనీ, సహృదయుడైన పఠిత దానిని చదివి భావస్ఫూర్తి నొందినప్పుడే అది విజయవంతమైనట్లు భావించాలనీ వారు నిర్ధారణకు వచ్చేరు.

కవిభావన, దానికి అక్షర రూపం ఇవ్వడం— ఇదొక అర్ధవృత్తం. చదవరి దానిని అర్థంచేసుకొని రసస్ఫూర్తి నొందడంతోగాని ఆ చక్రం పూర్తి కాదన్నారు.

ఆత్మానందంకోసమే కావ్యం వ్రాస్తున్నామనే వారికీ, కావ్యం ప్రచారాత్మకం కాకూడదనే వారికీ కూడ పూర్వపురుషులు అనాదిగా వున్నారు. వారి కిది సమాధానం.

అయితే ఈ సమాధానానికి దైవత్వం కల్పించేరు. అది ఆనాటి సమాజంలో వున్న విశ్వాసాల ఫలితం కావచ్చు. లేదా దానికి శ్రేష్ఠత్వం ఆపాదించడానికి మాత్రమే చేసిందీ కావచ్చు. పరంజ్యోతి రూపం అనో సరస్వతీ తత్వం అనో ఈ 'చక్రా'నికి మహత్వం ...ంచినా, దాని ప్రాతిపదిక నూహించేటప్పుడు ...ు దృశ్యమాన ప్రపంచాన్నుంచే వుదాహరణలు తీసు...ారు. 'జగద్గ్రావ ప్రక్ష్యం నిజరసభరాత్సారయతి'— ...శ్లోక పాదమే ఇందుకు వుదాహరణ. దానిని ...క్ష్యం చేసి వ్యాస రచయిత కూడా శబ్దం, కావ్యం, ...నం మొదలైన వానికి పూర్వు లిచ్చిన దైవత్వ భావనల దృష్టిలోంచే ఈ వ్యాసాన్ని చివరికంటా నడపడంచేత వారు పండితులని మాత్రమే బాగా అర్థం అవుతూంది చదువరికి విషయ గ్రహణం కష్టమవుతూంది.

డా. ఎస్ టి. వరసింహాచారిగారు వ్రాసిన 'దిగంబర కవిత—ఒక పరిశీలన' ఒక మంచి వ్యాసం. సమాజ పరిస్థితులు చూసి, అనుభవించి, క్రోధోన్మత మయిన యువతరంలోని నిరాశ సాహిత్యంలో దిగంబర కవుల వంటి వారిని సృష్టించింది. 1956 లోనే తిలక్ తన కవితలలో ఈ విషయమై దుఃఖం, క్రోధం, వెగటు చూపించేడు. కుందుర్తి, సి విజయలక్ష్మి మొదలైనవా రెందరినో ఇదే కోవలో పేర్కొనవచ్చు. కాని దిగంబర కవులలో అదొక వుద్యమరూపం తీసుకొంది. దీనికి రెండు కారణాలు. వారొక సంఘటనగా వ్యవహరించడం. అది ముఖ్యమైనది రెండోది వారి రచనారీతి. గతాన్నంతనూ నిరసించి, ద్వేషించి, తోసిపుచ్చే ధోరణీ. తమ్ము సమాజ భవిష్యత్తుకు కర్తలనుగా, నిర్ణేతలనుగా ఆరోపించుకొన్న స్వనిష్ఠిత అతిశయాలోచనాధోరణీ, ఈ రెండో లక్షణం జ్ఞాతంగానో, అజ్ఞాతంగనో వారియెడ ఒక వ్యతిరేక భావాన్ని సృష్టించింది. ఫలితంగా ఆ కవుల రచనలను కవిత్వపు విలువల దృష్టిలోంచిగాని, సాహిత్య లక్షణాల దృష్టిలోంచిగాని చూడ్డం జరగడంలేదు. ఆ దృష్టితో సమీక్షిస్తున్న వ్యాసం బహుశా ఇదే మొదటిది కావచ్చు. శ్రీ నరసింహాచారిగారిది అభినందించవలసిన ప్రయత్నం.

అలాగే 'శ్రీ శ్రీ కవిత్వంలో కొత్త అలంకారం' వ్యాసంకూడా ప్రశంసనీయమయిన కృషే.

'బాల గంగాధరతిలక్ — అభిరుచులు - అలవాట్లు' అన్నది ఒక అసంపూర్ణవ్యాసం. తిలక్ పేకాట వ్యామోహం, వక్కపొడి అభిరుచీకన్న ఆయన కవితలకూ, రచనలకూ వెనుకనున్న 'ఇన్స్పిరేషన్' ఏమన్నా తెలిసివుండి వ్రాస్తే చాల బాగుండేది. అటువంటి ప్రయత్నం వ్యాసం చివరి రెండు పేజీలలో కనిపిస్తూంది. బహుశా ఆ భాగం ఈ సంకలనంలో లుప్తమైపోయిందో యేమో. తిలక్ మరిలేడు. ఆయన అలవాట్లూ, అభిరుచులూ మంచివో, చెడ్డవో అవి ఆయన కుపయోగించవు. మనల్ని కదిలించవు. ఆయనకు బదులు రచనలే మిగిలేయి. వానికి సంబంధించిన సమాచారం ఎంతిచ్చినా మంచిదే ననుకొనే వాళ్లలో నేనొకడిని.

పండితరాయలు వ్యాసంలో శ్రీ కె యస్. రామమూర్తిగారు ఇదివరకు ప్రచారంలో వినివుండని కొత్త విషయాలను ఉపక్రమిస్తూ జగన్నాథ పండితరాయలనుగురించి చెప్పేరు.

'పండితరాయ పదవీ విరాజమాన' అని జగన్నాథ పండితరాయలు ఒకచోట గద్యలో చెప్పుకొన్నారు.

అది బిరుదుకాదు, పదవి. తరవాత ఆయనకది బిరుదుగా రూఢం అయిపోయింది. ఆ పదవిని ఇంకా చాలమందే నిర్వహించి వుంటారు. వారి కథలు ఏమన్నా జగన్నాథ పండిత రాయలకు తగిలిస్తున్నా రేమో. విశేష పరిశోధన జరగవలసిన విషయం ఇది. ఏమంటే భామినీ విలాసంలోని 'ధృత్వాపదసలవ భీతి వశాత్పదంమే' అన్న శ్లోకాన్ని (ఇందులో వివాహ సమయంలో సన్నెకల్లు తొక్కే ఆచారం పేర్కొన్నారు) అది లవంగి పండిత రాయల ధర్మపత్నియే యువడావికి వుదాహరించేరు. ఆ వధువు లవంగియే అని ఆ శ్లోకం వలన ఎల్లా నిర్ధారణ అవుతూందో అర్థం కాదు. ఎవరికన్నా వర్తించగల శ్లోకం అది.

అలాగే 'జగదాభరణం' దారా రాకుమారునిపై రచించిన కావ్యం అన్న అభిప్రాయం కూడా తప్పు. 'శ్రీ రాణా కవికర్ణనందన జగత్ సింహప్రభోర్వర్ణనం'— అన్నది అందులో వున్న శ్లోకమే.

కర్ణాకర్ణిగా విన్న కథలనే చరిత్రగా చెప్పకోడంకన్న విశ్వసనీయమయిన సాహిత్య సాక్ష్యాధారాలతో జగన్నాథ పండిత రాయల జీవితం ఇంకా వ్రాయవలసే వుంది.

ఈ సంపుటిలోని శ్రీ తిమ్మావఝ్ఝల కోదండ రామయ్యగారి 'తెలుగులో వాక్య రచన—గర్భిత వాక్యం', శ్రీ జి. నాగేశ్వరరావుగారి 'Stylistics—సాహిత్య శిల్ప సమీక్ష', శ్రీ ఆచంట జానకిరామ్‌గారి 'ఆరు తెలుగు నవలలు' రచనోత్సాహులంతా తప్పక చదవవలసినవి.

శ్రీ ముట్నూరి సంగమేశంగారి 'శ్రీకృష్ణ కర్ణామృతం' శ్రీ మద్దూరి సుబ్బారెడ్డిగారి 'మాలపల్లిలో మాండలికాలు' సాహిత్య జిజ్ఞాసువులకు చాల వుత్సాహం కలిగిస్తాయి.

శ్రీ జి. నాగయ్యగారి 'ప్రబంధ పరమేశ్వరుని సూక్తివైచిత్రి', డా. జాస్తి సూర్యనారాయణగారి 'తిక్కన యుద్ధవర్ణనలు', శ్రీ కె. జయచంద్రారెడ్డిగారి 'తిరుక్కురళ్ సమీక్ష—2' మన ప్రాచీన సాహిత్యంలోని సొంపులూ, సొబగులూ అర్థం చేసుకొనేందుకు తోడ్పడే వ్యాసాలు.

ఇటువంటి మంచి సంకలనాన్ని అందవేసిన తిరుపతి సాహితీసమితి కృషి అభినందనీయం.

—స్రవంతి

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S. Radhakrishna.